వేంకట నరసింహారావు, నిడమర్తి

# జయచంద్రవిజయము

రాజమహేంద్రవరము, 1919

Record no. 247

## Bibliographic Record Target

వేంకట నరసింహారావు, నిడమర్తి.

జయచంద్రవిజయము / ఇది నిడమర్తి వేంకట నరసింహారావుచే రచియింపఁబడినది.- రాజమహేంద్రవరము : శ్రీవిద్యానిలయముద్రాక్షరశాల, 1919.

253 p. ;18 cm.

Record no. 247

Vēṅkaṭa Narasiṃhārāvu, Niḍamarti.

Jayacandravijayamu / idi Niḍamarti Vēṅkaṭa Narasiṃhārāvucē raciyimpam̐baḍinadi.- Rājamahēndravaramu : Śrīvidyānilayamudrākṣaraśāla, 1919.

253 p. ;18 cm.

Record no. 247

35 mm microfilm

Image placement: IA (IIA) IB IIB Date filming began:

శ్రీలలితా గ్రంథమాల, భీమవరము.

నిడమర్తి వేంకట నరసింహారావు, సంపాదకుఁడు.

# జయచంద్రవిజయము.

నిడమర్తి వేంకట నరసింహారావుచే

రచియింపఁబడినది.



శ్రీవిద్యానిలయముద్రాక్షరశాల,

రాజమహేంద్రవరము.

1919.

వెల 1-8-0



# జయచంద్రవిజయము

## మొదటిప్రకరణము.

---

హిందూదేశసుందరికి శిరోభూషణంబై సకలసంపదలకు నిదానంబై విద్వజ్జనసేవితంబై యోధజనాసాధ్యంబగు నయోధ్యయను పట్టణరాజంబు కరంబుభాసిల్లుచుండును. ఇప్పురవరంబు రాజసింహుండగుసుదర్శనవర్మచేఁ బరిపాలింపఁబడుచు సర్వజనాహ్లాదకరంబై పరఁగుచుండెను. రాత్రియందుఁ గటికచీఁకటి యిప్పట్టణలావణ్యంబును వెలికిఁ బ్రసరింపనీక కప్పివుచ్చుచున్నను బ్రభాతంబున బాలసూర్యుండు నిజకిరణప్రసారంబుచేఁ దచ్ఛృంగారసౌభాగ్యంబును జూపరుల నేత్రంబులకమితపర్వంబుగాఁ బ్రకాశింపఁజేయుచుండెను. రాత్రియంతయుఁ జీఁకటినిమునిఁగియున్న సృష్టివిలాసంబు నరుణోదయావసరంబున మరల నెప్పటియట్ల ప్రకాశించుచున్నను నన్నగరి చెఱసాలం దాఁగియున్న సాంద్రతమంబందు బంధింపఁబడిన పడుచుకుఱ్ఱవాని నేత్రదృష్టిని నిరర్థకము చేయుచున్నది. ఆచిన్నవాఁడా చెఱయందొక్కమూలఁ గూర్చుండి తెల్లవాఱినది

లేనిది తెలియక దీనభావముతోఁ దహతహ పడుచుండెను. నాలుగుమాసంబులనుండి సూర్యకిరణ ముఖావలోకనంబైన నెఱుంగక యీ గుహాంతరంబునం జిక్కి కడుపార భుజింప నశనంబైన లేక బాధపడుచుండెను. నిమిషములుగాను గంటలుగాను పరుగెత్తుచున్న దీర్ఘకాల మీకారాగృహ విముక్తిగలిగి ముందెప్పటికైనను సౌఖ్యపడఁగలననెడి యాశ నీచిన్నవాని హృదయముననుండి తఱిమివేసెను. ఎప్పటికైనను దాను స్వేచ్ఛ పొందఁగలననెడి నమ్మిక యెండమావులలోని జలమువలెనే వానిని భ్రమపెట్టి తుదకు వానికి నిస్పృహత్వమును గలిగించెను. ఎట్లయిన నీకారాగృహ బంధమును దొలఁగించి రక్షింపవలసినదని యొక్కొకతఱి నిబ్బాలకుం డీశ్వరుని వేఁడికొనుచుండును. ఎంతవేఁడినను నింతదనుక నీశ్వరానుగ్రహము లభింపనందులకు విచారించుచు నబ్బాలకుఁడు "ఓమహానుభావ! దీనజనులయార్తిని బోఁజిమ్మి రక్షించెడు నీకు నాపై నించుకైనను గృపలేక పోయెనా! నాఁడు గజేంద్రుఁడు మకరిచే బాధపడునప్పుడు వానిమొఱవిని రక్షించిన కరుణాసముద్రుండ వీవుగావా? కన్న కుమారుని బాధించి చంపనుంకించిన దుర్మార్గుని బారిగొని బాలకునిరక్షించిన యార్తరక్షణపరాయణత్వంబు నేఁడు నాయెడ మఱచితివే? ఈశ్వరా! యజ్ఞానంబున నే నేదురితంబుల నాచరించితినో నెఱుంగఁగాని ప్రాజ్ఞతపొడమినది మొదలు నే నేపాపంబును జేసియెఱుంగ. తల్లిదండ్రు నే నెఱుంగకపోయినను నన్నుఁ గడుగారాబముతోఁ బెంచియున్న కాశ్మీరరాజనతం



సునే తండ్రిగా భావించికొని దినంబులు గడపుచున్నను, ఆయనసహితము నాపై దయదొఱఁగి తనరాష్ట్రమునుండి వెడలఁద్రోయుట నాయభాగ్యత్వంబుగాక వేఱొక టేమున్నది? సర్వదేశంబులఁదిరిగి సర్వవిద్యల నభ్యసించి పండితవరేణ్యులలో నగ్రగణ్యుఁడ నని బిరుదునొందుటయేగాక రణపండితుఁడ ననియు శూరవరుఁడననియుఁ బేరుపొందిన మేటి కీపాటుపాటిల్లుట, కటకటా! కాలవక్రత నాకే[illegible]ఁక నేమున్నది? ఓసుగుణమంజరీ! నీకు విద్యగఱపిన నీగురుపుత్రునవస్థకు నీవెంత పొగులుచుంటివోగదా! ఓమామినీప్రాణరక్షకా! ఓభువనమోహినీ! మీయొద్దఁజేరి విద్య నేర్పెడి భాగ్యంబు నాకిఁకఁ గలుగనేరదు గదా! ఓసుగుణమంజరీ! నీవు నాఁడు నీమనోవాంఛితంబును నీప్రియజనకున కెఱిఁగించుటచేతనె నాకీయనర్థంబు వాటిల్లియుండును. అయినను నేను నిరపరాధినే గదా! ఈశ్వరా! మనుష్యమాత్రుఁడగుటచే రాజెఱుంగలేక పోయినను నాహృదయశుద్ధి సర్వసాక్షివైన నీవెఱుఁగవే" యని వెక్కివెక్కి యేడ్చి నిశ్చేష్టితుండై యుండెఁ గారాగృహకవాటబంధంబు ఖణేలని చప్పుడయ్యెను. అంతఁ దలుపు తెఱచి రాజభటుం డొక్కరుఁడు కరదీపికం జేఁదాల్చి లోనికేతెంచెను. అద్దీపికావికాసం బాకారాగృహాంతరాళము నంతయు దట్టంబుగా వ్యాపించుటం జేసి యందు బంధింపఁబడిన దురదృష్టవంతుని యాకారసౌజన్యంబు లాభటుని దృష్టికి జక్కఁగాఁ గనుపించుచుండెను. చందురునిం గేరు వానిమోమును తీరును ఆకర్ణాంతమైన వానినేత్ర

యుగళంబును విశాలమైనవానివక్షస్స్థలంబును వేదండతుండంబులంబోలు వానిబాహుదండంబులును, ఆతండు మిగుల నందగాఁడని తెలియఁజేయుచున్నవి. ఆతనినూనూఁగుమీసంబులును, కోమలగాత్రంబును, నాతనిప్రాయంబు వింశతిహాయనంబులని నిరూపించుచుండెను. ఈబాలకుని సౌందర్యమూర్తిమత్త్వమును గాంచినప్పుడు రాజభటుండు వానియవస్థకు మిగులఁ బరితపింపఁ దొడంగెను. అంత నాబాలుండా భటునిఁజూచి "ఓయీ! ఈరాత్రి నీవిట కేలయేతెంచితివి? సూర్యోదయంబునకింకను నెంత వ్యవధిగనుపించుచున్నది? నాచెఱ విముక్తికి రాజాజ్ఞ యొసంగియుండెనా" యని మిగుల నాతురతతో నడిగెను.

"ఈచెఱం బ్రవేశించినవారి కెవ్వరికి నింతవఱకు సంతోషవార్తాశ్రవణ మెప్పుడును లేదు. నీవీగుహఁ జొచ్చినప్పుడే మృత్యుగహ్వరముఁ బ్రవేశించినట్లు భావించుకొనుము. నారాకకుఁ గారణము నిన్ను విడిచిపెట్టుటకుఁగాదు. రాజానుమతంబున నిన్ను విచారణస్థలంబునకుఁ గొనిపోవనేతెంచితి" నని భటుఁడు చెప్పెను. అంత నాకుఱ్ఱవాఁడతిదైన్యముతో "ఓయీ! నన్ను రాజింతక్రూరముగా దండించుటకు నేనేమినేరముఁ జేసితిని? నాపైఁ జేయఁబడిన దోషారోపణ మీవెఱింగితివేని దయయుంచి నీవు దానిని నాకెఱింగింపుము."

రాజభటుఁడు—ఒకరు చెప్పనక్కఱ లేకయే విచారణానంతరంబున నీవాచరించిన నేరంబు, నందులకుఁ దగినశిక్షను బ్రభువారే సెలవిచ్చెదరు.



ఖయిదీ—నాపైఁజేయఁబడిన దోషారోపణము నీకించుకైనను దెలియకపోదు. దయయుంచి దానిని నాకెఱింగింపవేఁడుచున్నాఁడను. అని దీనత్వముతో మరలమరల వేఁడికొనెను. అందుపై నాచెఱసాలాధికారి కనికరపుహృదయుఁడై "ఓయీ! నీవు కోరినవిషయమును నేను నివేదించుటవలన నీపరితాపభరము మఱింత యతిశయించునేగాని దానినించుకయుఁ దగ్గింపనేరదు. పాపము! నీవిట్లడుగుచుండుటచే నేను దానిని దెలియఁజేయుచున్నాఁడను. మన రాజేంద్రుఁ డొకనాఁడు సంప్రాప్తయౌవనయగు దుహితృరత్నంబును గాంచి కన్నుల నీరునించుచు "శ్యామలా! అగవు తగవులనిచ్చి నిన్నానందింపఁజేయ లేకపోయినను నీకుమారుని కీసుగుణమంజరి నొసంగి నీతో వియ్యమందనోచనైతిని. ఆదురాత్ముఁడు నిన్నును నీమగనినివధించుటయేగాక నీసంతానమునుసయితము రహస్యముగాఁ గడతేర్చి నీయంకురమును మొదలంట పెఱికివైచెను. ఇట్టిదోషకృత్యంబుల నాచరించిన ప్రతాపరుద్రుఁడే చల్లగా వర్ధిల్లుచున్నవాఁడు. దైవంబును దోషకారులకే తోడ్పడుచుండునుగదా!" అని కొంతవడి వగచి సుగుణామంజరిం బిలిచి "అమ్మా! ఈభరతఖండంబునంతయు ననర్గళ భుజావిక్రమక్రమంబున నేకచ్ఛత్రాధిపత్యంబుగ నవక్రతం బరిపాలించుచున్న విష్వక్సేనసార్వభౌమునికి నిన్నొసఁగి వివాహంబు సేయఁబోవుచున్నాఁడను. నీవీవసుంధరారమణికి సవతివై శ్రీమహాలక్ష్మివలె సకలసిరులం జెన్నారుచు సుఖింతువుగాత;"

మని నుడివినప్పుడు సుగుణమంజరి తెల్లబోయి నిమిషకాలంబు
విచారించి యవనతవదనయై యీ రెలుంగున " తండ్రీ ! నాకు
విద్యగఱపిన జయచంద్రుని నేనునామనంబున నిదివఱకే వరిం
చితి. వానింగాక నేనన్యునిఁబాణిగ్రహణంబుసేయనొల్ల " నని
నుడివినతోడనే యాభూపతీంద్రుఁడాజ్యధారాప్రజ్వలిత హు
తాశనుపోల్కి క్రోధరసావేశంబున మోముజేవురింప " ఔ
రా ! మర్కటీ! యెంతచేసితివి? నీవు కపటపుబ్రాహ్మణుఁడ వని
నే నెఱుంగక యోగ్యుండవనియుఁ బండితుండవనియు భావించి
నాముద్దులకూఁతునకు విద్యఁగఱప నొజ్జఁగా నేర్పఱిచిన పాప
ఫలము వెంటనేపొందఁజేసితివి. కానిమ్ము! నీకుఁదగినప్రాయ
శ్చిత్తమును నేనొనర్చెద " నని గంభీరస్వరంబుతో నుడివి
నిన్ను చెఱయందుంచెను. అపుడుజయచంద్రుఁడు " ఆమెను
నే నట్లనుమంటినా ? ఆహా ! రాజులెంతమదోన్మత్తులు ! తమ
యధికారబలముచే నెట్టి నిరపరాధులనైనను బాధించుచు
న్నారు. ఇందుచేతనే ' రాజ్యాంతే నరకం ధ్రువమ్ ' అను పెద్దల
వాక్యంబు సత్యంబని తోఁచుచున్నది " యని జయచంద్రుఁ
డాశ్చర్యపడుచుండ రాజభటుఁడు మరల " ఆకన్యకామణి
కోరికకు నీప్రోత్సాహమే కారణంబని రాజు దృఢనిశ్చయుం
డైయుండె. నేఁడు నీశిరచ్ఛేదంబునకు నుత్తరమియ్యఁబోవుచు
న్నాఁడని ప్రజలు చెప్పుకొనుచుండిరి. పాపము సుగుణమంజరి
తనతండ్రియుద్దేశమును నెఱింగి నీవు నిరపరాధివనియు నీమ
దుస్వభావమును యోగ్యవర్తనంబును, పరిశీలించినప్పుడీకోరిక



తనహృదయమునఁ గలిగినదనియు నీవందులకు సమ్మతింపనే
లేదనియు మొదలయిన విషయములనేకములుచెప్పి మహాదుః
ఖంబుతోఁ దండ్రిపాదంబులంబడి యెన్నివిధముల వేఁడినను
నాకఠినహృదయమించుకయుఁ గఱగకపోయెను. " అనిచెప్పి
వానిచేతులకు సంకెలలందగిల్చి వానినిరాజసభకుఁ గొనిపోయి
రాజునెదుట నునిచెను. అంతట రాజభటులనేకులు తమహస్తం
బులఁ దళతళమెఱయుఖడ్గంబులందాల్చి యయ్యపరాధినిబరి
వేష్టించిరి. అపుడు సుదర్శనక్ష్మాతలేంద్రుండు జయచంద్రునిఁ
గ్రూరనిరీక్షణంబులనీక్షించి " ఓరీ ! కులపాంసన ! ఎంతపని
చేసితివి ? యింటఁగుడిచి యింటివాసములు లెక్కించెనన్నట్లు
నాయింటఁగుడిచి నాకెంతయపయశముఁ గొనితెచ్చితివి ? నీవు
చదువుకొన్న బ్రాహ్మణుఁడవనియు, బుద్ధిమంతుఁడవనియు
భావించి నాకుమారికకు విద్యనేఱుప నియమించినందులకా
యామెకీ దురభిప్రాయమును గలిగించి నాకీ మహోపకారము
జేయఁగడఁగితివి? కానిమ్ము ! నీపాపఫలము నిప్పుడే యనుభ
వింపఁజేసెద " నని కోపదృష్టితోఁ గన్నులెఱ్ఱఁజేసి జయచం
ద్రుని జూచుచుండెను. ఈదురాగ్రహపరుని యెదుటనేమిచెప్పి
నను లాభములేదనియు భుజదర్పమును జూపుటకైనను నిది
తఱిగాదనియునెంచి తనకుఁ బ్రాణావసానము సమీపించుచు
న్నందులకు నంతగావిచారింపకపోయినను దనవంటి శూరాగ్ర
గణ్యునకంతటి యవమానము గలుగుచున్నందులకు మిగుల
సిగ్గుపడి తలవంచుకొనెను. అంత రాజు కొత్వాలునుబిలిచి

"ఓయీ ! వీనినురితీయుము" అని యుత్తరువిచ్చెను. వెంటనే రాజభటులు వాని నురిదీయుటకు నురిస్తంభములవద్దకుఁ గొనిపోవుచుండిరి. అప్పుడు ప్రజలు గుంపులుగుంపులుగా గుమిగూడి యీయపరాధినింగూర్చి యిట్లు చెప్పుకొనుచుండిరి. "ఈయూరుచేరిన నాఁటనుండియు యీపేదమానవుని మనము చూచుచుంటిమిగదా. పరస్త్రీనెన్నఁడును గన్నెత్తిచూచియెఱుంగఁడు. కానిపని నెన్నఁడీతఁడు చేసియున్నట్టు మనమింతవఱకు వినియుండలేదు. ఇట్టిపరిశుద్ధప్రవర్తనగల యుత్తమపురుషునకు నేఁడెట్టిదుర్మరణము సంభవించుచున్నది ? ఈరాజెంత దుర్మార్గుఁడు ? దోషులైన కూఁతుండ్రదండింపనేరక నిర్దోషియైన యీపావనచరిత్రుని ఘోరముగాహింసింపఁబోవుచున్నవాఁడు. హాదైవమా ! నీవెక్కడదాఁగియుంటివి " అని కంటఁ దడిఁబెట్టుకొనుచుండిరి. మఱికొందఱు "నిజము దేవుఁడెఱుంగు నీరుపల్లమెఱుంగు. వీనిదితప్పో లేక రాజు వీనిని శిక్షించుటయెతప్పో యెవరెఱుంగుదురు ?" అని చెప్పుకొనుచుండిరి. ఆగుంపునొత్తిగించికొని పదునైదు వత్సరముల ప్రాయముగల కన్నియయొకతె కన్నులనీరుగార్చుచు "గురువర్యా ! మారాజకన్యకమూలమున మీకెట్టిదుర్మరణము సంభవించుచున్నది" అని గుండెలుమోదికొనుచు నేలఁబడి యేడువసాగెను. అప్పుడు రాజభటులు వానిని నురిస్తంభమునొద్దకుఁగొనిపోయి యురిదీయఁబోవుచుండిరి. అంతలో రాజభటుఁడొకఁడు "ఆఁగు ఆఁగు" మని కేకలువైచుచుఁ బరుగెత్తికొనివచ్చి కొత్వా



లునకు రాజముద్రికతోఁగూడిన కాగిద మొకదానిని జూపెను. కొత్వాలు దానిం జదువుకొని "యిప్పటికి నీచావుతప్పినది పదపద" యని వానిని మరలరాజసభకుఁ గొనిపోయెను.



## రెండవప్రకరణము.



ఇది వేసంగికాలమగుటచేఁ బడమటిగాడ్పు మిగులఁ దీక్ష్ణముగా వీచుచున్నందున బయళ్లయందలి పచ్చిక మలమల మాడుటయే గాక లేఁతచెట్లుసయితము మిగుల వాడిపోవుచున్నవి. చెట్లమీఁదనున్న పక్షివితానంబు గాడ్పుబాధకుఁ దాళఁజాలక చెట్లతొఱ్ఱలయందును, పాడుదేవళములయందును దాఁగుచున్నవి. జలజంతువులు సయితము పైకిఁ దలఁజూపనేరక లోతునీళ్ల నడఁగియున్నవి. వీధులలోనియిసుక యెండవేఁడిమికిఁగాలఁగ మార్గస్థులకు వట్టికాళ్లతో నడువ వీలులేకుండెను. అట్టిసమయమునందు నలుగురుబ్రాహ్మణులు నెత్తిపైఁ దడియంగవస్త్రములఁ గప్పుకొని పాదరక్షలు లేనందున గాళ్లు కాలుచుండుటచే గుబగుబ నాలుగడుగులునడచి మధ్యమధ్యఁ గొన్నిబారలదూరము పరుగెత్తుచువచ్చి యొకపెద్దమనుష్యుని వీధియరఁగునకుఁ జేరగిలఁబడి నిలుచుండి యీవిధముగా సంభాషింపఁదొడఁగిరి.

వేంకటశాస్త్రి—ధనపాలునికిఁ జాల జబ్బుగానున్నదఁట! జీవితాశయే లేదని చెప్పుకొనుచున్నారు.

సూరంభొట్లు—పోనీ చావనీ మాదిగగాడిదకొడుకు. ఇంతధనము సంపాదించినాఁడనుమాటయేగాని తనచేతితో నొకబ్రాహ్మణునకైన రాగిపైస నిచ్చినపాపమునఁబోలేదు. ఈపాడుముండాకొడుకిప్పు డీధనమును నెత్తిని బెట్టుకొని పట్టుకపోవఁ గలఁడా ?

వేంకటశాస్త్రి—వాఁడు మలభక్షకుఁడు. ఒరులకిచ్చుట యటుండనిమ్ము; కలిగియున్నదని తానైనఁ గడుపార భుజించి యెఱుఁగునా ?

సుబ్బావధానులు—ఇతఁ డెంతధనవంతుఁడు ? ఈతని స్థితిగతు లెట్టివి ?

వేంకటశాస్త్రి—ఈతఁ డెంతధనవంతుఁడని యడుగుచుంటివా ! ఈతని యింటనున్నధనము చక్రవర్తిధనాగారము నందైనను లేదు. ఈతండు కోటీశ్వరుండని లోకులు చెప్పుకొనెదరు. ఈతనియింటనున్న రత్నరాసులు కుంచములతోఁ గొలిచి యిన్ని గరిసెలని లెక్కింపవలయునేగాని చేతితో లెక్కపెట్టుటకు వీలులేనిది. ఈమూలధనము మాత్రమేగాక వానికి భూవసతివలన సాలున కేబదివేలవరహాలు రాఁబడికలదు. ఈపట్టణములోని దివ్యభవనములలో మూఁడువంతులు వానివే.

సుబ్బావధానులు—ఈతఁడింతధనమెట్లు సంపాదించెను? ఈతని కులమెద్ది ?



వేంకటశాస్త్రి—ఈతఁడు కులమునకు క్షత్రియుఁడైనను ననేకవైశ్యులను జంపిపుట్టినాఁడు. పూర్వ మీతఁ డోడలవర్తకమువలన నీధనమును గొంతవఱకు సంపాదించినాఁడఁట. ఇది యెంతవఱకు నిజమో నే నెఱుంగనుగాని యిందులో చాలభాగ మన్యాయార్జితమని ప్రజలు చెప్పుకొనెదరు.

సుబ్బావధానులు—ఇంతధనము గలిగియున్నందులకుఁ దగినధర్మమైన నున్నదా ?

వేంకట—సరిసరి రామాయణమంతయువిని రాముఁడు సీత కేమగునని యడుగుచుంటివి? ఇంతవఱకు మనముమాటాడుకొనుచున్న సంగతులన్నియువిని నీవిట్లడుగుచుంటివి. ఈతఁడు వట్టిపరమలుబ్ధుఁడు. బిచ్చగానికైన నెన్నఁడు గుప్పెడుగింజలు ముష్టివేసి యెఱుఁగఁడు. మూఁడణాలయిన కిమ్మతుచేయని కొల్లాయిగుడ్డయేగాని మోకాలుదిగిన పెద్దబట్ట నెన్నఁడుఁ గట్టి యెఱుఁగఁడు. ఒకపూట "యర్ధాకలి" కూడుమాత్రమేగాని, కడుపార రెండుపూటలును, భుజించుటలేదు. ఈతనికుటుంబమున కితఁడును, నీతనికుమారుఁడు మాత్రమే. రెండుసంవత్సరములక్రిందట, నీతనిభార్య కాలముచేసినది. అప్పటినుండియు నాలుగురూపాయల నిచ్చి వంటలక్కను బెట్టుకొనవలసివచ్చి నందున డబ్బు వ్యయమగుచున్నదని యేడ్చుచున్నాఁడు.

సూరంభొట్లు—లుబ్ధులధన మెప్పుడును నిరర్థకమే. ఇతరుల కెవరికిని దమచేతితోఁ బెట్టరు. తా మనుభవింపరు. నాబోటి నిర్ధనుండు తిండికిలేక బాధపడుచుండును. లుబ్ధుఁడైన ధనా

ష్యుఁడు దాని ననుభవింపలేక చూచుకొని సంతోషించు చుండును. నిర్ధనుఁడు లేమిచే ననుభవింపలేకపోవుచున్నాఁడు. ధనవంతుఁడు తాను గలిగియుండియు ననుభవింపలేకపోవుచున్నాఁడు. ధనవంతునికిని నిర్ధనునకును గలభేద మిదియే.

వేంకటశాస్త్రి—అంతేకాదు. నిర్ధనునకు లేనిదుఃఖ మొక్కటియే. ధనవంతునికో దానిని దాఁచుటయందును, ననుభవించుటయందును దాని నాశమందునుగూడ దుఃఖంబు.

సుబ్బావధానులు—అవును నిజమే. భర్తృహరి చెప్పినట్లు దానము, భోగము నెఱుఁగనిలుబ్ధునిధనమునకు నాశమే గతి. ఈతని ధనమునకును నీగతియే సంభవించును. దీని నెవ రనుభవింపఁగలరు?

వేంకటశాస్త్రి—ఈతని కుమారుఁ డనుభవింపఁగలఁడు.

సుబ్బావధానులు—ఆతఁడును తండ్రికన్న నెక్కువ లుబ్ధుఁడై యుండవచ్చును. వాఁడును దీనిననుభవింపఁ జాలఁడు. తుదకీధనమంతయు నేదొంగలపాలో యేదొరలపాలో కావలసినదే.

వేంకటశాస్త్రి—నీవట్లనకుము. ఈతనికుమారుఁడు కృపాసింధువు; తండ్రివంటివాఁడు కాఁడు. ఆతఁడు చాలమంచివాఁడు; నీతిపరుఁడు. పేరునకుఁ దగినవాఁడు. మహాదాత. ఆతఁడు తండ్రిచాటువాఁడగుటచే నేఘనకార్య మింతవఱకుఁ జేయఁజాలకపోయినను, ఆతని ధర్మబుద్ధి నాతనిముఖలక్షణము వెల్లడించుచున్నది. దయ, సత్యము, శాంతి, దమము, శమము



మొదలయిన సుగుణములన్నియు మూర్తీభవించి వీనిరూపమున నవతరించినట్లు ఆతని నెఱింగినవారందఱు చెప్పుకొనుచుందురు. కుమారుఁడు తెలివిహీనుఁడనియు ధనమును ఖర్చుపెట్టి పాడు చేయుననియుఁ దండ్రి వానినెల్లప్పుడు కోపించుచుండును. కృపాసింధున కిప్పుడు పదునాఱువత్సరముల ప్రాయమైయున్నను త్యాగవంతుఁ డగుటచే ధనమును వ్యయపెట్టునను భయముచేఁ దండ్రి వాని నేవ్యాపారమునకు రానిచ్చుటలేదు.

సుబ్బావధానులు—అట్లయిన నీలుబ్ధాగ్రేసరుఁడు త్వరలో నీలోకమునువిడిచి పరలోకయాత్రకుఁజనుటయే యుత్తమము. అరుగో! బ్రాహ్మణులందఱు నిచటకే కాఁబోలు వెళ్లుచున్నారు. మనముకూడ వెళ్ళుదము త్వరగా రండు. ఈసంభాషణము జరుగుచున్నప్పుడాయింటియజమానుఁడు వీథిగదిలోఁ బడకకుర్చీలోఁ బరుండి సేవకునిచేఁ బంకా విసరించుకొనుచుఁ గిటికీలోనికిఁ దలవంచి యీసంభాషణమును వినుచుండెను. ఇంతలోఁ దలుపువద్ద నెవ్వరో తలుపుతట్టి "శివశంకరపాండ్యా! శివశంకరపాండ్యాజీ!" యని పిలువఁదొడంగిరి. వెంటనే కుర్చీలోఁగూరుచుండియున్న పెద్దమనుష్యుఁడు లేచి తలుపుతెఱచి "ఏమిరా" యని యడిగెను. "అయ్యా! ధనపాలునకుఁ బ్రాణముమీఁదికి వచ్చినది. జీవించుటదుర్ఘటమని చెప్పుకొనుచున్నారు. మిమ్ములఁద్వరగాఁ దీసికొనిరమ్మని యబ్బాయిగారు నన్నుఁ బంచినారు" అని చెప్పెను. ఈవర్తమానము విన్నతోడనే శివశంకరపాండ్యా తెల్లబోయి యేమిచేయుటకును దోఁచక కొంచె

ము నీవు నాగదిలో నీమూలకును నామూలకును దిరిగి తుదకు దండెమున వ్రేలాడుచున్న యంగీని దొడిగికొని సన్నవస్త్రము నొకదానిని బైని వేసికొని “సేవకా! బండిని దీసికొనిరమ్మ” ని కేక పెట్టెను. వెంటనే సేవకుఁడు బండిసిద్ధముజేసి వీథిద్వారమునొద్ద నిలిపినతోడనే శివశంకరపాండ్యా బండిలోఁ గూర్చుండెను. బండిమనుష్యుఁడు బండి నతివేగముతోఁ దోలుకొనిపోయి యావల వీథిలో నొక పెద్దభవనమువద్ద నిలిపెను. శివశంకరపాండ్యా వెంటనే బండిదిగి తెఱువఁబడియున్న యా దివ్యభవనముఁ బ్రవేశించెను. ఆయింటిలోని మనుష్యులందఱును మిగుల గందరగోళముపడుచుండిరి. శివశంకరపాండ్యా మొదటివాకిలి దాఁటి రెండవవాకిలి ప్రవేశించునప్పుడు శుష్కించియున్న యొక్క వృద్ధవనిత కన్నీరునించుచు “నాయనా! యింతవఱకు ముంచుకొనివచ్చినది. ఈగదిలోఁ బరుండఁబెట్టినాము” అని చావిటిలోనున్న గదిలోనికి వానినిఁ దీసికొని వెళ్ళెను. ఆయరఁగుమీఁదఁ గొందఱు బ్రాహ్మణులు గూర్చుండి యేదియో మెల్లఁగా వారిలోవారు సంభాషించికొనుచుండిరి. శివశంకరపాండ్యా యాయరఁగు సమీపింపఁబోవుచున్నప్పుడు పెద్దమనుష్యుఁడొకఁడు “అన్నగారూ! ఈవిధముగా సంభవించినది” అని వానిని గదిలోనికిఁ గొనిపోయెను. ఆగదిలో గవాక్షము సమీపమున నొక పట్టెమంచముమీఁద నేఁబదివత్సరముల వయస్సుగల మనుష్యుఁడొకఁడు మరణబాధ నొందుచుండెను. పదునాఱువత్సరముల ప్రాయముగల కుఱ్ఱవాఁడొకఁడు దీనవదనముతో రోగిపాదములవద్దఁ గూర్చుండి పాదములొత్తుచుండెను. అప్పుడు శివశంకరపాండ్యా “బావా! ఇలాగునున్నావేమి? నీకేలాగునున్నది” యని యడిగెను. అప్పుడారోగి పాండ్యాకేసి తేఱిపాఱఁజూచి యాయాసముతో “ఏమిచెప్పను? బాధ యధికముగానున్నది” అని చెప్పెను. అపుడు వద్దనున్న కుఱ్ఱవాఁడు “మామా! నాన్నగారికి శోష వచ్చినది. పళ్లుకఱచుకొనిపోయినవి. కన్నులుతేలవేసినారు. మాటలేదు. మేమందఱము గొల్లుమన్నాము. అప్పుడుచూచినవారు గోధుమజావకాచి పోయుమన్నారు. అంతలో నాన్నగారికిఁ దెలివివచ్చి గోధుమనూకకు డబ్బువెచ్చపెట్టెదవాయని కొననిచ్చినారుకారు. తుదకింటిలోనున్న వరినూకలు మాత్రము కాచిపోసినాము. నాన్నగారిదేహస్థితి నిన్నటికన్నను బాగుగానున్నది.

శివశంకరపాండ్యా—అబ్బాయీ! నీవు త్వరగాఁబరుగెత్తుకొనిపోయి డాక్టరుగారిని దీసికొనిరా!

రోగి—వద్దు, వద్దు, డాక్టరువద్దు. కుదరవలసినయోగముండిన నదేకుదురును. డాక్టరువచ్చి వచ్చుటతోడనే పదో పంద్రెండో తెమ్మనును. మఱి రెండులంఖణములుచేసిన యెడల నదేకుదురును.” అప్పుడు వద్దనున్న ముసలామె “కడుపునిండ నన్నముతినక పోవుటచేతనే యీమహారాజున కింతదురవస్థపట్టినది. తానుదినక పోవుటసరిగదా యింటనెవ్వరిని బూర్తిగాఁ దిననియ్యరు. అపుడు రోగి యాయాసముతో “చాలు

నోరుమూసికో. నిన్న యన్నినూకలు కాఁచిపోసి చేసినావు. మాసంసారమునకు మారకురాలవు నీ వొకదానవుపోఁగయితివి. నాకీజబ్బు నీమూలముననే సంభవించినది.'' అని బాధతో మెల్లఁగా లేచి బాలీసునకుఁ జేరగిలఁబడి హీనస్వరముతో ''నీకునెల్లప్పుడు తిండి. తెల్లవాఱినఁ దిండి. తవ్వెడుబియ్యము కుంభము చెల్లించుటతప్ప నీకు వేఱుపనేదియు లేదు. తవ్వెడుబియ్య మీ రోజులలో నాలుగుకాసులకు ఖరీదు. నీవికను మాయింటఁ గొంత కాలమున్నయెడల మేము చిప్పచేతఁబుచ్చుకొని బిచ్చమెత్తుకొనవలసినదే. అబ్బా! యేమి యీబాధ! ఈదిక్కుమాలినప్రాణము త్వరగాఁబోకున్నది'' అని వెనుకకుఁ జేరగిలఁబడి యావంకకు నీవంకకుఁ గొట్టుకొనుచుండెను.

శివశంకరపాండ్యా—అబ్బాయీ! ఆలాగు బాధపడుచుండఁగా నుపేక్షించి యూరకుండుట ధర్మముగాదు. డబ్బ నేనైన నిచ్చుకొనెదను. డాక్టరుగారిని నొక్కమాఱు తీసికొని రమ్ము.

రోగి—వద్దు. డాక్టరును దీసికొనిరావద్దు. నేను డాక్టరు వద్ద నౌషధము పుచ్చుకొనను. ఆతఁడు పాలు రొట్టెతినుమంటాఁడు. వాని సొమ్మేమయిపోయినది? అసక డబ్బునకు బాధపడువారము మేము. నావద్ద రాగిపైస లేదు. నేను రొట్టెగాని, పాలుగాని కొనలేను.

శివశంకరపాండ్యా—డాక్టరు వీలులేకపోయెనేని మన నేటివు వైద్యుఁడు సదాశివమూర్తినైనను దీసికొనిరమ్ము. అతఁడు మంచిసాధకుఁడు; బుద్ధిమంతుఁడు. త్వరగా వెళ్లుము.



రోగి—చచ్చుచున్నవానిని మఱింత చంపకుము. నాకు వైద్యుఁడువద్దు గీద్యుఁడువద్దు. అతఁడు కిరాణాదినుసులు తెమ్మంటాఁడు. నావద్ద డబ్బేమున్నది? నాయనా! నన్ను పాడుచెయ్యకండి. ఇట్లు చెప్పుచుండఁగా రోగికన్నులు మూఁతలుపడి వగర్పు మిక్కుటముగానుండెను.

శివశంకరపాండ్యా—అబ్బాయి! మననారాయణశాస్త్రికైనను త్వరగా కబురుపంపుము. అతఁడు తనకుఁదోఁచినదానిని వేయును. ఎందుకైనను మంచిదే. ప్రాయశ్చిత్తము చేయింతము. బ్రాహ్మణులకు వర్తమానము పంపుము. ఇఁకఁ గార్యముండునని నేను యోజింపఁజాలను. తెలివి తప్పుచున్నది. బాధ యధికమగుచున్నది.

కృపాసింధు—''మామగారూ! నాకీసంగతి యిదివఱకే తోఁచినది. నే నీయుదయముననే వర్తమానము చేసియున్నందున బ్రాహ్మణులు వీధియరుఁగుమీఁదఁ గూర్చుండియున్నారు. నారాయణశాస్త్రికొఱకు నెవరినైనఁ బంపెదను'' అని కృపాసింధువు వీధిలోనికి వెళ్లెను. రోగి కపుడు కొంచెము తెలివి వచ్చినందున, శివశంకరపాండ్యాను వద్దకురమ్మని సంజ్ఞజేసి ''బావా! మొన్న నాకు జీవింపనని యధైర్యము తోఁచినందున నాపిల్లవానికి యుక్తవయస్సు వచ్చువఱకుఁ జరస్థిరరూపకమైన నాసర్వస్వమును భద్రముచేయవలసినదని కోరుచు నాయాస్తి నంతయు దొరతనమువారికి వశపఱిచితిని. ఇదిగాక నాపిల్లవాని ప్రస్తుతోపయోగమునిమిత్తము నాలుగులక్షలను పెట్టెయం

దుంచితిని. వ్యవహారసంబంధమైన కాగితములన్నియు నా పెట్టె యందే దాఁచితిని. పిల్లవాఁడు వట్టియవివేకి. డబ్బు పాడు జేయునని భయపడుచుంటిని. దయతో నీవు వానిని గూర్చి జాగ్రత్త తీసికొనఁ గోరుచున్నాను. పిల్లవానిని నీకు నప్పగించి తిని." అనిచెప్పి కన్నులుమూసికొని శ్వాసలు విడుచుచుండెను. ఇంతలో కృపాసింధువు నారాయణశాస్త్రికి వర్తమానముపంపి వీథిలోనున్న బ్రాహ్మణులను లోనికిఁ దీసికొనివచ్చెను. అప్పుడు బ్రాహ్మణులు రోగిమంచమువద్దఁ గూర్చుండి మంత్రములు చదువుచు నేదియోతంత్రమును నడుపుచుండిరి. ఆమధ్య నొక మాఱు ధనపాలునకు మరల తెలివివచ్చి "ఏమిరా! యిది యంతయు నేమిగందరగోళము? డబ్బు పాడుజేయువఱకు నీకు నిదురపట్టదు. అనక బిచ్చమెత్తుకొందువుగానిలే; నీగతియంతే పట్టెఁది" అని బ్రాహ్మణులఁజూచి "నాచెవివద్ద కేకలు వేయకండి; నాకుఁ బ్రాయశ్చిత్త మక్కఱలేదు లేచిపొండి" యనికసరి వారినివెళ్ళఁగొట్టెను. ఇంతలో నారాయణశాస్త్రి వచ్చి రోగినిఁజూచి పరీక్షించిన తరువాతఁ జేయిచూచి నిదా నించి "ఈయనకుఁ బ్రాణభయము రాఁబోడదు. నాడియం దెక్కువ దోషమేదియు లేదు. కొంచెము వాతముతోఁగూడిన మహాపైత్త్యజాతి జ్వరము గర్భస్థమైయున్నది." అని తనరొం టెనున్న యిత్తడిడబ్బీని పైకిఁదీసి యందున్న రెండుమాత్ర లను రోగినోటవేసి మ్రింగించెను. తరువాత నారాయణశాస్త్రి యౌషధమును నూరుటకు ఖల్వము నొకదానినిఁ దెప్పింపవల



సినదని చెప్పి వెలుపలకువచ్చి శివశంకరపాండ్యావద్దఁ గూరు చుండెను. నారాయణశాస్త్రి తనకు వైద్యమంతగాఁ దెలియక పోయినను బదిమాఱులు పిలిపించుకొనకయేవచ్చి తనకుఁదోఁ చిన దేదియో యాకులములనునూరి రోగులకిచ్చుచుండును. ఈతఁడు డబ్బుకొఱకు నెవరి నంతగా బాధించుటలేదు. అందు చే బీదవాండ్రును, లోభివాండ్రును దఱచుగా నారాయణశా స్త్రినే పిలుచుచుందురు. ఎచ్చటనోగానియీతనివైద్యమువల్ల బ్రతికిబాగుపడిన రోగులంతగాఁగనుపింపరు. నారాయణశాస్త్రి ఖల్వములో నౌషధము నూరుచుండఁగా లోపల ముసలమ్మ "యింకేమున్నది నాయనా" అని గొల్లున నేడువసాగెను. శివశంకరపాండ్యయు నారాయణశాస్త్రియు లోనికిఁబరుగెత్తి భూశయనముచేయుచుండఁగానే రోగిప్రాణములు పోయినవి.



## మూఁడవప్రకరణము.



పాటలీపుత్రమునకు బహుసమీపమునఁ జిన్నపల్లె యొకటి కలదు. ఆపల్లె వెలుపలభాగమున సత్రమొకటి కట్టఁ బడియున్నది. అందు యాత్రికులకుఁ దగిన భోజనవసతి గలిగి యున్నను నేమికారణముననో గాని యిందు విశ్రమింప నెవ్వం

చిన బాటసారు లంతగాఁ గనుపింపరు. పాటలీపుత్రమునుండి యయోధ్యాపురంబునకుఁ బోవు రాజమార్గమున జేరియుండుటచే మార్గాయాసమును భరింపఁజాలని యాత్రికుల కప్పుడప్పుడచట విశ్రమింపఁ దటస్థించుచుండును. వారలయినను రాత్రియం దచట విడియించుట లేదు. కాని యీసత్రపుస్థితి నెఱుంగని యమాయకజను లప్పుడప్పుడు నిశాసమయములయందు సయితము నిలువ సాహసించుచుందురు. ఈసత్ర మూరి వెలుపల విశాల మైనబయలుమీఁద నల్లరాతితోఁ గట్టఁబడియున్నది. సత్రపుయావరణ మాకాశమునొరయుచున్న ప్రహరిగోడచేఁ బరివేష్టింపఁబడి పర్వతదుర్గమును బురడించుచుండెను. ఈ యావరణమునకు వెనుకతట్టున వెలుపలనుండి లోనికి వచ్చుటకు, లోపలనుండి వెలుపలకు వెళ్ళుటకును జిన్నద్వార మొకటి యమర్పఁబడి యున్నది. కాని యది యెల్లపుడు బీగముతో బంధింపఁబడి యుండును. ప్రహరీమధ్యమున సత్రపుమందిరమునకు వెనుకతట్టు ప్రత్యేకించి మఱియొక రమ్యమైన చిన్నభవనము నిర్మింపఁబడియున్నది. ఈమందిరముయొక్క యడుగుభాగమునుండి వెలుపలికి సొరంగమువంటి సూక్ష్మద్వార మొకటి కలదు గాని యది సామాన్యదృష్టి కగోచర మైనది. మార్గస్థు లెవరైన రాత్రులయందు సత్రమున విడియింపఁదటస్థించినప్పుడు కొన్నిసమయములయం దిచట నిద్రింప నవసరము గలుగుచుండును. కావున నిది నిద్రామందిర మనియు శయనగృహ మనియు పిలువఁబడుచుండును. ఈసత్రమునం దభ్యా



గతు లంతగాఁ గనుపింపకపోయినను నిరువదివత్సరంబులప్రాయము గలసాధుపుంగవుం డొక్కరుం డప్పుడప్పుడు సత్రము నెదుట నున్నశ్వత్థవృక్షమూలమునఁ బొడసూపుచుండును. దండముగాని కమండలువుగాని యీతనియొద్ద లేదు. కాని యీతని భస్మవిలేపితవిగ్రహంబును, దక్షిణహస్తంబునం గ్రాలు జపమాలను బరికింప నీతండు సాధు వని యోచింపఁ దగియుండెను. ఆతఁడు ధరించుటకు వస్త్రము లేకపోయినను కావిరంగు గలకౌపీనమును ధరించి పులిచర్మము నొకదానిని కప్పుకొని యుండెను. ఆతనిముఖము బాలసూర్యునివలె ప్రకాశించుచు శాంతరసప్రధాన మై యుండెను. ఆతనియాకృతిని గాంచినంతనె ఫాలనేత్రంబును, త్రిశూలంబును దాఁచి దుష్టసంహారార్థ మవతరించిన పినాకపాణియా యని సంశయము గలుగుచుండును. ఒకప్పు డాతఁడు నిమీలితాక్షుండై విశ్వమును మఱచి బ్రహ్మవలోకనము జేయుచున్నపరమయోగివలె కనుపించుచుండును. మఱియొకప్పుడు తనలోఁ దాను నవ్వుకొనుటయు, కారణము లేకయే కన్నుల నీరుగార్చుటయు, క్రిందపడి దొరలుటయు వీథులవెంట పరుగెత్తుటయుఁ గాంచిన నీతండు పిచ్చివాఁ డని భావింపవలసి యుండును. కాని, యీతని నిజస్థితి నెఱింగినవా రెవ్వరు నీప్రాంతంబున లేరు. నోరు దెరచి యేరితోఁగాని యీతండు భాషించుచుండఁ జూచినవా రెవ్వరును లేరు. ఒరులు తన్ను పలుకరించినప్పుడైనను పలుకుట లేదు. కాని, యనేకు లీతని వ్యక్తిశూన్యుఁ డైన యున్మ

త్తుఁ డనియే భావించుచుండిరి. అప్పుడప్పు డీతఁ డీసత్రము దగ్గఱ నున్న గావిచెట్టుక్రిందకు వచ్చుచుఁ బోవుచుండెను. ఒక నాఁటి సాయంకాలమున సత్రపుయజమానుఁడును శ్రీనివాస యోగియు సత్రపుటరఁగుపైఁ గూర్చుని లోకవ్యవహారములం గూర్చి ముచ్చటించుచుండఁ జెంగట నున్న సాధువరుని యాకారచేష్టావికారంబులు వారల దృష్టి నాకర్షించెను. అప్పుడు సత్రపుయజమానుఁడు శ్రీనివాసయోగితో “ఈతం డెవ్వఁడో పరమహంస. నేను వీని నిదివఱ కెన్నఁడును జూచియుండలేదు. మొన్న సాయంసమయమునందుమాత్ర మీతఁ డిచట నేనాకుఁ బొడసూపెను. మొదట వీనివాలకమునుబట్టి పిచ్చివాఁ డని భ్రమించితిని. తరువాత కొంతవడి వీనిని బరిశీలింప యీతం డెవ్వఁడో మహాత్ముఁ డని యోజించితిని. నిన్న ప్రాతఃకాలమున జూచునప్పటి కీతఁడు మరల యింతవఱకును గనిపించనే లేదు.

శ్రీనివాసయోగి—ఈతఁడు నిజముగాఁ బిచ్చివాఁడే.

సత్రపుయజమానుఁడు—అయ్యా! మీ రట్లనకుఁడు. మహాత్ము లెప్పుడును బాలోన్మత్తపిశాచములవలె సంచరించుచుందురు. ఈ చిఱుతప్రాయమునం దింతవైరాగ్యము గలిగినందుకు నా కధికాశ్చర్యకరముగా నున్నది.

శ్రీనివాసయోగి—దీనిని వైరాగ్య మని భావింపకుము. ఇదియంతయు మతిభ్రమవలనగలిగినయజ్ఞానమే. మొన్న ప్రతాపరుద్రుని భవనమునం దీతఁడు భటులు మందలించినను నాగక



పిచ్చిపిచ్చిచేష్ట లనేకములఁ జేసియుండెను. అందొక సేవకుఁడు వీనికి ప్రహారణంబుల నర్పింపఁబోవ మన ప్రతాపరుద్రమహారాజు వీనిని ప్రపంచకవ్యక్తి లేని యున్మత్తునిగా నెఱింగి వాని జోలికిఁ బోవద్దని భటులకందఱకు నుత్తరవుచేసెను. ఆరాత్రి యంతయు నీతఁ డాసభాభవనమునందే నిద్రించెను. అయోధ్యానగరములో యూరిబయట నున్న కాళికాదేవియాలయము నందును నాతఁ డొకటి రెండు పర్యాయములు కనిపించి యున్నట్లు చూచినవారు కొందఱు నాకు నివేదించిరి.”

వీరిట్లు సంభాషించుచుండ సుందరపురుషుఁ డొకండు పంచకళ్యాణిగుఱ్ఱంబుపై నెక్కి పయనంబుజేయుచు రివ్వున నేతెంచి సత్రముయొక్క సింహద్వారమున నిలిచెను. ఆతని విగ్రహ మాసక్తితోఁ జూడఁదగినంతమనోహరముగా నుండు టయేగాక చూపరులహృదయమున భయగౌరవములు జనింపఁ జేయుసమర్థమైయుండుటచే సత్రపుయజమానుఁ డాతనిఁ జూచినతోడనే యాతం డెవ్వఁడో గొప్పవాఁడని భావించి వెంటనే వినమ్రుఁడై వానిని సమీపించి దిగుటకు తనచేతిని వాని కందిచ్చెను. కాని, యాపెద్దమనుష్యుఁ డందుల కంగీకరింపక గుఱ్ఱముమీఁదనే గూరుచుండి “ఇటకుఁ బాటలీపుత్ర మెంతదూర ముండును ?” అని సత్రపుయజమానుని బ్రశ్నించెను. “ఆరు మైళ్ళదూర ముండు” నని సత్రపుయజమానుఁడు బదులు చెప్పెను.

పెద్దమనుష్యుఁడు—ఒంటరిగానికీ మార్గము రాత్రిప్ర యాణమున కనుకూలముగా నుండునా ?

సత్రపుయజమానుఁడు—దొంగలభయ మీ మార్గ మున నధికముగా నుండును.

పెద్దమనుష్యుఁడు—ఈ రాజ్యము దొంగలకును దురాత్ము లకును శరణ్యంబని నే నిదివఱకే వినియుంటిని. ఆహా ! ప్రతా పరుద్రుని రాజనామ మెంతయోగ్యతగాఁ బ్రకాశించుచున్నది?" అని తలయూఁచి యశ్వావరోహణంబు గావించి తోడనే గుఱ్ఱ మును సత్రపు సేవకునివశము జేసి సత్రపు యజమానునితో "భోజనానంతరము నేను పాటలీపుత్రమునకు వెళ్ళెదను. నాకీ మార్గమున దోడుగానుండుట కిరువురు సేవకులను సిద్ధము జేయు ము" అని చెప్పి తనచొక్కా జేబునుండి యొక్కరూపికను బైకి తీసి సత్రపుయజమానునకిచ్చి "గుఱ్ఱమును జక్కఁగా మే పింపుము" అని చెప్పి లోనికి వెళ్ళెను. పెద్దమనుష్యుఁడు సత్ర పుయజమానునితో సంభాషించుచున్నంతవఱకును శ్రీనివాస యోగి సత్రపుయరఁగుమీఁదనే కూర్చుండి వారిసంభాషణ మును వినుచుండెను. పెద్దమనుష్యుఁడు లోనికిఁ జనినతోడనే శ్రీనివాసయోగి సత్రపుయజమానుని సాధువు కూర్చునియున్న రావిసమీపమునకుఁ గొనిపోయి రహస్యముగా "ఈరాత్రి కెట్లయిన వీనిప్రయాణము నాపివేయుము" అని చెప్పి లోప లకుఁ బోయెను. అనంతరము శ్రీనివాసయోగియుఁ బెద్దమను ష్యుఁడును భోజనము జేయుచు లౌకికవిషయములంగూర్చి సంభా



షించుచుండిరి. అప్పు డాపెద్దమనుష్యుఁడు "మగధరాజునకును నయోధ్యాదేశపురాజునకును బ్రబలవైషమ్యము గలదని ప్రజ లు చెప్పుకొనుచుండిరి. ఇది వాస్తవమేనా ?

శ్రీనివాసయోగి—అదెంతవఱకు సత్యమో నే నెఱుం గను. కాని, నేను నట్లే వినియుంటిని.

పెద్దమనుష్యుఁడు—పూర్వ మీయిరువురకును సంబంధ బాంధవ్యములు గలవఁట. మగధేశ్వరుం డగు ప్రతాపరుద్రున కయోధ్యాదేశాధీశ్వరుం డైన సుదర్శనవర్మ తోఁబుట్టువ నిచ్చి నాఁడఁట.

శ్రీనివాసయోగి—అది నిజమే. కాని, పాప మాదంప తులకు లోకఋణానుబంధము దీరియుండుటచే వారీలోకమును విడిచి పరలోకగతులైరి. ఆ భార్యాభర్తలిరువురును రెండు మాసములు హెచ్చుతగ్గుగ మరణించిరి.

పెద్ద—వారలకు సంభవించిన మరణకారణము ఱుంగుదురా ?

శ్రీనివాసయోగి—నే నెఱుంగుదును. వారిపరలోకగమ నమునకు వ్యాధితక్క వేఱొకకారణమేదియు లేదు.

పెద్దమను—వ్యాధి కాదఁట. ప్రతాపరుద్రుఁడే వారల పాలిటికి కాలమృత్యువై క్రూరముగా వధించినాఁడఁట.

శ్రీనివాస—అది నిజమని నేను విశ్వసింపఁజాలను. లో కానుభవములేని మాబోఁటిపరమహంసలతో నిట్టితుచ్ఛవిషయ

ములఁ బ్రశంసించుటకన్న నుత్తమ మైన పారమార్థికవిధుల
నడిగి తెలిసికొనుట క్షేమకరము.

పెద్దమను—అయ్యా! మీ నామధేయ మేమి?

శ్రీనివాస—నా పేరు శ్రీనివాసయోగి.

పెద్దమను—మీరేనా శ్రీనివాసయోగి? పరమార్థ
మంతయు నామమునందును వేషమునందును బ్రకాశించుచు
న్నది. మీపరమార్థోపదేశమే ప్రతాపరుద్రునకుఁ దరుణోపా
యసాధనమైయున్నట్లు నే నిదివఱకే వినియుంటిని.

అని పెద్దమనుష్యుఁడు నుడివినప్పు డయ్యోగి ముఖవి
కాసము మాఱి యొకవిధమైనవికారలక్షణము జనించెను గాని
దాని నీ పెద్దమనుష్యుఁడు గ్రహింపలేకపోయెను. ఇంతలో
సత్రపుయజమానుఁడు వచ్చి "అయ్యా! యీరాత్రి మార్గ
మున దోడువచ్చుటకు సేవకు లెవ్వరును సందర్భపడియుండ
లేదు. శ్రమపడి యెంతప్రయత్నించినను లాభము లేకపోయెను.

పెద్దమనుష్యుఁడు—పోనిమ్ము! నీ వందులకుఁ జింతింప
కుము. ఈ రాత్రి ప్రయాణమునందు నా దారుణకృపాణమే
నాకు పరమమిత్రము.

తరువాత కొన్నినిమిషములకుఁ బెద్దమనుష్యుఁడు భోజ
నమును ముగించి హస్తప్రక్షాళనముఁ జేయుచుండ సత్రపుసే
వకుం డొకఁ డరుదెంచి "అయ్యా! మీ గుఱ్ఱ మేదియో బా
ధచే గోండ్రించుచున్నది" అని చెప్పినప్పుడు పెద్దమనుష్యుఁడు
విస్మయము నొంది సత్రపుయజమానుని వెంటఁబెట్టుకొని గుఱ్ఱ



పుసాల కేతెంచెను. గుఱ్ఱమును పరిశీలించినతోడనే పెద్దమను
ష్యుఁడు గుఱ్ఱ మస్వస్థతగానున్నట్లు కనిపెట్టి తనచొక్కాజే
బులో నున్నయౌషధపుఁబొట్లమును దెచ్చి నీటిలోఁగలిపి దానిని
ద్రాగించెను. తరువాత పెద్దమనుష్యుఁడు సత్రపుయజమా
నునిఁ జూచి "ఈరాత్రి ప్రయాణము నిలుపుచేసితిని. రే పరు
ణోదయమునకు నాగుఱ్ఱ మెప్పటిసత్త్వమును గలిగియుండును.
అప్పుడు నాప్రయాణము కొనసాగవచ్చును. ఈరాత్రి నిద్రింప
నాకుఁ దావుఁ జూపుము" అని నుడివినతోడనే సత్రపుయజ
మానుఁడు దీపమును జేతఁ బుచ్చుకొని యా పరదేశిని లోపల
నున్నశయనగృహమునకుఁ గొనిపోయెను. అందుఁ బరుండుటకు
మంచమును, పరుపును సమర్పఁబడియున్నవి. ఈ పెద్దమనుష్యుఁ
డామందిరముఁ బ్రవేశించినతోడనే సత్రపుయజమానుఁడు
తనచేతనున్న దీపము నామందిరమున నునిచి శలవుఁగైకొని
వెళ్లిపోయెను. అంత నాగౌరవనీయుఁడు లోనఁ దలుపు గొండ్లె
ము పెట్టి తన యాస్తరణంబున శయనించి నిద్రామాంద్య
ముచేఁ గనులు మూయుచుండ తలుపు వెలుపల గొండ్లెము
పెట్టినట్లు సవ్వడి వినిపించెను. అపుడు పెద్దమనుష్యుఁ డను
మానించి శయ్యనుండి లేచి తలుపుఁ దెఱవఁబోయెను. ఎంతప్ర
యత్నము జేసినను దలుపు రానందున వాని యనుమానము
మఱింత యతిశయించెను. అప్పు డాతఁడు కొన్నినిమిషము లా
లోచించి గదినలుగడలు పరికింపసాగెను. ఎంతపరికించినను నం
దితరమార్గము లేవియుఁ గనిపించనందున భయము లేదని నిశ్చ

యించుకొని తలుపు మఱల లోపల గొండ్లెముపెట్టి పరుండెను. తరువాత కొంతసేపటికి కాగదియందు మనుష్యుఁడు నడచినట్టు మరల చప్పుడు వినిపించెను. అపుడు పెద్దమనుష్యుఁ డదరిపడి దిగ్గున లేచి చూడ నందు మనుష్యుఁడెవ్వఁడును గనిపించలేదు. కాని, దీపము వెలుతురున నిమ్మపండుతో నలంకరింపఁబడిన త్రిశూల మొకటి వానికనులకుఁ గనిపించెను. దానికి వ్రేలాడఁ గట్టఁబడిన కాగితమునందు లిఖింపఁబడినయక్షరసముదాయము స్ఫుటముగా పైకి గోచరించుచున్నందున నాతఁడు దానిని సమీపించి దీపము వెలుతురున నిట్లు చదివెను. "ఇపుడు నీకుఁ గనిపింపఁబోయెడిమానవుని వెంబడించి మౌనముద్రాధారివై యాతఁడు గొనిపోయెడితావునకుఁ జనవలయును. ఇందుకు వ్యతిరేకించితివేని నీప్రాణములు నీకుఁ దక్కనేరవు. ఇది భైరవాజ్ఞ" అని చదువుకొని "నేనిదివఱకు వినినదానికిని నిపుడు జరిగినదానికిని సరిగా సరిపోయినది. వీరలదుర్మార్గమును గనిపెట్టకిదియే సుంచితరుణము" అని నిశ్చయించుకొని మరల వచ్చి నిజఖడ్గంబును జేతఁ దాల్చి కూర్చుండెను. తరువాత కొంతసేపటికి కాతలుపు దెఱచుకొని ఖడ్గపాణియై క్రూరకింకరుం డొక్కరుండు లోనికిఁ జనుదెంచి యాపెద్దమనుష్యుని తనను వెంబడింపవలసినదని సంజ్ఞచేసెను. ఆ పెద్దమనుష్యుఁడును నిశ్శబ్దముగా వానిని వెంబడించెను. వీరు శయనమందిరము విడిచి వెలుపలకు వచ్చినతోడనే పెక్కండ్రు రాజభటులు ఖడ్గహస్తులై వీరివెనుకఁ జనుచుండిరి. సత్రమువద్ద పరుండియున్న సా



ధువున కింతవఱకుఁ బ్రపంచవ్యక్తి లేకపోయినను నాగుంపు వంకకు మహదాశ్చర్యముతోఁ జూడసాగెను. ఆరాజభటులా పెద్దమనుష్యునిఁ గొనిపోవుచుఁ గొంతదవ్వేగినతరువాత రాజభటుఁడొకఁ డాకస్మికముగా వానిచేతనున్న యాయుధమ్మును లాగఁబోయెను. అపుడా పెద్దమనుష్యుఁడు "ఔరా! యేమి యీదౌర్జన్యము" అని వాని నావలకుఁ ద్రోసివేసెను. అపుడారాజభటుఁ డతిరౌద్రంబున వానిపైఁబడి వానినిఁ బట్టనుంకింప, నాపెద్దమనుష్యుఁ డొక్కవ్రేటున వానితలఁ ద్రెవ్వనేసెను. అంత వెనుక నున్నరాజభటులు వెంటనే వానిని జుట్టుముట్టి వానినిఁ బట్టఁబోవ నాతఁ డెంతమాత్రము చలింపక యతిశౌర్యంబునఁ దననిశితాశిచే విమతజనంబులఁ బొడిచియు నఱకియు రూపుమాపుచుండెను. ఆసమయంబున రాజభటుఁ డొక్కరుం డాకస్మికముగా వానిని గ్రిందఁ బడఁగొట్టెను. వెంటనే మఱికొందఱు రాజభటులు వానినిఁ ద్రొక్కిపెట్టి ఱెక్కలు విఱిచికట్టి "మా రాజశేఖరునియాజ్ఞ ననుసరించి నిన్నుఁ బ్రాణములతోఁ గొనిపోవలసివచ్చెను. లేనియెడల నిన్నుఁ దుండెతుండెములుగా ఖండించి మాపగఁ దీర్చుకొనియుందుము" అని

హతశేషులైనరాజభటులు వానిని గొనిపోవుచుండిరి. ఆపెద్దమనుష్యుఁ డపుడేమిచేయుటకును నసమర్థుఁడై యుండుటచే వారిచేఁ బట్టువడి కొనిపోఁబడుచుండెను. వీని నారాజభటులు కొంతదూరము నడపించుకొనిపోయి తుద కొక్కరాజ

భవనమును సమీపించి తలుపు తట్టిరి. "ఎవరివార" ని లోపలనుండి కేక వినిపించినందున దత్తాత్రేయుఁడని, వీరిలో నొకఁడు బదులు చెప్పెను. వెంటనే తలుపు తెఱవఁబడినందున రాజభటులు వీనిని లోనికిఁ గొనిపోయి పెక్కుహజారముల దాటించి యొకగదిలోనికిఁ గొనిపోయిరి. ఆగది మిగుల వైశాల్యమై దేదీప్యమానమైన దీపికావిలాసంబుతోఁ బట్టపగటివలెఁ బ్రకాశించుచుండెను. ఈపెద్దమనుష్యుఁ డామందిరలావణ్యంబు వీక్షించినతోడనే యది యొకరాజభవనమని నిశ్చయించుకొనెను. అందున్నతాసనాసీనుండై యున్న పురుషవరుని వైభవవిశేషంబు లాతండు రాజమాత్రుండని తెలియఁజేయుచుండెను. తనకు సత్రమునందు గనిపించిన శ్రీనివాసయోగి వీని వద్దఁ గూర్చుండియున్నందున యీదౌష్ట్యమునకీతఁడే కారకుండని యాపెద్దమనుష్యుఁడు భావించెను. వానిని గొనితెచ్చిన రాజభటులు వానిని రాజునెదుట నుంచి "స్వామీ! ఈదుర్మార్గుఁ డొనర్చిన నేరము వీనిని ప్రాణములతో విడువవీలులేనంత ఘోరమైనదని మాకాయములందలి గాయములే సాక్ష్యమిచ్చుచున్నవి. వీనిని గొనితెచ్చునప్పుడు మార్గమధ్యమున మనసేవకావర్గంబును నురుమాడి దేవరయెడల మహాపరాధ మొనరించెను. ఈపాపపుదివసంబున దప్ప నింతవఱ కెన్నఁడును బ్రతాపరుద్రమహారాజుకింకరులు సంకటపడి యెఱుంగరు." అని కన్నీరు గార్వఁదొడగిరి.



అప్పుడు రాజు కోపోద్దీపితమానసుండై "ఓరీ! దుర్మతీ! ఈదారుణకృత్యంబున కేల సాహసించితివి? మదీయసేవకాహననంబునకుఁ గారణంబేమి?

పెద్దమనుష్యుఁడు—అందులకు భవదీయసేవకాదుర్నయంబే కారణంబు.

రాజు—నీ వెవ్వఁడవు? నీపే రెయ్యది?

పెద్ద—ఎవ్వరని పట్టి తెప్పించితివి? ఊరుపేరుల నెఱుంగకయే నన్నేల గొనితెప్పించితివి? నిరపరాధుల వేధించుటయే రాజధర్మమని భావించితివా?

రాజు—నీవు నిరపరాధివా? ఈశ్వరద్రోహివి. భైరవునాజ్ఞ నుల్లంఘించిన దురాత్ముఁడవు. నీవంటిపరమనీచుని దండించుటయే రాజధర్మము.

పెద్ద—సర్వాంతర్యామియైన పరాత్పరునియెడల నే నెన్నఁడును దప్పి తిరిగి యెఱుఁగను. భైరవుండన నెవ్వఁడో, యాతనియాజ్ఞ నుల్లంఘించుట యెట్టిదో నే నెఱుంగను.

శ్రీనివాసయోగి—ఓరీ! కుఱ్ఱా! భైరవస్వామి పరమేశ్వరుని యవతారము. ఈకలియుగమున వాని నారాధించి సేవించుటకన్న తరణోపాయ మేదియు లేదు. ఈరాజచంద్రుండు భైరవస్వామిభక్తకదంబంబున బ్రధానపురుషుండు; ఈమతవ్యాపనంబున లోకము నుద్ధరించుటకుఁ గంకణము కట్టుకొనియున్న మహానుభావుండు. జ్ఞానోపదేశంబున సర్వజనులఁ గృతార్థులం జేయ భైరవస్వామిచే ప్రేరేపింపఁబడిన దివ్యపురుషుండు.

కుండినగరసత్రమున శయనమందిరమున నీకుఁ గనిపించినది భైరవస్వామి చిహ్నము. అందు సూచింపఁబడిన యాజ్ఞ భైరవాజ్ఞ. నిన్నిటకు రప్పించుటకు కారణము భైరవోపదేశంబును ధరింపఁజేయుటకే. నీవు దానిని గుర్తింపనేరక పూలరువ్వినవాని రాలరువ్వినట్లు వాని కెగ్గుచేసి పాపంబున కొడిగట్టితివి. ఆతండు దైవభక్తుఁడగుటచే నీ యపకృతిని కొంతవఱకు సహించి నిన్ను మందలించుచున్నను దానిని గ్రహింపనేరక వానిని తిరస్కరించుచుంటివి. నీ విప్పుడైన భైరవదాసుండవై తన్మతస్వీకారంబున వాని యనుగ్రహపాత్రుండవైననేదక్క నీప్రాణంబులు నీకుఁ దక్కనేరవు.

అపుడు పెద్దమనుష్యుఁడు తనమనంబున "ఈభైరవమతమునుగూర్చి నే నిదివఱకే వినియుంటిని. కాని దానిని స్వానుభవమువల్ల నెఱుంగఁగోరియే నేనింతదూర మేతెంచితిని. నాకోర్కి సిద్ధించినందున నేను సంతోషించితినిగాని విషయము నేను దలఁచినట్లుగాక వేఱువిధముగాఁ బరిణమించినందుకు నాకించుక విచారింపవలసివచ్చెను. దౌష్ట్య మీవిధముగాఁ బ్రబలి లోకమును నాకులపెట్టుచున్నప్పుడు దాని నుడుపఁజాలని సార్వభౌముండు బ్రతికియున్న నేమి ప్రయోజనము" అని యోచించి "ఓమహాయోగీ! నన్ను గొనితెచ్చిన విధానమే మీమతోత్కృష్టతను వెల్లడించుచున్నది. లోకప్రఖ్యాతమై యున్నమీరాజేంద్రుని సచ్చరిత్రంబును నీ వంతగాఁ బొగడనవసరము లేదు.



శ్రీనివాసయోగి—"గుడి మ్రింగినవానికి గుడిలోని లింగము వట్రవడియ" మన్నట్లు ఈశ్వరునే ద్వేషించినవాని కీశ్వరభక్తులనుగర్హించుట యాశ్చర్యముగాదు. నీ బ్రతుకు నీకు భారముగాఁ దోఁచుటచేతనే నీ వీవిపరీతాభిప్రాయమును గలిగియుంటివి.

పెద్దమనుష్యుఁడు—అంతరాత్మోపదేశము నతిక్రమించి బ్రదికియుండుటకంటె తదనుష్ఠానార్థము విగతప్రాణుఁడైనను క్షేమకరమే.

శ్రీ—"వినాశకాలే విపరీతబుద్ధిః" యన్నట్లు మానవులకుఁ జెడిపోయెడికాలమునకుఁ బాడుబుద్ధులుదయించుచుండును.

పె—అదియథార్థమే. "తుదకి జ్బ్యనుతురకభాష" యన్నట్లు అంతకాలమునకే యీపాడుమతము సంభవించుచుండు.

రాజు—ఓరిదురాత్మా! నీ వీలోకమున నుండఁదగవు. నిన్నిప్పుడే కృతాంతనిశాంతంబున కతిథిగాఁ బంపివేసెదను" అని నిజసేవకానిచయంబునుజూచి "ఓయి వీనిని యూరివెలుపలిమఱ్ఱిచెట్టుక్రింద భైరవస్వామికి బలినఱకుఁడు" అనియుత్తరువిచ్చెను. వెంటనే రాజభటులు వానిని పెడకట్లతోఁగొనిపోయి మఱ్ఱిచెట్టుక్రింద చిన్నదేవళముముందు నిలువఁబెట్టి జయ భయిరవా" యని పెద్దపెట్టున కేకవెట్టిరి. అంత రాజభటుఁడొకఁడు కత్తిమీఁదికెత్తి వానిని నఱకుటకు గురిజూచుచుండెను. అపుడుగుడితలుపు వెంటనే తెఱచుకొని కౌపీనధారియు భసోద్ధూళితవిగ్రహుండునునైన మహాపురుషుఁ డొక్కరు

గునవచ్చి యానఱకఁబోవుచున్న భటునికేలనున్నవాలు నాక
స్మికముగాఁ బెఱికికొని వానిశిరమొక్క వ్రేటున డొల్లనేయుట
యేగాక పెక్కండ్రరాజభటులనయితము నురుమాడెను. మిగ
తవారలు తమప్రాణంబులఁ దక్కించుకొనిపారిపోయిరి. అంత
నామహాపురుషుఁడా పెద్దమనుష్యుని బంధవిముక్తునిఁజేసి “ఓ
యీ! నీవుపూర్ణాయుష్మంతుఁడవు; ఈదురాగతమంతయు
నాకనులఁబడుటచే నీవు మఱలఁ బ్రతుకఁగంటివి. తడయక
శీఘ్రింబరమ్ము” అని వానిని కుండిననగరసత్రమునకుఁ గొని
పోయి వానియశ్వంబునఁగొనితెచ్చి “యీయశ్వంబునీదియే
దీనినధిష్ఠింపుము” అనిచెప్పి వానినందుపైనెక్కించి ‘నీపేట కే
గెదా’ వని యడిగెను. పెద్దమనుష్యుఁ “డయోధ్యాపురంబున”
కని బదులుచెప్పెను.

మహాపురుషుఁడు—ఇదియే యయోధ్యాపురంబునకు
మార్గము. గుఱ్ఱంబును వాయువేగమనోవేగంబునఁ బోవిడువు
ము; జాగ్రత.

ఆపెద్దమనుష్యుఁడు గుఱ్ఱమునెక్కి ప్రయాణోన్ముఖుఁ
డై “ఓమహానుభావ! నారక్షకుని నెవరిఁగా నెఱింగి నమ
స్కరింపవలయును?”

మహాపురుషుఁడు—ముందు నిన్నయోధ్యాపురంబునఁ
గలిసికొనినప్పుడు నాయుదంతంబంతయు నెఱింగించెద. శీఘ్రం
బుగాఁబొమ్ము” అని వానినిఁబంపివేసి మహాపురుషుఁడు వెను
కకు మరలెను.

---

## నాలుగవప్రకరణము.

—o—

లోకములో మానవహృదయములయందు భక్తివిశ్వా
సములనెలకొల్పి యీశ్వరసాయుజ్యమునకుఁ గొనిపోమెడిము
ఖ్యసాధనము మతము. హృదయమాలిన్యవృత్తియు, యీశ్వర
ప్రవృత్తియుఁగలిగించి సత్పథప్రవర్తకులుగానొనర్చి మానవుల
నైహికాముష్మికసుఖంబుల సంఘటింపఁజేయఁగలిగినదిమతము
గాక మఱియొకటిలేదు. పూర్వకాలమున యీశ్వరతత్వమును
ప్రత్యక్షానుభవమువల్లకనిపెట్టిన యుత్తమపురుషులు దయా
శీలులై స్వార్థపరిత్యాగులై లోకహితార్థమాయామతధర్మము
లను స్థాపించియుండిరి. ఆకాలమున నీమతమునందు దురాచా
రములుగాని దుష్కృతములుగాని నెంతమాత్రము లేవు. మత
ధర్మములన్నియు జ్ఞానదాయకములై, సర్వభూతదయ, సహ
నము సత్యము మొదలయిన యుత్తమగుణములనుగలిగించి
యాత్మజీవనమున కమోఘసాధనములై యున్నవి. కాని,
యిటీవల స్వార్థపరులైనకొందఱు బుద్ధిమంతులు తమకాదరణీ
యములనితోఁచినకొన్ని దురాచారములను మతములయందు
నెలకొల్పి మతములను భ్రష్టీకరింపఁజేయుచుండిరి. తరువాత
కొంతకాలమునకు శ్రీశంకరులు నవతరించి దురాచారములను
దుర్మతములను లోకమునుండి తొలఁగించెను. కాపాలికమతమీ
విధముగా శంకరునిచే నశింపఁజేయఁబడినమతములలోనొకటి.

దీనినీమధ్యకాలమున నీచమానవుఁడొకఁడు భైరవమతమని
పేరుపెట్టి మరలపునరుద్ధారణఁజేసెను. ఈతఁడే శ్రీనివాసయోగి
యనునామముతో లోకమునంతయు పాపసముద్రములో ముం
చివేయుచుండెను. ఇంతకుపూర్వము నేను వక్కాణించుచున్న
శ్రీనివాసయోగియీతఁడే. ఈమతవ్యాపనమునకై యీతఁడా
చరించుచున్న దుర్మార్గకృత్యములకు మేరయే లేదు. వాయు
దేవుఁడగ్నిహోత్రుని ప్రజ్వలింపఁజేయుచున్నట్టు యీశ్రీని
వాసయోగినీచోపదేశములు ప్రతాపరుద్రుని దుష్కృత్య
ముల మఱింతరవుల్కొల్పుచుండెను. ప్రతాపరుద్రుఁడధిక బల
సంపన్నుఁడు. దారుణక్రీడావినోదమానసుండు. లోకకంటకుం
డు. దయాదాక్షిణ్యశూన్యుఁడు. ఈమగధరాజ్యాధిపత్యంబు
నకై యీతఁడాచరించిన మారణకృత్యంబు లతిఘోరంబులు.
అన్నను వదినను సంహరించి రాజ్యాభిషిక్తుండయ్యెను. వారి
సంతానమును సయితము కడతేర్చి భుజాదర్పంబున నీరాజ్య
మును బరిపాలించుచుండెను. ఈదుర్మార్గకృత్యముల కన్నిటికి
శ్రీనివాసయోగియే మూలకారణము. తనరాష్ట్రములోని జను
లనుమాత్రమే గాక లోకము నంతయు వీలయినంతవఱకు
తనదౌష్ట్యముచే బాధించుచుండెను. ధనాఢ్యులను గొనితెచ్చి
వారలధన మపహరించుచుండెను. పతివ్రతల గారించుచుం
డెను. నిరపరాధుల వేధించుచుండెను. చోళ, నేపాళ, సింధు
దేశములను జయించి తనయేలుబడికి గొనితెచ్చెను. విష్వక్సేన
సార్వభౌమునిసయితము జయించి యాసేతుహిమాచలపర్యంత



ము గలధరణీఖండమునకంతయుఁ దాను ప్రభువై భైరవమత
ము ప్రతిష్ఠింప దీక్షవహించి యుండెను. చక్రవర్తిసయిత మీ
దుర్మార్గులను రూపుమాపి లోకము నుద్ధరించుటకుఁ బాటు
పడుచుండెను గాని యాతఁ డతిబాల్యుఁడగుటచేతను దగిన
యనుభవము లేకపోవుటచేతను నాతనిప్రయత్నము లింత
వఱకు కొనసాగుట లేదు.

నాఁడు కుండిననగరసత్రమున నిద్రామందిరమున శయ
నించిన పెద్దమనుష్యుని గొనితెచ్చి బలి నఱుకుచుండ . మహా
త్ముఁడొకఁడు నఱుకఁబోవు చున్న భటులను సంహరించి యా
గౌరవనీయుని ప్రాణోపద్రవమును దొలఁగించి రక్షించినట్టును
నాతఁ డయోధ్యాపురంబునకుఁ జనినట్టును మన మిదివఱకే విని
యుంటిమి. ఆ పెద్దమనుష్యుఁడు పాఱిపోయిన మూఁడవనాఁడు
ప్రతాపరుద్రుఁడు తనయాస్థానంబునఁ గూర్చుండి యేదియో
యోచించుచుండెను. అంతలో ప్రధానమంత్రి యేతెంచి
రాజసమీపమున నాసీనుండయ్యె. వీనిరాక నెఱుంగకయే
రాజింకను కనులుమూసికొని దీర్ఘాలోచనమున మునిఁగియుం
డెను. తరువాత రాజు కొంతసేపటికి కనులు దెఱచి యామా
త్యు నీక్షించి “ యుగంధరా! వచ్చితివా ? జగద్గురువు
లింకను రాలేదు. నే నెంతయోచించినను మొన్న యపరాధిని
విడిపించిన పరమసాహసుఁ డెవఁడో యూహింపలేకపోవు
చుంటిని.”

మంత్రి—స్వామీ! మనభటు లెవరని జెప్పిరి.

రాజు——ఎవఁడో సన్యాసి భైరవస్వామి మూలయమును దెలిసికొని యాకస్మికముగా వచ్చి పైఁబడె నని చెప్పెదరు. వారినుడువులయందుఁ బరస్పరభేదము లుండుటచే వారు వానిని చక్కఁగా గుర్తించినట్లు గనుపించదు. వానికి జుట్టు లేదని యొకఁడును, జుట్టుకలదుగాని మొలకు బట్ట లేదని మఱియొకఁడును, పొడుగుపాటివాఁడని యింకొకఁడును, పొట్టివాఁడని వేఱొకఁడును నుడువుచుండిరి.

వారిమాటలయందు కొన్నిటి కర్థమే లేదు. వారుచెప్పిన వన్నియు నసందర్భములే.

మంత్రి——అచట యింతమంది సేవకులుండియు వానిని గుర్తింపలేక పోవు టాశ్చర్యమే. కాని వాఁడు మాంత్రి మధిక నేర్పరియు నతిబలాఢ్యుఁడును నై యుండును. వాఁ డొకవేళ యీప్రాంతములయందుఁ దిరుగుచున్న మనపిచ్చిసన్యాసి యై యుండఁడుగదా!

రాజు——అబ్బె! వాఁ డెంతమాత్రము గాఁడు. వాని కసలు ప్రపంచకవ్యక్తియే లేదు. అదిగో! వాఁడా క్రిందపడి యెట్లు పొర్లాడుచుండెనో; ఇదియంతయు సుదర్శనుని దుర్నయముగాక వేఱొకటికాదు. ఇంతసాహసకృత్యము వానికిగాక వేఱొకనికి సాధ్యముగాదు.

వీరిట్లు సంభాషించుచుండ శ్రీనివాసయోగి లోనికిఁ జనుదెంచి సుఖాసీనుండై "స్వామీ! సర్వము మీరానతిచ్చినట్టె జరిగినది. అయ్యపరాధి యయోధ్యాపట్టణంబున సుదర్శ



నింట నతిథియై యమితసత్కారంబుల నొందుచున్నవాఁడు. ఈ పరమాధముఁడు తాను మఱల బ్రతుకఁగలిగినందుకుఁ దనివి నొందక సుదర్శనసహాయంబున దేవరపై దాడివెడల నుద్యమించుచున్నట్లాపట్టణజనులు చెప్పికొనుచుండిరి.

రాజు——దీనికంతకును సుదర్శనుఁడే మూలకారణంబై యుండు నని నేను జెప్పలేదా. కానిండు వానిపొగరణచెద.

మంత్రి——లేనిపోని యనుమానమును పైఁ బెట్టికొని వ్యవహరించుటకన్న ప్రత్యక్షమున సంగతిని గనిపెట్టి కర్తవ్యము నాచరించుట యుచితంబు.

శ్రీనివాసయోగి——ఉచితరీతినే కార్యమునడుపుట యుత్తమము. ఈసుదర్శనునివీఁటి యందు మఱియొక వైపరీత్యము నయితము జరుగుచున్నయది.

రాజీమాటలు విని "యేమివిపరీతము?" అని యాత్రమతో నడిగెను.

శ్రీనివాసయోగి——లుబ్ధాగ్రేసరులలో నగ్రగణ్యుండని ప్రసిద్ధిగాంచిన ధనపాలుఁ డనుమహాధనవంతుఁ డొకఁ డుండెడివాఁడని మీరు వినియుంటిరిగదా!

రాజు——అవును. వాఁడీమధ్య చనిపోయినాఁడఁట.

శ్రీనివా——తండ్రి మహాలుబ్ధుఁడని పేరుపొందినట్లు వాని కుమారుఁడు కృపాసింధువు తండ్రిపోయిన కొద్దికాలములోనే మహాదాత యని ప్రఖ్యాతి గాంచెను. వేలకొలఁది సూరాధమానవులు ధనాపేక్షచే వానిని బరివేష్టించి యనుదినంబు

సేవించుచున్నను మన మెన్నఁదగిన యోగ్యతమాత్రము కొఱ
తగా కనుపించుచున్నది. వాఁడీశ్వరద్రోహి, భైరవమతద్వేషి:
ఈతఁడు పేదల కన్నసత్రంబులును అనాథశరణాలయంబులును
నూర్ధార. పెక్కులు గట్టించుచున్నను భక్తిశూన్యమైనప్రా
యమున కదియేమిలాభము? నాహితోపదేశములకు విరోధ
ముగా నతఁడు స్వయముగా బోధించుటయేగాక బోధకుల దేశ
దేశములకుఁ బంపి మనమతమును బాడుచేయుటకుఁ బాటు
పడుచుండెను. నేను వీనిని మందలించినప్పుడు నన్ననేకవిధ
ముల తిరస్కరించెను. వీని కీదురభిప్రాయములు గలుగుటకు
జయచంద్రుఁడే కారణమఁట.

ప్రతాప—జయచంద్రుఁ డిప్పుడేఁడి? ఆతనిని సుద
ర్శనుఁ డుద్దీయించినాఁడఁట.

శ్రీని—ఉద్దీయింపఁబోవుట సత్యమేగాని తుద కేమి
కారణముననో వానిని విడిచిపెట్టి తనరాష్ట్రమునం దుండఁగూ
డదని యుత్తరువుఁ జేసెనఁట. ఆతఁడు దేశాంతరగతుఁ డయ్యె
నని జనులు చెప్పెదరుకాని యది విశ్వాసనీయంబుగాఁ దోఁచ
దు. ఆతఁడీకృపాసింధువును రహస్యముగాఁ దనయింట నునిచి
కొని సదా వానిని సర్వవిధముల నాదరించుచుండెనని యొక
రిద్దరు చెప్పియుండిరి.

ప్రతాప—అదియును నిజమని తోఁచదు. ధనవంతుఁ
డైనంతమాత్రముచేత సుదర్శను నతిక్రమించి కృపాసింధు
వట్టిసాహసకృత్యమును జేయఁజాలఁడు. ఒకవేళ జయచంద్రుఁ



డు వీనియింటదాఁగియున్నను నాతఁడధికబుద్ధిమంతుఁడగుటచే
నింతటిదురాగతమునకుఁ జొరనేరఁడు. ఇంతియేగాక నాతఁ
డఖండశక్తిసంపన్నుఁడు. ఒకరిమఱుఁగుఁజేరి బ్రతుకుట కిష్ట
పడఁడు. ఆతఁడు బ్రాహ్మణుఁడని లోకులనుకొనెదరుగాని
బ్రహ్మజాతమునం దట్టిశౌర్యపరాక్రమంబులుండుట యరుదు.
ఆతఁ డమితతేజోవంతుఁడైనను వానిముఖమున నెప్పుడును
శాంత మొలుకుచుండును. కాశ్మీరరాజు వాని నింతకాలము
పెంచి సర్వవిద్యల నేర్పి వానిని తనరాష్ట్రమునుండి వెడలఁ
ద్రోయుట కేవలము బుద్ధిహీనత.

శ్రీని—ఈతఁడు బ్రాహ్మణుఁడో శూద్రుఁడో యెవ
రెఱుంగుదురు? వీనికిఁ దల్లిలేదు. తండ్రి లేఁడు. మూఁడువత్స
రములప్రాయమున కాశ్మీరరాజు వీనిఁ గొనితెచ్చి బ్రాహ్మ
ణునింట నునిచి పెంచి పెద్దవానిఁ జేసెను. వీనికులమును వంశ
మును నెఱింగినవా రెవరును లేకపోయినను లోక మందఱు
వీనిని బ్రాహ్మణుఁడనియే భావించుచుండిరి. వీఁ డెవ్వఁడైన
నేమి భైరవమతద్వేషి. కృపాసింధువ కీవిపరీతాభిప్రాయమును
గలిగించినది వీఁడే. కాన దొరికినయెడల వీరల ప్రాణములతో
విడిచిపెట్టుట ధర్మముగాదు.

ప్రతాప—అయోధ్యానగరముముట్టడించునప్పు డీదు
ర్మార్గులందఱు మనకు పట్టుబడుదురు. మీరు తొందరపడనవ
సరము లేదు.

వీరిట్లు సంభాషించుచుండఁగా వాకిటఁ దొర్లాడుచున్న
పిచ్చిసన్యాసి క్రమక్రమముగా వీరిని సమీపించి యాయా

స్థానంబునఁ గూర్చుండెను. వీఁడు పిచ్చివాఁడగుటచేతను వీఁడె ప్పుడప్పుడులోనఁ దిరుగుచుండుటచేతను వీనినెవ్వరును నడ్డు పెట్ట లేదు. వీఁడచట కూర్చుండి వారుసంభాషించునప్పుడు తనలోఁ దాను నవ్వుకొనుచుండెను. ఆనవ్వు బహిర్గతమైనప్పుడు ప్రధానమంత్రి కనిపెట్టి "ఏమిరా? మాసంభాషణమం దేమివిచిత్రమును గనిపెట్టితివి?" అనియడిగెను. వాఁడు దానికిఁ బ్రత్యుత్తర మేమియుఁ జెప్పకయే మఱింత ప్రబలముగా నవ్వసాగెను.

అపుడు రాజు "అయ్యా! వాఁడు పిచ్చివాఁడు; వాని ప్రశంస మనకేల పోనిండు." అని చెప్పుచుండఁగా వాని నవ్వపరిమితమై మహారోదనముగాఁ బరిణమించి కట్టకడపటకు వెఱ్ఱివెఱ్ఱి కేకలుగా మారెను.

అపుడు శ్రీనివాసయోగి "యీరోజు పూర్ణిమయగుటచే వీనియున్మాదమతిశయించినది. వీని నెట్లయిన నావలకుఁ బంపివేయుఁడు" అని చెప్పఁగా ప్రతాపరుద్రుఁడు భటులను బిలిచి వానినెట్లయిన నావలకుఁ బంపివేయవలసినదని యాజ్ఞాపించెను. మంచిమాటలతో వాఁడెన్ని చెప్పినను యావలకుఁ బోనందున తుదకాభటులు వానికాలు సేతులుఁగట్టి లేవనెత్తి యావలకుఁ గొనిపోయి వీథిలోఁ బడవైచిరి.



## అయిదవప్రకరణము.

అయోధ్యాదేశమునకును, మగధదేశమునకును బూర్వ మొకప్పుడు సంబంధబాంధవ్యములు గలిగియుండుటచే పరమ మైత్రత గలిగి భాసిల్లుచుండెను. అయోధ్యాధీశ్వరుండైన సుదర్శనునిచెల్లెలగు శ్యామలాదేవిని మగధనాథుండైన ప్రతాపరుద్రుని యన్నయగు విష్ణువర్ధనున కిచ్చి వివాహము జేయఁబడెను. ప్రతాపరుద్రుఁడు రాజ్యాపేక్షచేఁ దనయన్నను వాని భార్యను మిగులకపటోపాయంబున వధించుటయేగాక వానికొడుకుకూఁతుల నిరువురను రహస్యముగాఁ జంపించి తాను రాజ్యాభిషిక్తుఁడయ్యెను. నాఁటినుండియు వీరలిరువురకుఁ బ్రబల విరోధము సంభవించెను. నాఁడా పెద్దమనుష్యుఁడు ప్రతాపరుద్రుని దప్పించుకొని యయోధ్యాదేశమునకుఁ బాఱివచ్చినందున వానిని పట్టి యొప్పగింపవలసినదని ప్రతాపరుద్రుఁడు కోరియుండెను. సుదర్శనుఁ డందులకు సమ్మతింపక వానిని నిరాకరించినందున వీరలిరువురకు ఘోరమగు పోరాటం బాసన్నమయ్యె. ఇరువాగుల యుద్ధసన్నాహంబు లొనగూర్పఁబడుచుండెను. సంగతు లిట్లుండ యంతఃపురారామంబున సుగుణమంజరియు యామినీపూర్ణతిలకయు, భువనమోహినియు విహరించుచుండిరి. అందు సుగుణమంజరి పంచాదశవత్సరంబులప్రాయంబు గలిగి యనుపమలావణ్యంబుతో దేదీప్యమానంబుగాఁ

ప్రకాశించుచుండెను. ఆమె యంగసౌష్ఠవంబు నిరుపమానం
బగుటచేఁ గవులకైన నభివర్ణింప వీలులేకుండె. ఆమె పావనస్వ
భావము ముఖారవిందమున వెల్లివిరియుచుండుటచే యామె
సౌందర్యవిగ్రహము తావితోఁగూడిన బంగారువలె ప్రకాశించు
చుండెను. ఈమె జననకాలమున సుదర్శనుఁడు తనచెల్లెలగు
శ్యామలాదేవి కుమారున కిచ్చి యామెతో వియ్యమొంద గం
పంత యాశను గలిగియుండెను గాని యాయాశ త్వరలోనే
నశించెను. ఇపుడు విష్వక్సేనసార్వభౌముఁ డీమెను వివాహ
మాడఁగోరియున్నందున సుదర్శనుఁ డందుల కధికానందభరి
తుండై యీమెను వానికిచ్చి వివాహంబు సేయనిశ్చయించు
కొనెను. కాని, యీమె విద్యాభ్యాససమయంబుననే తనకు విద్య
నేర్పుచున్న జయచంద్రుని మనంబున వరించియుండుటచే
నన్యుని పాణిగ్రహణంబునకెంతమాత్రము సమ్మతింపక నెట్టి
వానినైన నిరాకరింపుచుండెను. ఈమెకు జవ్వనమతిశయించిన
తోడనే తండ్రి యీమెకు పరిణయమహోత్సవము సలుపనెంచి
నప్పుడీమె తనమనోనిశ్చయము తండ్రికెఱింగింప యాతనికిఁ
బట్టరానికోపము గలిగి జయచంద్రుని చెరయం దుంచుటయే
గాక మరణదండనముగూడ విధించెను. తనమనోనాయకుఁడు
కారాగృహబద్ధుఁడై యున్నకాలంబున నిద్రాహారంబుల నెఱుం
గక తనజీవితేశ్వరు ప్రాణాపాయంబునకు రేయింబవళ్ళు దుఃఖిం
చుచుండెను. వానికవసానకాలమే తటస్థమయిన యెడల రజ్జువి
షాగ్నిజలంబుల ప్రాణపరిత్యాగంబు గావించి పరలోకమున



నీశ్వరసన్నిధానమున తనప్రియవల్లభుని వివాహమాడ నిశ్చ
యించుకొనెను. జయచంద్రునియొద్ద విద్య నేర్చుకొనినదీమెయొ
క్కతెమాత్రమే గాదు. ఈమె చెలికత్తెయగు యామినీపూర్ణ
తిలకయు పనికత్తెయగు భువనమోహినియుఁగూడ యాతనిశి
ష్యురాండ్రే. యామిని తనచెలికత్తెతో సమానమైన వయో
రూపసౌందర్యలక్షణములఁ గలిగియుండెను. ఈమె సుగుణమంజరి
వలెగాక జయచంద్రునియం దేకగర్భజనితుఁడైన సోదరుని
యందు సోదరియెట్టి ప్రేమను గలిగియుండునో యట్టిప్రేమను
గలిగియుండెను. జయచంద్రుఁడీమెకు గురుఁడగుటచేతనో లేక
మఱి యేకారణముచేతనో మన మూహింపనేరము గాని వీనికీమె
యెడల గలప్రేమానుబంధము మిగుల పావనమై జననీజనకుల
ప్రేమలనుసయిత మతిశయించుచున్నది. బీదమనుష్యుఁ డొక
డీమెను బసితనంబున నమ్మదెచ్చినందున సుదర్శనుఁ డీమె సౌంద
ర్యవిశేషమును బరికించి తనకూఁతునొద్ద నీడుజోడుగానుండునని
యెంచి యీమెను కొని పెంచుచుండెను. ఈమె చక్కదనమును
సుగుణంబులును నానాఁటికతిశయించి యారాజదంపతుల హృ
దయాకర్షణము గావించుచున్నందున భేదభావమించుకయు లేక
సుగుణమంజరివలె నీమెను నపారప్రేమతో గారవించుచుండిరి.
భువనమోహినియు యొక వేశ్యాకన్యక. ఈమె తల్లి యీమెను
గనిచనిపోయెను. ఆమె రాజ్ఞి సేవకురాలగుటచే రాజుభార్య
దయాస్వభావము గలదియగుటచే దిక్కుమాలిన యీబాలి
కను తనయింటనునిచి తనపిల్లలతోపాటు పెంచుచుండెను.

ఈమెకు పదిసంవత్సరముల ప్రాయముగల యన్న యొకఁడు గలఁడుగాని యచట గడవనేరక తల్లిపోయినకొంతకాలమునకుఁ దనసోదరినిట విడిచి పరదేశమునకుఁ బోయెను. ఈమెశరీరసౌందర్య మధికముగానున్నను హృదయస్వభావమంత యోగ్యమైనది గాదుకాని యీమెయు సుగుణమంజరితో గురువునొద్ద విద్యనేర్చుకొనునప్పుడు గురువుయెడల వినయవిధేయతలు గలిగి మెలగుచుండెను.

నాఁడా మువ్వురుకన్నియ లుద్యానవనమున విహరించు నప్పుడీక్రిందివిధముగా సంభాషింపఁదొడఁగిరి.

సుగుణ—ఓసి భువనమోహినీ! నీవొనర్చిన మహోపకారమును నేనెన్నఁడు మఱువఁదగినదిగాదు. నాప్రాణనాయకుని ప్రాణరక్షణవార్తాశ్రవణంబున భూమిపై మఱల బ్రతుకఁగంటిని. నీవావార్తను నాకెఱింగించినందుకు నీమౌక్తికహారంబుచే నీకంఠంబలంకరించెద" నని తనకంఠహారంబు నామెమెడ నలంకరించెను.

యామిని—ఈవృత్తాంతము నివేదించి నామనోపరితాపముడిపినందున యీమెకు నేప్రత్యుపకారమేమియుఁ జేయఁజాలను గాని నాయావజ్జీవము కృతజ్ఞురాలనై యుండెదను.

సుగుణ—భువనమోహినీ! మనగురువుగారిని క్షమించిన కారణంబు నీవెఱుంగుదువా?

భువన—అందులకుకారణము నేనెఱుంగనుగాని నాఁడు వాని నురిదీయఁబోవునప్పు డాగుంపు నొత్తిగించికొని లోనికిఁ



బోయితిని. వానిదురవస్థ గాంచినప్పుడధికదుఃఖావేశంబున నాహృదయంబు సహస్రశకలం బులయ్యె. వాని నురిదీయఁబోవునప్పుడు రాజభటుఁడొక్కరుఁ డాగుమాగుమని కేకలువెట్టుచు నొక్కపరుగునవచ్చి కాగితము నొకదానిని కొత్వాలునకుఁ జూపెను. కొత్వాలు దానినిఁ జదువుకొన్ని యామారణోపాయంబు నంతటితో విడిచి వానిని రాజసభకుఁ గొనిపోయెను. రాజు వానిని దురీక్షణంబుల నీక్షించి "ఓకీపడుచుపండితుఁడా! నీదుర్వ్యాపారమునకుఁ దగినశిక్షను నే విధించితిని. కాని నీవు పూర్ణాయుష్మంతుఁడవగుటచే నీవు మఱల బ్రతుకఁగంటివి. నీకు విధించిన మరణదండనను దొలగించి నిన్నింతటితో విడిచిపెట్టుచుంటిని. ఇఁకముందు నీవెన్నఁడును నీదేశంబున నడుగుపెట్టకుము. మఱల నీవీరాష్ట్రంబున నెన్నఁడయిన పొడసూపసాహసించితివేని నీమానప్రాణంబులు దక్కవుపొమ్ము" అని విడిచిపెట్టెను.

యామిని—భువనమోహినీ! నీవిపుడు మనగురువుగారిజాడ నేమైన నెఱుంగుదువా?

భువనమోహిని—వారెచట నున్నది నేనెఱుంగనుగాని వారిరాజ్యములో మాత్రము లేరు.

సుగుణ—యామిని! మాతండ్రిగారిచే సత్కరింపఁబడుచున్న యతిథిసత్తముని నీవెఱుంగుదువా? నేనాయన నడిగినంతమాత్రముచేత నీవేల యట్లు సిగ్గుపడుచుంటివి? వానిపై నీమోహమెంత యధికముగా నున్నది. వానిని నీవు వివాహ

మాడఁదలచియున్నట్లు నేను వినియుంటిని. అది సత్యమేనా?

భువనమోహిని—ఆతలంపీమెకు మాత్రమేగాదు. ఈ మెనుజూచినదిమొదలు విజయపాలుఁడు నయితమీమెను వివాహమాడ నభిలషించుచుండెను.

వీరిట్లు సంభాషించుచుండ “ఫెళ్ఫెళ్ళ”ను పిడుగు వంటిచప్పుడులు చెవిసోఁకినందున భయకంపితాంగులై నలుదెసలు పరికించుచుండిరి. వెంటనే మణిభద్రుఁడను సేనానాయకుం డరుదెంచి “అమ్మా! శత్రుసైన్యంబు కోటముట్టడించుచున్నది. అంతఃపురమునువీడి నీవలావలకుఁ బోరాదని ప్రభువువారు సెలవిచ్చిరి” అని నుడివినతోడనే యాకన్యకామణులు లోనికి జనుదెంచిరి. మణిభద్రుండు కోటలోనికిం జని సమరసన్నాహంబు జేయుచుండె. కోటనలుగడలు విమతసైన్యంబు చేదట్టంబుగా ముట్టడింపఁబడియె. ఆసైన్యమధ్యంబున మగధ ధ్వజంబప్రతిహతంబుగాఁ బ్రకాశించుచుండెను. కొందఱుయుద్ధభటులు ఘోటకవ్రజంబు నధిష్ఠించి కోట ఛేదింప శతఘ్నికానివహంబుఁ బ్రేల్చుచుండిరి. మగధసైనికులు గొందఱు కోటలోఁ బ్రవేశింప వప్రకుడ్యంబుల నెగబ్రాకుచుండిరి. ఆసమయంబున సుదర్శనుని వీరభటు లనేకులు కోటబురుజులపైనెక్కి యగ్నితప్తంబైనతైలాదిపదార్థంబులం దెచ్చి యధికసాహసంబున కుడ్యోపరిభాగంబుల కెగబ్రాకుచున్న భటవితానంబు పైగుమ్మరించి కోట సంరక్షణంబు గావించుచుండిరి. విజయపాలుండును శ్వేతాశ్వారూఢుండై డాలుకత్తి చేదాల్చి వేల



కొలఁది యరివీరులఁ బొడిచి చరచియు నురుము జేయుచుండెను. మణిభద్రుండు మహారౌద్రంబున నగ్నియంత్రసహాయంబున పరిపంథివర్గంబును దునుమాడి తనప్రతాపకౌశలంబును లోకమునకుఁజూపుచుండెను. సుదర్శనుండుదనరథంబుపై నిలిచి [illegible]జ్యశరాసనుండై మహాదర్పంబున పరసైన్యంబును జించి చెండాడుచుండెను. ఆసమయంబున ప్రతాపరుద్రుండు తన ధనుర్విద్యాపాండిత్యమును జూపుటకిదియ మంచితరుణమని యెంచి లయకాలరుద్రునివలె సుదర్శనుని నెదుర్కొని తనకరలాఘవంబును శరలాఘవంబును లోకంబునకుఁ జూపుచుండెను. పరస్పర జయకాంక్ష నధికబలంబున నీశూరవరు లిరువు రమితశౌర్యంబున బోరుచుండ ప్రతాపరుద్రుండు సుదర్శనునిచేనున్న విల్లును రెండు తుండెములుగా ఖండించెను. అంత సుదర్శనుం డపరిమితరోషపరవశుండై గదాదండంబు చేదాల్చి రథంబుడిగ్గి ప్రతాపరుద్రుని ఫెళ్ళున నొక్కదెబ్బ గొట్టెను. ప్రతాపరుద్రుఁడా గదాహతికినోర్చి తాళఁజాలక వెనుకకు పాఱిపోవుచుండ మగధ సైన్యాధిపతి శీఘ్రంబవచ్చి సుదర్శనునిదాకి సూతసహితంబుగా వానిరథ్యంబులం గూల్చుటయేగాక వానిచేతనున్నగదను విదళించి వాని నణుకబోవుచుండ నొక్కవీరవరుఁ డాకస్మికముగా నచట బొడసూపి యాసైన్యాధిపతి శిరమొక్కవ్రేటున ఖండించి సుదర్శనుని రక్షించుటయేగాక యపారదారుణ విక్రమాటోపంబున మగధసైన్యంబును రూపుమాపుచుండెను. వానియుద్ధనైపుణ్యంబు నీక్షించిన శూరవరులందఱు యాతండు

రావణవధార్థమవతరించిన శ్రీరామమూర్తియో త్రిపురసంహార
మునకు బొడసూపిన శూలపాణియో యని పరిభ్రమింపఁదొడగిరి.
వీనిబాహాబలదర్పంబునకు సహింపనేరక శత్రుసైన్యంబు నా
నాముఖంబుల వికావికలై పఱతెంచె. అపుడు సుదర్శనుఁడు
వినయవిశ్వాసంబులతో నాశూరవరు నీక్షించి ‘‘మహాత్మా
నీవు నన్నురక్షింప నేతెంచిన నాపాలిటి భగవంతుఁడవు’’ అని
వాని కనేకవందనంబు లొనరించి తనయతిథిపూజ నంగీకరించి
కృతార్థుని జేయవలసినదని ప్రార్థించెను. అతఁడు దాని నెంత
మాత్ర మంగీకరింపక ముందు కొద్దికాలములో వానికోర్కెను
నెరవేర్చెదనని జెప్పి వెళ్ళిపోయెను. ఈమహాపురుషుఁ డెవ్వఁడో
యిటకేల యేతెంచెనో నెఱింగినవా రెవ్వరును లేరు. విజయపా
లుఁడు వీనికి నమస్కరించి వీనిపేరెరుంగఁ బ్రయత్నించెనుగాని
యాతఁడు తనపేరు నెఱింగింపకయె వెళ్ళిపోయెను. ఆహవము
మిగుల జయావహమైనందున సుదర్శనునకు పట్టరానిసంతోష
ము గలిగెనుగాని యది తొలకరిమెఱుపువలె క్షణభంగురమై
తుదకు దుఃఖముగా పరిణమించెను. సమరావసానంబున భువన
మోహిని కన్నీరునించుచు ‘‘సుగుణమంజరి! సుగుణమంజరి!’’
యని పెద్దపెట్టున రోదనముజేయుచు కేకలుపెట్టెను. సుదర్శ
నుఁడీకేకలు విన్నతోడనే ‘ఏమిది’ యని కేకపెట్టుచు విజయపా
లుఁడును మణిభద్రుఁడును వెంబడింప వేగిరపాటుతో లోనికి
పరుగెత్తెను. భువనమోహిని క్రిందపడి యేడ్చుచుండెను.
యామిని నిర్ఘాంతపడి కన్నీరునించుచు నిలుచుండెను. సుదర్శ



నుఁడు ‘‘నాముద్దులకూఁతునకేమియుపద్రవము సంభవించినది
అదేది’’ యని మొగమింతజేసికొని కలవరపాటుతో నడుగఁదొ
డగెను. భువనమోహిని చెప్పుటకు నోరురాక ‘సుగుణమంజరి
సుగుణమంజరి’ యని యథాప్రకారముగా నేడ్చుచుండెను.
యామిని గుడ్లనీరు గుక్కుకొనుచు ‘‘మేము మాచెలికత్తె
సహితంబుగా సుందరవిలాసంబుననుండ దుర్మార్గులెవ్వరో నలు
గురాకస్మికముగా వచ్చి మమ్ముల నెంతమాత్రము నంటకయే
మాచెలికత్తె కరపాదంబులంబట్టి నావలకుఁగొనిపోయిరి. పెద్ద
పెట్టున మే మెంతియరచినను మామొఱాలించినవా రెవ్వరు
లేరు’’ అని నుడివినతోడనే సుదర్శనుఁడు మొదలునఱకిన కదళీ
కాండంబువలె క్రిందపడి ‘‘హాతల్లీ సుగుణమంజరీ! యాదుర్మా
ర్గులచేఁజిక్కితివే’’ యని విలపింపసాగెను. విజయపాలుఁడు మణి
భద్రసహితంబుగా శత్రుజనాన్వేషణంబున కనేక ప్రయత్నం
బులు జేసెనుగాని యందువలన ప్రయోజనము లేకపోయెను.
శత్రువులుగాని సుగుణమంజరిగాని వారికి లభింపదయ్యెను.



## ఆఱవ ప్రకరణము.

ఆరాత్రియంతయు రాజనగరునం దెల్లరిహృదయములు
సుగుణమంజరీ యపహారణంబునకుఁ బల్లటిల్లుచుండెను. శత్రు
వును కదనరంగంబున బరిమార్చుటకన్న సుగుణమంజరిని గొ
నితెచ్చుటకు వేఱుసాధనము గనుపించదు. మగధను ముట్టడిం

మటమే ముఖ్యకర్తవ్యమని రాజకీయతంత్రజ్ఞులు రాజునకు నివేదించిరి. ఆ రేయియంతయు యుద్ధప్రయత్నముల నాలోచించుటయందే గడుపఁబడెను. సుదర్శనునకీవిపత్తు సంభవించుటకుఁ దాన్ను మూలకారణమని యెంచి విజయపాలుఁడు చింతాదందహ్యమానమానసుండై నిద్రపట్టక బాధపడుచుండెను. అప్పుడాకసుందరాంగి నగరుతలుపుఁ దెఱచికొని విజయపాలుఁడు పరుండియున్న గదిసమీపమునకు వచ్చి నలుగడలు పరికించుచుండెను. ఆమెనడక నందడి యాలకించినతోడనే విజయపాలుఁడు దిగ్గునలేచి యామెవంక దేరిపాఱ జూచుచుండెను. ఆచోటంతయు కటికచీఁకటి యావరించియుండుటచే యామె యెవ్వరైనది విజయపాలుఁడు గుర్తించలేదు. ఆమెయైనను విజయపాలుఁడిచటనున్న సంగతిని నెఱుంగదు. ఆప్రదేశమంతయు నిశ్శబ్దముగానుండుటచే నామె తల వంచుకొని మందయానముతో నిర్భయముగాఁ జనుచుండెను. విజయపాలుఁడామె వృత్తాంతమును గనిపెట్టవలెనను తలంపుతో నామెవెనుక మెల్లగా వెంబడించుచుండెను. ఆసుందరీమణి వచ్చివచ్చి తుదకు కోటసమీపముననున్న కాళికాలయంబు జొచ్చెను. ఆమె లోన ప్రవేశించునప్పుడు గర్భగుడియం దొకసవ్వడి వినిపించినందున నామెకు కొంత బెదరుగలిగి లోపలకుఁ జననేరక ద్వారమునొద్దనే నిలచి పరిశుద్ధహృదయముతోడ "ఓయీశ్వరీ! నాయజమానురాలిని శత్రువులనుండి కాపాడుము. ఆమెపరమపావని; ఏభూతమునకు హానిజేసియెఱుంగని పరమసాధ్వి. ఆయుత్తమ కాంతామణి నెట్టియిన విపత్పయోరాశినుండి యుద్ధరించి రక్షింపుము. నన్ను కృపజూడుము" అని కన్నీరుమున్నీరుగాఁ గార్చుచు గద్గదస్వనముతో కొంత బిగ్గరగా ప్రార్థించుచుండెను. అంత విజయపాలుఁడామెను సమీపించియామెవెనుక స్థాణువువలెనిలువఁబడి యామె హృదయశుద్ధికిని విశ్వాసభావంబునకును నద్భుతపడి చూచుచుండెను. ఆమె ప్రార్థనను ముగించిలేచి వెనుకకు మరలునప్పుడామె సుందరవదనారవింద సౌజన్యంబు నానికనులకుఁ బూర్ణముగా గోచరించినందున నాతఁడత్యాదరముతో "యామిని! యామినీ" అని పిలిచెను. తనవెనుక నెవ్వఁడో పురుషుఁడొకఁడు నోడిగినిలుచుండి తన్ను బిలుచుచున్నందు కామె తత్తరపడి 'ఎవరువారు' అని అడిగెను. నేను విజయపాలుఁడను. నీవేదియో విచారముచే బాధపడుచుండుట నెఱింగి నీపరితాపకారణము నరయు నట నిరీక్షించియుంటిని. అబలవయ్యును నొంటరిగ నీవింత దవ్వుఱగ సాహసించుట యాశ్చర్యజనకంబై కనుపట్టుచుండెను.

యామిని—నాయజమానురాలు క్రూరమానవులచేఁ బట్టుపడినందున నామెను రక్షింప భగవతిని ప్రార్థింపవచ్చితిని. ఆమెయందలి ప్రేమానుబంధమే నన్నింతదూరము గొనిదెచ్చినది.

విజయపా—నీహృదయమెంత మృదువైనది. నీవిశ్వాసస్వభావమెంత శ్లాఘనీయమైనది.

యామిని—శైశవావస్థమొదలు నన్నింతవఱకు పెంచి పెద్దదానిని గావించెను. సుగుణమంజరియు యేకగర్భజనితయగుం సోదరికన్నను నన్నధికప్రీతితో గౌరవించుచుండెను. నన్నంత యధికప్రేమతో గారవించుచున్న నాప్రేమాస్పదమైన పదార్థమును పోగొట్టుకొనియు ప్రాణవాయువులనొడల ధరించియున్న నావంటి కఠినహృదయ యింకొక తెగలదా" యని లజ్జావనతాననయై కన్నీరునించుచు ప్రత్యుత్తరమిచ్చెను.

విజయ—సుందరీ! ఈశ్వరకటాక్షమువలన నామె కేకీడును గలుగనేరదు. శాంతింపుము.

యామిని—ప్రతాపరుద్రుఁడు మిగుల దుర్మార్గుఁడు. ఆతఁడామె నేమిచేయునోయని భయపడుచున్నదాన్నను. అని రోదనముచేయసాగెను. అపుడు విజయపాలుఁడామె కృతజ్ఞతాస్వభావమున కచ్చెరువందుచు "ఓప్రేయసీ నీవట్లు భయపడ నవసరములేదు. వానిని యుద్ధమున నిర్జించి యామెను గొనితెచ్చుట కామెతండ్రి యనేక ప్రయత్నములు జేయుచుండెను. ఈశ్వరకటాక్షంబున నీచెలికత్తెను త్వరలో నీవు చూడఁగలవు. ఊరడిల్లుము.

యామిని—నాప్రియసఖి ప్రాణరక్షణముకొరకు పరమేశ్వరిని ప్రార్థించినట్లు మిమ్ములను ప్రార్థించుచుంటిని అని చెప్పి వంచినతల పైకెత్తకయే మందగమనముతోఁ జనుచుండెను. దేదీప్యమానమైన యామెశరీరలావణ్యంబుకన్నను నామె యోగ్యస్వభావము విజయపాలుని హృదయమును నాకర్షించి



యుండుటచే నామె నత్యధికముగా ప్రేమించుచు నామెను వెంబడించి చనుచుండెను.

యామినియు విజయపాలుఁడును కాళికాలయమున సంభాషించుచున్నప్పుడు గర్భగుడియందు దాగియున్న పురుషపుంగవుఁడొకఁడా సంభాషణాంశమును బట్టి వారలను గుర్తించి నిట్టూర్పు విడుచుచు "దౌష్ట్యము నాశనమునకు పూర్వము ప్రబలగలిగియుండుట యీశ్వరసంకల్పమే. ఈదుర్మార్గులిప్పుడు ప్రబలుచున్నను తుదకు నశింపకమానరు. సుదర్శనుఁడు నన్నంత బాధపెట్టినను నాకు వానియెడల ద్వేషబుద్ధి యెంతమాత్రము లేదు. భైరవమతస్థులు నాకింతవఱ కెగ్గు చేయకపోయినను వారివర్తనము లోకకంటకమై యుండుటచే దానినెట్లయిన రూపుమాపుటయే పరమధర్మము. నేను సన్యాసివేషముతో పిచ్చివానివలె కుండినగరసత్రమునందును ప్రతాపరుద్రుని భవనమునందు పెక్కుసారులు తిరుగుచున్నను ప్రతాపరుద్రుఁడుగాని శ్రీనివాసయోగిగాని నన్నింతవఱకు నానవాలుపట్టలేదు. ముందు వ్యాపారమెట్లుండునో తెలియదు" అని యోచించుచు చివాలున లేచి గుడితలుపు తెఱచి వెలికిఁదొంగిచూచి "యేమికారణమోగాని యాతఁడింకను రాలేదు" మరల తలుపులోపల గొళ్ళెము పెట్టుకొని లోపల కూర్చుండెను. తరువాత కొంత సేపటికి యెవ్వరోవచ్చి "స్వామిగురువర్యా" యని పిలిచి తలుపుకొట్టిరి. వెంటనే లోపలకూర్చునియున్న మానవుఁడు తలుపు తెఱచి "కృపాసింధు! రమ్ము నీరాకకే నేనెదురు జూచుచుంటి" నని

లోనికిఁ గొనిపోయి నీవు వెళ్ళినకార్య మేమయినది? అని యడిగెను. ‘‘అనుకూలముగానే జరిగినది’’ అని కృపాసింధు ప్రత్యుత్తరమిచ్చెను. పురుషపుంగవుఁడు ‘‘చిత్రకేతును గలిసి సంభాషించితివా?

కృపా—సంభాషించితిని. అతఁడు ధనాపేక్షాపరుండగుటచే నాతఁడందులకు సమ్మతించెను. వానిని పూర్ణముగా కోరినంతధన మొసగి సంతోషపెట్టినందున ఆతఁడు చేతనైనంతవఱకు మనకు సహాయము చేయును. దేవరసంకల్పము సిద్ధించుటకు సందియము లేదు.

పురుషపుంగవుఁడు—నేను రేపు నాకార్యమును సాధింపఁబూనెదను. అన్యోన్యపునస్సందర్శనం బెప్పుడు వాటిల్లును.

కృపా—మాతండ్రిగారి యస్తికలంగొని కాశికాపురంబునకుఁ జనుచున్నవాఁడ. నేను తిరిగి వచ్చినతోడనే మరల సందర్శించెదను.

పురుషపుంగవుఁడు—ఓయి! చక్కగా జ్ఞప్తికి తెచ్చితివి శ్రీనివాసయోగి మనకు పరమశత్రుండు. నీవువానిని తిరస్కరించినందులకు కార్పణ్యమానసుండై నిన్నెట్లయినను పగసాధింప ప్రయత్నించుచున్నవాఁడు. ప్రతాపరుద్రుని యాస్థానంబున సన్యాసివేషంబుతో వానిదురభిప్రాయమును గనిపెట్టితిని. జాగ్రత్తగా సంచరింపుము.

కృపా—నాపై దేవరయనుగ్రహమున్నంతవఱకు నాకేకీడును బొరయనేరదు. సెలవుంగైకొనియెదనని నమస్కరించి



నిజగృహోపాంతమున కేతెంచెను. ఆపురుషపుంగవుండును వందు కొంతసేపు విశ్రమించి తెల్లవారకపూర్వమే గుడివిడిచి వెళ్ళిపోయెను.

———o———

## ఏడవప్రకరణము.

———o———

నాఁడు సుగుణమంజరిని పట్టుకొనిన దుర్మార్గులామె నశ్వశకటమున గూర్చుండఁబెట్టుకొని పాటలీపుత్రమున కధికవేగంబున గొనిపోవుచుండిరి. అట్లు గొనిపోవఁబడుచున్నప్పుడు దేహస్మారక మించుకయు లేక మూర్ఛ నొందియుండెను. తర్వాత దేహస్మృతి దెలిసినప్పుడామె పెద్దపెట్టున నేడువసాగెను. ఆమె యెంతయేడ్చినను బ్రయోజనము లేనందున మనసు గాయిచేసికొని విధికృతము ననుభవింప నిశ్చయించుకొనెను. తుదకామె రాజభవనమున రహస్యప్రదేశమున నుంపఁబడెను. అది పెక్కు యావరణంబులచేతను నాయుధపాణులయిన భటసమూహంబుచే సదా జాగరూకతతోఁగాపాడఁబడుచుండెను. ఈమె యుంచఁబడినరహస్యమందిరము మూఁడుభాగములుగా విభజింపఁబడియున్నది. అందు మధ్యభాగంబు మిగుల విశాలమై ధూళిదూసరముతో నిండి దుర్వాసనసహితంబై యుండెను. దీని యిరువైపులనున్న భాగయుగళంబు మధ్యభాగంబుతో ద్వారమూలంబున సంబంధమును గలిగియుండెను. ఈమందిర మీమధ్యకాలంబున తెఱువఁబడియున్నట్టు కనుపించదు.

గబ్బిలములు మూషికములు మొదలయిన క్షుద్రజంతువులకుని
వాసయోగ్యంబై సాలిగుడ్లతోను, బూజుతోను దట్టముగా
నావరింపఁబడియుండెను. సుగుణమంజరీమందిరము ప్రవేశించిన
తోడనే తనదుస్థితికి శోకించుచు నొకమూలనొదిగి కూర్చుం
డెను. అపుడు వృద్ధవనిత యామెచెంత కేతెంచి "అమ్మా! నీ
ప్రియుఁడువచ్చి నిన్ను గారవించువఱకు నీవామంచముపైఁగూ
ర్చుండుము" అనిచెప్పఁగా సుగుణమంజరి పట్టరాని కోపముగ
లిగి "నాప్రియుఁ డెవ్వఁడు?" అని యడిగెను. "నిన్ను పట్టి
తెప్పించిన ప్రతాపరుద్రుఁడు" అని యామె ప్రత్యుత్తర
మిచ్చెను.

సుగుణ—ఓవృద్ధవనితా! నీవిప్పుడన్న యంటివిగాని మ
రల పేర్కొనకుము" అని కోపదృష్టితో పలికెను. అంతలో రాజ
భటుఁడొకఁడువచ్చి యావృద్ధవనితనుగాంచి "కేసినీ! జాగ్రత
తో నీవామెయొద్దజేరియాదరించుచుండవలసినదనిప్రభువువారు
సెలవిచ్చిరి" అని చెప్పివెళ్ళిపోయెను. తరువాత యావృద్ధవనిత
"అమ్మా! ఈభవనమునీది.ఇచట నీయిచ్చవచ్చినట్లు విహరింప
వచ్చును. ఇతరులెవ్వరును యిటకు రానేరరు. నీవుపిలిచినప్పుడు
నేనుమాత్రము వచ్చెదను." అని చెప్పి, కేసిని వెళ్ళిపోయెను.
తరువాత సుగుణమంజరి పరితాపమానసయై యెట్లయిన యీ
చెరాబంధమును విడిపించుకొని పాఱిపోవుటకు దగిన సాధనము
ను విచారించుచు తలుపు లోన గొళ్ళెముపెట్టి రెండవగది
తలుపుతెఱచి నలువంకలు పరికించెను. అందలిపదార్థములన్ని



యుబహుపురాతనములగుటచే శిథిలమై బూజుతో నిండియుం
డెను. ఆగదియందు పశ్చిమభాగంబున వేదికయొకటి నిర్మింపఁ
బడియున్నది. ఆవేదికోపరిభాగంబున చిన్నభువనేశ్వరమొకటి
యమర్పఁబడియుండెను. సుగుణమంజరి యాభువనేశ్వరమును
సమీపించి తలుపు తెఱచి చూచెను. అందు శ్రీకృష్ణవిగ్రహ
మును, నన్నపూర్ణవిగ్రహమును నొక్కమందసంబున భద్ర
పఱచఁబడియున్నవి. అవి వెండితోఁజేయఁబడినను బహుపురా
తనమైనుండియు వాడుక లేక యుండుటచే కాంశ్యపదార్థముల
కన్న నధికనైల్యముగానుండెను.ఆగదియొక్కయుత్తరపువైపున
లోహముతోఁ జేయఁబడిన పురుషవిగ్రహ మొకటి కనుపించెను.
సుగుణమంజరిదానిని గాంచినతోడనేదానియొద్దకేతెంచి సమీ
పముననున్న పీఠముపైనెక్కి దానినావరించియున్న ధూళినంత
ను దులిపివేసెను. అప్పుడది సజీవమైన మనుష్యాకారమును గలిగి
మున్నుతానెఱింగిన మానవుని బోలియుండెను. ఆవిగ్రహము
యొక్క స్వరూపలక్షణములనుబట్టియు అందుచిత్రింపఁబడిన
వస్త్రాభరణములనుబట్టియు అతియావ్వనమధ్యస్థుననున్న నొ
క్కరాజపుంగవుని విగ్రహమని నిశ్చయించుకొనెను. కాని యా
తఁడు తనకు పరిచయుఁడైయున్నందుకామెయుద్భుతపడఁజొచ్చె
ను. ఆపురుషవిగ్రహముయొక్క వామభాగమున నధిక సౌంద
ర్యమును సూచించుచున్న స్త్రీవిగ్రహ మొకటి కనిపించెను.
నిండుజవ్వనమునన్నాపె ధరించిన వస్త్రాభరణంబు లామె
యౌన్నత్యపదవిని సూచించుచుండెను. ఆమె సుందరవదన

నారవిందము శాంతముతోను మృదుత్వముతోను భాసిల్లుచుండెను. ఆముఖమును పరిశీలించినప్పుడది తనకు క్రొత్తదిగా నుండక మున్నె తానెఱింగినట్లుండెను. ఆవిగ్రహమునందు జూపcబడిన నల్లనిశిరోజములును శాంతగుణప్రధానమైన యామె చూపులును వదనారవిందమునందలి యాహ్లాదంబును మందహాసద్యుతులును నావిగ్రహకారకుండైన చిత్రకారునిసామర్థ్యవిశేషంబభినుతింపందగియున్నది. ఈవిగ్రహములనుగాంచినప్పుడు సుగుణమంజరి తనదురవస్థను కొంతవఱకు మఱచి పురుషవిగ్రహము తనగురువైన జయచంద్రుని, స్త్రీవిగ్రహము తనచెలియగు యామినీపూర్ణతిలకను పోలియున్నందుకు నద్భుతపడుచుండెను. ఆమె యింతటితోc దృప్తినొందక నింకను నావిగ్రహమును పరిశీలించుచున్నప్పుడు స్త్రీవిగ్రహమునకు దిగువ భాగమున చిన్నద్వారమొకటి యమర్పcబడియున్నట్లు లామె కనులకు గోచరించెను. ఆద్వారమును దెఱచిచూడగా తాను దూరగలిగినంత చిన్నసొరంగమొకటి కనుపించెను. దానిని గాంచినప్పుడు సుగుణమంజరికి నధికసంతోషముగలిగెను. అది యొక యంతరమార్గమనియు రాజభవనములయం దట్టిమార్గములుండుట సహజమనియుc దలcచి దానిమూలమున దానావలకు చెరాబంధమును విడిపించుకొనగలనని యాశకలిగెను. అందుc బ్రవేశించుటకు మొదట సందియించెనుగాని తుదకు కొంతసేపటికి మనంబు దిటపఱచుకొని లోనcబ్రవేశించెను. ఆమె కొన్నియడుగులు జనినతోడనే మార్గమున కడ్డముగా కవా



టముతో బంధింపcబడిన ద్వారమొకటి యామెయుద్యమమునకుc బ్రతిబంధకముగాc గనుపించె. దానిని తెఱువవలెనని యెంతప్రయత్నించినను నది సులభసాధ్యముగాకుండెను. అప్పు డాతలుపు నామె తనరెండుచేతులతోను బట్టి సత్తువకొలఁదిని వెనుకకు లాగెను. లోపలిబీగము త్రుప్పుపట్టియున్నందున నది విఱిగి తలుపు తెఱవcబడెను. ఆతలుపు వీడినతోడనే చిన్నగది యొకటి గనుపించెను. ఆగదియందొక మంచము, దానిపై నొకపరుపును నమర్పcబడియుండెను. ఆమంచముపై వ్రేలాడుచున్న దోమతెర చినిగి మధ్యమధ్యమనిషి దూరతగిన పెద్దరంధ్రము లేర్పడియున్నవి. ఆపరుపుపై కప్పcబడిన యుత్తరీయంబు చినిగి ధూళిచే కప్పcబడి రంగుమాఱియున్నది. ఆ గదియందలి యినుపకమ్ములగవాక్షమును సగమువఱకు కొయ్యబల్లలతో బిగింపcబడి యున్నందున వెలుపలివారు లోనికిc గనుపింపరు. ఆగదియొక్కయునికియు దానినిర్మాణచాతుర్యమును పరిశీలింప నది దారుణకర్మంబుల నిమిత్తముద్దేశింపcబడినట్లు కనుపించుచున్నది. ఆమంచముప్రక్కనున్న యలమారయందు దువ్వెన కాటుకభరిణె మొదలగున స్త్రీలుపయోగించెడు కొన్నివస్తువులను గాంచినప్పుడు తనవంటిదురదృష్టవంతురాలిందు చెర పెట్టcబడెనని సుగుణమంజరి భావించుకొనెను. ఆయలమారునందలి చిన్నపెట్టెయందు కాగితపుతుట్టయొకటి సుగుణమంజరికి కనుపించినందున సుగుణమంజరి దానినివిప్పి చదువcబోయెను. కాని, యాగదియం దామెకు గనుపించిన భయోత్పాత

ములయిన కొన్నిచిహ్నములను బట్టి సుగుణమంజరి యాగది విడిచి యావలకు వెళ్ళవలెనని ప్రయత్నించెను. కాని, యాప్రదేశమును విడిచి యావలకుం బోవుటకు మార్గమేదియుం గనుపించనందున వెనుకకు మరలి మరల యెప్పటితావున కేతెంచి కూర్చుండి విచారపడుచుండెను. అందులో తలుపునొద్ద చప్పుడియినందున సుగుణమంజరి తలుపు తెఱచెను. వెంటనే యేబదివత్సరముల ప్రాయముగలరాజపురుషుం డొకఁడు లోనికిం జనుదెంచెను. వానినిం జూచినతోడనే సుగుణమంజరి భయముచే తత్తరిల్లి తలవంచుకొనెను.

రాజు—కోమలీ! ఇందు పరులెవ్వరును లేరు. నీ వేల యిట్లు సిగ్గుచేం దలవంచుకొనెదవు?

సుగు—దుర్మార్గహృదయమునకన్న హేయమైనపదార్థమేదియు లేదు. సాధ్వీమణులు దానినిం జూడగర్హింతురు.

రాజు—ఇంతయుచితానుచితపరిజ్ఞానము లేకపోవుటచే నీవిట్లు భావించుచుంటివి గాని, ఇందు దుర్మార్గులెవ్వరును లేరు.

సుగు—ఉచితానుచిత పరిజ్ఞానము లేకపోవుటచేతనే మానవుఁడెట్టి దుష్కార్యములైన చేయసాహసించును. యుక్తాయుక్తపరిజ్ఞానమే యున్నయెడల యుత్తమకాంతల నీరీతిగొని తెచ్చెదవా?

రాజు—తాముకోరిన కన్నెలను యుద్ధరంగమున శత్రువీరుల జయించి కొనితెచ్చి వివాహమాడుట క్షాత్రధర్మమే. ఇదియే రాక్షసవివాహంబు. శ్రీకృష్ణుండు శత్రునివహంబు



నురుమాడి రుక్మిణీదేవినిం గొనితెచ్చి వివాహమాడలేదా? కాన నేనొనర్చినది పౌరుషకృత్యముగాని నిందార్హమైనదికాదు.

సుగు—శ్రీకృష్ణుండుయుద్ధమున తన్ను కోరినకన్యకను గొనితెచ్చెను గాని నీవలెనన్యులను మోహించిన నారీమణుల గాంచియుండలేదు. నక్క యేడ దేవలోకమేడ. సిగ్గులేక నిన్ను శ్రీకృష్ణునితో నుపమించుకొని సంతోషించుచుంటివి! పరమపతివ్రతల బాధించినరావణునితో నీకుపమానము చక్కఁగా కుదిరియున్నది. నీవును రావణునివలెనే పుత్రమిత్రకళత్రములతో నశింపవలసియుండుటచే నీకును యిట్టిపాడుబుద్ధులు పుట్టుచున్నవి.

సుగుణమంజరి యిట్లు నిర్భయముగా ప్రత్యుత్తరములిచ్చుచున్నందున ప్రతాపరుద్రునకుం బట్టరాని దురాగ్రహముగలిగి "ఓసి! నిన్నబలవని యెంచి కరుణించితిని. సప్తదివసంబులలో నీవు నన్ను వరించి వివాహమాడవేని నిన్నావల బలాత్కారముగా వివాహమాడెదను. నీయందు నాకధికానురాగము గలిగియుండుటచే నిన్ను మన్నించి యూరకుంటిని" అని చెప్పి ప్రతాపరుద్రుఁడచటనుండి వెడలిపోయెను. అపుడుసుగుణమంజరిదుఃఖాక్రాంతహృదయమైమానభంగముకంటె ప్రాణత్యాగమేయుత్తమమనియెంచి ప్రియజనకుని దలంచుకొని "నాయనా! నీవునునావలెనే శత్రువులకుఁజిక్కి దుఃఖించుచుంటివో లేక యసురులం దొఱగి స్వర్గలోకంబున సుఖించుచుంటివో" యని పెద్దపెట్టున నేడువసాగెను. ఏడ్చియేడ్చి విశ్ర

స్థితురాలై యూరకుండి తుదకు నిదురించెను. ఆనిద్రయందు ప్రతాపరుద్రుఁడు తనకపకృతి సలుపుచున్నట్లు కలగని దిగ్గున లేచి మరల నేడువసాగెను. అంతలో రాజభటుఁ డొకఁడు లోనికిఁ జనుదెంచి మందస్వరముతో "కాంతా! నీవేల యిట్లు బొగిలెదవు. నీ వెవ్వరిదానవు? నీపేరెయ్యది?" ఆకస్మికముగా నామె కాతఁడు బొడసూపి యడిగినప్పుడు సుగుణమంజరి తత్తరిల్లి దిగ్గున లేచి యవనతముఖియై నిలుచుండెను. అపుడు జయచంద్రుఁడు "మానినీమణీ! నన్ను శత్రునిగా పరిభ్రమింపకుము; దైవముతోడు. నీకు నేనపకృతి సలుపవచ్చినవాఁడను గాను. నిన్ను గాంచినన్నాకు జాలిబొడముచున్నది.

సుగుణ—యజమానుఁడు క్రూరుఁడైనప్పుడు సేవకుడు యోగ్యుడౌనా?

రాజభ—కోమలీ నీవట్లు భావించుట న్యాయముగాదు. కార్యావసరంబున దుర్మార్గులను సేవించినంతమాత్రమున భటుఁడు నయితము దుర్మార్గుడని తలంచుట సరిగాదు. నన్ను నమ్ముము సత్యంబు పలుకుచున్నవాఁడను. నాచేతనైనంత యుపకారమును జేసెదనుగాని నీకపకారమెన్నఁడును జేయఁదలప. దీర్ఘకాలంబు నీతో సంభాషించుచున్నయెడల మనయిరువురకు నపాయము వాటిల్లును. కాన నీయుదంతంబు సాంతంబుగా నెఱింగింపుము. జాగుచేయకుము. సుగుణమంజరి తనలో "యీతనికంఠస్వరము మునుపు నే వినియున్నదేగాని క్రొత్తదిగా కనుపించదు యీతఁ డెవ్వఁడై యుండును?" అని యోచించుచు కీకంట



వానినిఁ జూచి రూపముమాత్రముతో నిదివఱకుఁ జూచినదిగానందున మరల సంశయించుచు "కాని యీతనిసంభాషణయందు కపటమున్నట్లు గనుపించదు" అని తలఁచి మృదుస్వరంబున "అయ్యా! అయ్యా! అయోధ్యాధీశ్వరుండైన సుదర్శనరాజు కుమార్తెను. నాపేరు సుగుణమంజరి. నన్నీ ప్రతాపరుద్రుఁడు చెఱఁబెట్టి వివాహమాడుమని నిర్బంధించుచున్నవాఁడు. వాని బాధతొలఁగించుకొనుటకు వేఱుసాధనమేదియుఁ గనుపించనందున మరణంబే శరణంబని నిశ్చయించుకొంటిని" యని కన్నీరు నించుచు విన్నవించెను. జయచంద్రుఁడు "ఓమానినీ! నీవనవసరంబుగా బాధపడుచుంటివని నేఁదలఁచెదను. ప్రతాపరుద్రుఁ డంతటి మహారాజు నిన్ను వరించినప్పుడు నీవేల వెనుదీసితివి? అందుకు నీముగ్ధత్వమే కారణమైయుండును.

సుగుణమంజరి—అయ్యా! తమరుదయానిధులయిన యుత్తమపురుషులని సంభావించితిని. చేతనైనసహాయము చేయుదుమని నుడివియుంటిరి. ఈయాలోచన జెప్పుటయేనా తమరు చేయఁగలిగిన సహాయము?

రాజభటుఁడు—(చిఱునగవుతో) కామినీ! నేఁజెప్పిన యాలోచనయందు విపరీతమేమియున్నది? అది నీకు శ్రేయోదాయకమనియే నేను నుడివితిని.

సుగుణ—నా శ్రేయముఁ గోరుటయే యథార్థమైనయెడల నాకీచెరనుండి విడిపింపఁబ్రయత్నింపుఁడు. మీకది యశక్యమైనయెడల ప్రాణపరిత్యాగము గావించి యీకారాగృహబం

ధమును దొలఁగించుకొనియెదను. జయచంద్ర పాణిగ్రహణ మసంభవమైనయెడల నేను జీవించినను ప్రయోజనము లేదు. జయచంద్రునిదప్ప నాచిత్త మన్యుల నెన్నఁడునుఁ జేరనేరదు.

రాజభ—అట్లయిన నేను నిన్ను విడిపించి నీప్రియవల్లభునిఁ గలిపెదను.

సుగుణ—వద్దు. నీకు శక్తి గలిగినయెడల నన్ను మాతల్లిదండ్రులం గలుపుము. వారలే నాజీవితేశ్వరునకిచ్చి వివాహము చేసెదరు.

రాజభ—వారట్లు చేయనియెడల?

సుగుణ—దేహమున్నంతవఱకు బ్రహ్మచర్యవ్రతంబుననే కాలంబు గడపెదను.

రాజభ—అట్లయిన నీమనోవిచారంబు విడిచి ధైర్యంబుతో నుండుము. రేపురాత్రి నిన్ను గొనిపోయి మీతల్లిదండ్రులఁ జేర్చెదను. నేను నీకుఁ బరుఁడనని భావింపకుము. నిన్ను చిన్ననాఁటనుండియుఁ బ్రేమించుచుంటిని. నీకీదురవస్థసంభవించిన తెఱంగెఱింగినదిమొదలు నాకధికపరితాపము గలిగి నిన్నుఁ జూడవచ్చితిని. రేపటిరేయి నిన్నుఁ దప్పకఁ గొంపోయెదను. నీచింత యుడుగుము. అని చెప్పి వెళ్ళిపోయెను.

—o—

## ఎనిమిదవప్రకరణము

—o—

రాజభటుఁడు సుగుణమంజరిని విడిచి చనినతోడనే యాతఁడెవ్వఁడై యుండునా యని యోచించుచు చిన్ననాఁటనుండియు యీతనికి నాయెడలనధిక ప్రేమ గలదఁట. యీతఁడు జయచంద్రుఁడై యుండునా? ఈతని కంఠస్వరము మున్ను నేను వినియున్నదే. మినుకుమినుకుమనుచున్న దీపపుకాంతిని నీతనియాకారమును నేను గుర్తింపలేకపోతిని. పోతుటీగకైనను దూరనలవిగాని యీయగమ్యప్రదేశంబున కాతఁడెట్లు రాఁగలఁడు. ఆతఁడెవ్వఁడైనను నాతని వచనములయందు కపటమున్నట్టు కనుపించదు. వానివచనములయందు నాకు కొంతవఱకు నమ్మకము గలిగి నాకూరట గలుగుచున్నది. అని తలపోయుచు నారాత్రి కొంతవఱకు నిద్రించి మరునాఁడరుణోదయంబున మేల్కాంచి కాలోచితకృత్యంబుల నిర్వర్తించి తోడనే తలుపులోపల గొళ్ళెముపెట్టుకొని తనకాగదియందు కనుపించిన కాగితపుచుట్టనువిప్పి చదువఁదొడంగెను. ఆకాగితము తేమచేతను నక్కడక్కడఛిద్రమైయున్నను నందు చాలభాగము చదువుటకు వీలుగానుండెను. అది విడియక్షరములతో వ్రాయఁబడియుండెను. ఆవర్ణములయాకృతినిఁబట్టి యదియొకప్రసవకోమలిచే రచింపఁబడినట్లెంచఁదగియున్నది. అందలి యక్షరంబు లచ్చటచ్చట శిథిలములైనను దానిని సుగుణమంజరి పూర్తిపఱచి

యిట్లు చదువుచుండెను. "ఆహా యిదియేమిదారుణము! ఈబాధనాకెంతదుర్భరమైనది. ఈదుర్దశ ననుభవించుచున్న నా కెంతమొండిబ్రతుకు. ఈదురాత్ముఁడింకను నన్నేమిచేయఁదలఁచియుండెను. నన్నుఁజంపి పుణ్యముగట్టుకొనఁదలఁచెనో, అట్టిపాపమున కొడిగట్టఁదలఁచినయెడలవీఁడింతకాల మేలయుపేక్షించి యూరకుండును. నిజముగా హత్యగావింపఁదలఁచినయెడలవీని నడ్డుపెట్టువారెవరు? ఈచెరయందే నింతవఱ కిరువదిదినంబులుగడుపఁ గలిగితిని. దినదినము నాబాధ యధికమగుచున్నది. ఈచెరతలుపుచప్పుడైనప్పుడెల్ల నాగుండెలవియుచున్నవి. నేనాకస్మికముగా భోగములనుండి తొలఁగింపఁబడి బాధింపఁబడుచున్నను నేనింకనుబ్రతుకనపేక్షించుచుంటి. "ఈదుష్టప్రపంచమును నీవింకఁ జూడఁజాలవు. పరలోకవాసుఁడైననీభర్తను నీవు త్వరలోఁ గలిసికొందువు." అని యెవ్వరో చెవిలోఁజెప్పుచున్నట్లు వినుపించుచున్నది. ఇట్లు వినుపించుచున్నను నాకింక లోకముపై యాశపోకున్నది.

రాజ్యభోగంబు లేవియును మఱల నాకుప్రాప్తంబులేనట్లు గనుపించుచున్నవి. ఈశ్వరా! నాజీవిత మింతటితో ముగింపఁజేయుచుంటివా....అడ్డు..రక్షింపనేరవా? ప్రాణేశ్వరా! నీమృతికి భైరవమతము కారణమైనదా! ఏదురాత్ముని ఖడ్గము నీశిరస్సును ఖండించెను. ఏదురాత్ముఁడు నాముద్దుల కొమరుని నాయొద్దనుండియెడఁబాపెను. ఏపాపి, నాప్రియపుత్రికను నాయొడినుండి యుపహరించెను? చీమనైన నే బాధించి



యెఱుఁగను. ఈశ్వరా! నాకీబాధయేల తటస్థమయ్యెను? మహారాజునకుఁ బట్టమహిషినై యుండియు నేనించుకయు గర్వించియెఱుంగను? నాకీదీనభావమేలవాటిల్లెను. నేను మహారాజ్ఞినై యుండియు బీదసాదలసదనంబులకుంజని వారలకుఁజేతనైన ధనసహాయంబు జేసియుంటిని. రోగులధామంబులకరిగి యౌషధదానముచేసి వారలనాదరించితిని. ఖేదమానసులయాలయంబులకరుదెంచి చేతనైనయుపచారంబులచే వారలగాసిమాన్పి కాపాడితిని. ఈశ్వరా! నేఁడు నాకుఁదౌర్భాగ్యత్వంబును మనోవికలంబును కడుశోకంబును నేలగలుపవలయును. నీశాసనము లింతధర్మవిరుద్ధములయినవా? లేక నాకిది పూర్వజన్మసంచితమా? నాముద్దుపిల్లల నేనీకన్నులతోఁ జూడఁజాలనా? ఓరీదురాత్ముఁడా! నాచిన్నిపాపలనాకొసంగి నన్నేయడవియందుంచినను నేను సుఖముగాజీవింపఁగలను. ఆదురాత్ముఁడీయుదయంబు నిటఁబొడసూపినప్పుడు వానిదుర్భావమును నేను కనిపెట్టితిని. వాఁడు నన్నింతవఱకేల బ్రతుకనిచ్చెనో నేనెఱింగితిని. స్వాభావికమైన మరణమే నాకును నామగనికిని కారణంబని లోకమును నమ్మించుటకై నన్నింతవఱకు వధింపక యూరకుండెను. వాఁడు నాతో నేమనిచెప్పెను? వానినోటవెడలినమాటలను నాచెవి సరిగా గ్రహించెనా? నానాథుండు వ్యాధిబాధచే గాలధర్మమునొందినట్లు నేను శ్రుతపఱచి లోకమునునమ్మించినయెడల నన్ను సర్వవిధముల సౌఖ్యపెట్టెదనని వాఁడెట్లు సిగ్గులేక పేలుచుండెను? ఇదియా నీభైరవమతము.

నీమతముకాల. నీమత మెప్పుడైన తుదముట్టునా? ఓరీపాపా
త్మా! నాయెమటికిరమ్ము. అన్నభార్య పంచమాతలలో నొక
తెయనినీ వెఱుంగవా! ఓరిపాపసంభవా! యిట్లాడ నీనాలుకె
ట్లాడెను... నేను వానినితిట్టినప్పుడు వానిముఖమెట్లు జేవురించి
నది. వానికనుబొమలెట్లుముడివడుచున్నవి. వానిపెదవులెట్లదరు
చున్నవి. వాఁడింతపనిఁబూనివచ్చినప్పుడు నన్నింక బ్రతుక
నిచ్చునా? భర్తను పోఁగొట్టుకొని నేను బ్రతుకఁజూతునా!
నాకొడుకు కూఁతులకన్న నాప్రాణమధికమా. కాలము జరుగఁ
చున్నకొలఁదిని మృత్యుదేవత నన్నుసమీపించుచున్నదని
నేనెఱుంగుదును. పిల్లలారా! మీరీలోకమునువిడిచి మీతండ్రి
నిఁ జేరియుంటిరని నేనుభావించితిని. కాని, మీరింకను భూమి
పై ప్రాణములతోనుంటిరని వినుటచే నాకుమరల జీవితాశ
గలుగుచున్నది. ఆహా! నాదెంత మొండిహృదయము! పిల్లలా
రా! మిమ్ము నొక్కసారి కనులతోఁజూచి మనసార కౌఁగిలిం
చుకొనవలెనని యాశించియుంటిని. ఈయాశయే నాజీవనము
నీబొందెను విడువనీకున్నది. ప్రతిదినమును నాకాహారమును
గొనితెచ్చుచున్నగాలవుఁడు నాయెడల కరుణకలిగి నాకీలేఖనా
పరికరములను రహస్యముగా తెచ్చియిచ్చెను. అందుచే నీదుర
వస్థనిట్లు వ్రాయఁగలిగితిని. నేను నాపిల్లలకొఱకునేడ్చుచున్న
ప్పుడు వారలింకను జీవించియుండిరనియు వారలకై నీవెంత
మాత్రమును విచారింపనవసరము లేదనియుఁ జెప్పి నన్నోదా
ర్చెను. మఱియును నింకొకదోజుగడచెను. ఆదుర్మార్గుఁడునాకు



మఱలపరిత్యక్తమై దురాగ్రహముతో నేఁజెప్పినదానికి సమ్మ
తించితివాయని నన్నడిగెను. అప్పుడు నాకుపట్టరానికోపము
గలిగి నే నిట్లంటిని. "ఓరీదురాత్మా! మహాపతివ్రతలఁగారిం
చిన రావణాదిఖలుల కేగతిపట్టినదో నీకునునట్టిగతిసిద్ధమైయు
న్నదనినమ్ముము." నేనిట్లునుడివినప్పుడు నాపాలిటిమృత్యుదేవత
వలె వాఁడధికరోషంబున "ఓమూఢవనితా! యమపురం
బునకుఁబోవఁదలఁచియె యీనీచోపమానముల నన్నగౌరవిం
చుచుంటివి" యని కైదువనొఱఁబెఱికి మీఁదకు రాఁజొచ్చె
ను. నేనింతకుపూర్వమె ప్రాణంబులపై యాసదొఱఁగియుండు
టచే వానికి నిమిషమాత్రము జంకక "ఓరీ! భ్రాతృహంత
కా! దుర్మతావలంబకా! దుష్కృత్యములనాచరించు దుష్టా
త్మునకు నగౌరవముగాక గౌరవమెటనుండివచ్చును. నాయీచర
కన్న యమునికేతనమధికబాధకరమైనదిగాదు. సోదరహంతకుఁడ
వైన నీకీలోకమే యమలోకమై భాసించును." అని నేను బదు
లుచెప్పినప్పుడు చేతనున్న కౌక్షేయంబు ఝళిపించుచు "ఓసీ
నీప్రాణవల్లభుఁడు భైరవమతసిద్ధాంతముల నుల్లంఘించుటచేఁ
దలఁద్రెవ్వనేయఁబడెను.

ఈశ్వరద్రోహి యైనవాఁడు భ్రాతృఁడైన నేమి? జన
కుఁడైన నేమి? ఇపుడు నీతో నాకు వృథావాగ్వాదంబునకుఁ
బనిలేదు. నీకు నేనొసఁగియున్న గడువు రేపటిదివసాంతరంబున
గాని ముగియనేరదు. ఇంతలో వేగిరపడనేల. నీకు జీవితాశయే
యున్నయెడల నాయనుగ్రహము సంపాదించికొని మెలఁగనే

చ్చికొనుము" అని చెప్పి వెళ్ళిపోయెను. ఆదుర్మా...లికిజ... తోడనే దారకుఁడు మరల నాకుగనుపించి కన్నీరు విడువసాగెను...వానిని నేను జూచి "ఓపుణ్యాత్మ నాయెడల నీకు జాలి గలిగెనేని నాకొకయుపకారమును జేయుము. నాసంతాన మింతవఱకు బ్రతికియుండిరేని వారల నాకొకమారు తెచ్చి చూపుము. కన్నులార వారల నొక్కమాఱు గాంచి కౌఁగిలించికొని ముద్దాడి ప్రాణముల విడిచెదను. ఇంకొకసహాయమును సయిత్తము జేయవేఁడెదను. కోసలదేశాధీశ్వరుఁ డగు సుదర్శనుఁడు మాయన్న; నాచే రచింపఁబడుచున్న యీకాగితమును వానికిఁ గొనిపోయి చూపుము" అని దీనత్వముతో వాని బ్రతిమాలుకొంటిని" ఈకడపటివృత్తాంతమును జదివినప్పుడు సుగుణమంజరి దుఃఖ మాపుకొనలేక కుమిలికుమిలి యేడ్చుచు "అత్తా! నీగతియే నీమేనకోడలకును బట్టినది. ఇంతవఱకు నాకు సంబంధము లేనియన్యకాంత యని తలఁచినప్పుడే నేఁ జదువుచున్న ప్రతిశబ్దము నాహృదయమును దహించుచున్నది. నీబంధుత్వ మెఱింగినప్పుడు నాదుఃఖమున కేదిమేర?" అని దుఃఖించుచు "ఓయీశ్వరా! మాయింటఁ బుట్టిననాఁడుఁ బొట్టెల కిట్టిమరణమునే విధించితివా?" అని వెక్కి వెక్కి యేడువసాగెను. తరువాత కొంత సేపటికి దుఃఖ ముపశమించుకొని మఱల యాకాగిదమును చదువుచున్నది. దారకుఁడు "అమ్మా! నీవు కోరిన మొదటికార్యము నాకు సాధ్యముకాదు గాని, వీలుగలిగినయెడలకడపటిదానినెట్లయినఁ జేయఁబ్రయత్నించెదను." అని చెప్పి వెళ్ళిపోయెను. మఱియొక దినమునయితము గతించినది. ఇంతవఱకు దారకుఁడు నాకు కనిపించలేదు. ఇంతకుపూర్వము నేనీగవాక్షమునుండి చూచునప్పుడా చెట్టుకొమ్మపై నొకపక్షిమాత్రము గనిపించుచుండెడిది. నేఁడది సయిత్తము గనిపించుటలేదు. నాదుర.....తక్కినభాగము మిగుల ఛిద్రమైయందున చదువవీలులేకుండెను. ఇది చదివినది మొదలు సుగుణమంజరి భీతిచేతను విచారముచేతను మిగుల బాధపడుచుండెను. సుగుణమంజరి కాగిదమును భద్రపఱచి, యేమిచేయుటకును దోఁచక దీనవదనముతో తనకును మేనత్తవలెనే చావుతప్పదని నిశ్చయించుకొని విచారపడుచుండెను. ఇంతలో రాజభటుఁడుతనకుఁజేసియున్నవాగ్దత్తము జ్ఞప్తికివచ్చి మరల కొంతవఱ కూరటగలిగి సూర్యుఁ డెప్పుడస్తమించునా రాజభటుఁడెప్పుడువచ్చునా యని యెదురు చూచుచుండెను. అంత కొంతసేపటికి తపనుం డపరగిరి నలంకరించె. సంధ్యాసమయం బాసన్నమయ్యెను. పక్షిబృందం బాహారాపేక్ష దొఱగి కులాయంబులంజేరె. అంతకంతకు నిశీథంబు సమీపించుటచే కటికిచీఁకటులు లోకమంతయు నాక్రమించికన్నుగనిపించకుండెను. ఇంతవఱకు సుగుణమంజరి రాజభటుఁడు తన్ను విడిపించునని గంపంతయాశగలిగియుండెను గాని యాతఁడింతవఱకు రాకయుండుటచే నామె యాశ నశించి మరల విచారింపఁదొడగెను. రాజభటుఁడెవ్వఁడయినది తానెఱుంగకపోయినను వాని మాటల సందర్భమునుబట్టియు కంఠస్వరమునుబట్టియు నాతఁడు

మున్ను తన్నెఱింగినవాఁడయి యుండునని యామె తలంచెఁగాని యాతఁడింతవఱకు రాకయుండుటచే నామెకు మఱల సంశయముగలుగఁ జొచ్చెను. తండ్రిజీవించియున్నయెడల తన్నిట్ల యున విడిపించియుండుననియు నాతఁడు విగతప్రాణుఁడై యుండుటచే నట్టిప్రయత్నమేమియు జరిగియుండలేదనియు నిశ్చయించుకొని మఱింతదుఃఖింపసాగెను. ఇంతలో రాత్రి రెండవ యామము సమీపించెను. ఇంతవఱకుఁ గావలికాచుచున్న రక్షకభటులు వారిస్థానముల నధిష్ఠించిరి. అపుడా రాజభటుఁడు నిశ్శబ్దముగా లోపల ప్రవేశించి నెమ్మదిగా సుగుణమంజరినిపిలువసాగెను. వాని కంఠస్వరమును వినినతోడనే సుగుణమంజరికి పట్టరానిసంతోషము కలిగెను. అపుడు రాజభటుఁడు సుగుణమంజరిం గాంచి ‘‘కామినీ! నిన్ను రహస్యముగాఁ గొనిపోయెదను. నీవు సిద్ధముగానుంటివా’’ అని యడుగ, సుగుణమంజరి వానికి ప్రత్యుత్తరము చెప్పకయే తలవంచుకొని యేదియో యోచించుచుండెను. రాజభటుఁ డామె తన్ను వెంబడించుటకు సంశయించుచున్నదని గ్రహించి ‘మానిని! నీకు నావలనగాని యితరులవలనగాని మానభంగ మెంతమాత్రము నాటిల్ల నేరదు. నీవు సంశయింపకుము.

సుగుణ—అయ్యా! మీహృదయముయొక్క యౌన్నత్యము మీమాటలయందుఁ గనిపించుచుంటచే నాకాభయ మెంతమాత్రము లేదు. కాని వేలకొలఁది రక్షకభటుల నెట్లు తప్పించుకొని పోఁగలమని సంశయము నొందుచుంటిని.



రాజభటు—వేలకొలఁది గాదు లక్షలకొలఁదియున్నను నీకు భయపడ నవసరము లేదు. ఎందఱున్నను నిన్ను నిరపాయముగా నావలకుఁ గొనిపోవఁగలను. ఆలస్యము చేసితివేని కార్యభంగము వాటిల్లును. నీవీవస్త్రముల పరిగ్రహించి యుద్ధభటుని వేషంబు ధరింపుము. శీఘ్రంబ లెమ్ము’’ అని చెప్పి తనచేత నున్న యుడుపులను సుగుణమంజరి కిచ్చెను. సుగుణమంజరి వానిం గైకొని యావలిగదిలోనికేఁజని యుద్ధభటుని యాకృతిని వహించెను. సుగుణమంజరి పయనమౌనప్పుడు తనకాగది యందు దొరకిన కాకితపుచుట్టను మఱచిపోక జాగ్రత్తగా తన యొద్ద భద్రపఱచి రాజభటుని వెంబడించెను. రాజభటుఁడు నిజకరంబున నామె కేలు గీలించి కారాగృహకవాటంబు తెఱచికొని యావల ప్రవేశించెను. యాచెఱద్వారము విడిచినతోడనే రాజభటుఁడు ‘అరేహవల్దార్’ అని కేక పెట్టెను. ఆ కేకవినిన తోడనే రక్షకభటులలో ప్రధానపురుషుండు ‘స్వామీ! అప్రమత్తులమై జాగరూకతతోఁ గాచియుంటిమి’ అని చెప్పి వారల వెంబడించెను. వీరలు జనుచున్నప్పుడా యావరణలయందు రక్షకభటులనేకులు వీరలఁగాంచిరిగాని చిత్రకేతుండు వీరలతో నుండుటచే వారల నడ్డుకొన నొక్కండు సాహసింపఁడయ్యెను. చిత్రకేతుండు సింహద్వారము దెఱచి వీరల నావలకు బనిచిన తోడనే ద్వారమును మఱల బంధించి వెనుకకు మఱలిపోయెను. కావలివారెవ్వరును తమ్మునడ్డుకొనకుండుటచేను తాము సులభముగా కారాగృహమునుండి తప్పించుకొనిపోఁగలుగుటయును

సుగుణమంజరి కధికాశ్చర్యమును గలిగించుచుండెను. కోటసిం
హద్వారము దాటినతోడనే వీరలిరువురును వంతెనమీఁదుగా
నున్నమార్గమును విడిచి యగడ్త దిగువభాగమున కొంతదూర
మునడిచి యగడ్త యావలయొడ్డునకట్టివేయఁబడిన చిన్నపడవ
యందుఁ గూర్చుండిరి. వెంటనే సేవకుఁడొకఁ డాపడవను కొంత
దూరము లాగికొనిపోయి యావలియొడ్డునఁజేర్చెను. వీరలాపడ
వను విడిచి యొడ్డుజేరినతోడనే యాసేవకుఁ డాయానపాత్రము
నచట బంధించి సమీపవృక్షమున గట్టివేయఁబడిన వెల్లగుఱ్ఱ
ములను రెంటిని గొనితెచ్చి వారలయెదుట నిల్పెను. అపుడు
రాజభటుడు సుగుణమంజరిని గాంచి 'కాంతామణీ! నీవీచిన్ని
గుఱ్ఱము నెక్కఁగలవా?' అని యడిగెను. "ఎక్కఁగలను.
అశ్వారోహణమునందు నాకించుక పరిచయముగలదు" అని
సుగుణమంజరి నాచిన్నిగుఱ్ఱముపై నెక్కించియారాజభటుఁడు
రెండవగుఱ్ఱముపైనెక్కి తాను ముందు జనుచుండెను. సుగుణ
మంజరియు రాజభటుని వెంబడించి గుఱ్ఱమును నడుపుచుండెను.
తరువాత వారలిరువురును వాయువేగంబున తమగుఱ్ఱంబులం
బఱపి శీఘ్రకాలంబులో యటదిగవిడచి యయోధ్యాపురంబు
సమీపించిరి. అపుడు సుగుణమంజరి కారాగృహవిముక్తి
గలిగినందుకు నపరిమితానందంబున మిన్నంది తనకిట్టి మహోప
కార మొనర్చి రక్షించిన రాజభటునియెడల యపారభక్తి
విశ్వాసములు గలిగియుండెను. కాని యామె వానివెనుకఁ
బ్రయాణము చేయుచున్నప్పుడు యాతఁడెవ్వఁడై యుండునా



యనిమాత్రము విచారించుచుండెను. తరువాత సుగుణమంజరి
యారాజభటునిఁగాంచి "అయ్యా! చెఱ విడిచినది మొదలు
మధ్యమార్గంబున మన కేయుపద్రవము సంభవించునో యని
భీతిల్లుచుంటిని. ఇపు డీశ్వరానుగ్రహమువలనను తమ సామ
ర్థ్యవిశేషముచేతను నాకు భయము తొలఁగినది. కాని నన్ను
రక్షించిన మహాపురుషుని నిజస్థితి నెఱుంగవలయునన్నకోరిక
నాహృదయమును నింకను వేధించుచున్నది." అని నుడివి
నప్పుడు రాజభటుఁడు గుఱ్ఱముపైఁ గూర్చుండి యామెవంకకు
మోముద్రిప్పి చిఱునవ్వు నవ్వెను. అంతవఱకు నావరించి
యున్న చీఁకటిపోయి వెన్నెల ప్రకాశించుచుండెను. వానిముఖ
మిప్పు డామెకు చక్కఁగా కనిపించుచున్నందున నామెకు
సంశయనివృత్తి గలిగి యధికానందంబున 'ప్రాణవల్లభా! జయ
చంద్రా!' యని కెవ్వున కేకవెట్టి గుఱ్ఱముపై కొఱగెను. వెం
టనే జయచంద్రుఁడు గుఱ్ఱమునుండి దూకి యామెను పడకుండ
గట్టిగా పట్టుకొనెను. అపుడు సుగుణమంజరి యానందపార
వశ్యమునుండి కొంత తెప్పరిలి "గురువరా! మీనిజస్థితి నింత
వఱకు మఱుగుపఱచి కపటవేషంబున నన్ను నలయించుట
దేవరకు ధర్మముగాదు.

జయచంద్రుఁడు——కాంతా! నావర్తనము నీకు బాధకర
ముగా కనిపించినయెడల నన్ను మన్నింపుము.

సుగుణమంజరి——నేను మిమ్ముల గుర్తింపలేకపోవుటచే
నే నట్లంటిని. కనుక నానేరమును క్షమింపవేఁడెదను.

జయ—కామినీ! నీయెడల నాకు వాత్సల్యమేకాని యాగ్రహ మెప్పుడును లేదు. మరల నిన్నెప్పుడు జూడఁగలనాయని మాత్రము విచారించుచుంటిని.

సుగు—మన వివాహకాలమునందుఁ జూడఁగలము.

జయ—కాంతా! నీవింకను నాశను గలిగియుంటివా? అది శశవిషాణంబని నమ్ముము.

సుగు—అది యసంభవమైనయెడల నేను బ్రతికియుండిననేమి ప్రయోజనము?

జయ—నీవు విష్వక్సేనసార్వభౌముని బెండ్లియాడి సకలసుఖముల ననుభవింపఁగలవు. నీవు సర్వసుఖంబుల ననుభవించుటయు చల్లగా వర్ధిల్లుటయు నాయభిమతంబు. కావున నీ బ్రతుకనుపయోగమని చింతింపకుము.

సుగు—విష్వక్సేనసార్వభౌముని గాదు. దేవేంద్రునైన నేను పరిగ్రహింపను. నామనస్సెఱింగియు దయదొఱఁగి నన్నిట్లు నిరాకరించుట నాయభాగ్యత్వంబుగాక వేఱొకటేమున్నది.

జయ—దయదొఱఁగి నిన్ను నిరాకరించితినని భావింపకుము. నీయెడల నాకపారప్రేమయే. అయినను నందఁబ్రాని పండ్లకఱ్ఱులుసాచుట యేమిలాభము? నేను బ్రాహ్మణుఁడను; నీవు క్షత్రియకాంతవు. మీతండ్రి నాకు పరమశత్రువు కనుక వివాహసంబంధము మనకెట్లు పొసగనేర్చును.

సుగు—బ్రాహ్మణుఁడు క్షత్రియాదికన్యకల పరిణయంబగుట శాస్త్రనిషిద్ధంబు గానేరదని తమకు విదితమే. మా



తండ్రి సమ్మతించినప్పుడు నాపాణిగ్రహణంబు నిరాకరింపక యంగీకరింపవలయును.

జయ—మీతండ్రి సమ్మతింపని యెడల?

సుగు—వీరు మఱియొక కన్యకామణిని వివాహమై సుఖింపుఁడు. నేనుమాత్రము ప్రాణము లున్నంతవఱకు గహనకుసుమమువలె దేవర పదారవిందముల ధ్యానించుచు నీకన్యకావ్రతంబుతో కాలము గడపెదను.

జయ—నిన్ను విడిచి నేను సుఖింతుననుకొంటివా? అసిధారాబ్రహ్మచర్యవ్రత మాచరించుచు నే జీవించినంతకాలము నీకై నిరీక్షించియుండెదను.

సుగు—దేవర సెలవిచ్చినది ప్రమాణవచనముగా భావించుకొనెదను.

జయ—నిశ్చయముగా నిది ప్రమాణవచనమే. నీసంశయము నుడుగుము. తెల్లవారవచ్చుచున్నది. మనము శీఘ్రంబుగాఁ జనవలయును. మీతల్లిదండ్రులు నీనిమిత్తము మిగుల శోకించుచున్నవారు. మీతండ్రిగారి భవనమునందు రణభేరి మ్రోగుచున్నది. మగధపై దాడివెడలు సన్నద్ధులగుచున్నట్టు కనిపించుచున్నది.” అని తాను మరల నశ్వారూఢుండై యామెను గొనిపోయి కోటద్వారమునందు విడిచెను. సుగుణమంజరియు నశ్వమును దిగినతోడనే జయచంద్రునకు నమస్కరించి నగరుఁ జొచ్చెను. జయచంద్రుఁడు వెనుకకు మరలెను.

సుగుణమంజరి చెఱఁగొనిపోఁబడినది మొదలు మగధను ముట్టడించుటకు యుద్ధప్రయత్నను లోనఁగూర్పఁబడుచుండెను. అయోధ్యాపురంబులోని కాళికాలయంబున యామినీపూర్ణతిలకయు విజయపాలుఁడును సంభాషించి వెళ్లిపోయినతరువాత కృపాసింధు వొకపురుషపుంగవునితో సంభాషించినట్లు మీరు వినియుంటిరి. ఆపురుషపుంగవుఁడు జయచంద్రుఁడే. జయచంద్రునియొద్దనే కృపాసింధువు సర్వశాస్త్రములనభ్యసించెను. ఇతరసద్గుణములవలెనే గురుభక్తి కృపాసింధునొద్ద యత్యధికముగాఁ బ్రకాశించుచుండెను. భైరవమతము నీలోకమునుండి తొలఁగించి లోకము నుద్ధరింప బ్రయత్నించువారలలో నీతఁడు ప్రథమగణ్యుండు. ఆతనిబుద్ధిసన్మార్గమున ప్రకాశింపఁగలుగుటకు మహత్తరమైన జయచంద్రుని యుపదేశమే కారణము. కృపాసింధువు కాశికాపురంబునకుఁ జనునప్పుడు జయచంద్రుని యాజ్ఞానుసారంబుగా చిత్రకేతునికి విశేషవిత్తము నొసంగి వానిని జయచంద్రునికి వశపఱచెను. చిత్రకేతుఁడు మగధసైన్యంబున నొక గొప్పయుద్యోగియుఁడు. తఱుచు యాతఁడు సైన్యాధిపతితోనుండి వ్యవహారము నడుపుచుండును. చిత్రకేతుని సహాయమువలననే జయచంద్రుఁడు సుగుణమంజరిని చెఱనుండి విడిపింపఁగలిగెను. జయచంద్రుఁడీమెను కోటద్వారమున విడిచినతోడనే లోనికిఁజని తల్లిదండ్రులఁ గలిసికొనెను. తల్లిదండ్రులు సుగుణమంజరిని గాంచినతోడనే సధికానురాగముతో నామెను గౌఁగిలించికొని 'తల్లీ! నీవు మఱల నెట్లువచ్చి



తివి? నిన్ను రక్షించిన పుణ్యాత్ముఁ డెవ్వఁడు?' అని కన్నుల నీరు వెట్టుకొనిరి. సుగుణమంజరి "నన్నురక్షించిన పుణ్యాత్ముఁడు జయచంద్రుఁడు." అనియామె చెప్పినప్పుడుసుదర్శనుఁ డధికాశ్చర్యమునొంది 'ఆతఁడింకను మనరాష్ట్రముననుండెనా? అయినను వానినినేను మన్నించెద'నని నుడివి జయచంద్రుని యెడల యింతవఱకు తాను గలిగియున్న దురభిప్రాయమును కొంతవరకు విడిచియుండెను. మగధముట్టడి నిలుపుచేయఁబడినందున యుద్ధప్రయత్నములు విడిచినేయఁబడినవి. సుగుణమంజరి సౌలభ్యముగా లభించినందుకు సుదర్శనుఁడు మహానందంబున మిన్నంది సుగుణమంజరి తిరిగివచ్చిన కొంతకాలమునకు గొప్పమహోత్సవమును జరిగింప నుద్యమించెను. ఈమహోత్సవదర్శనార్థము బంధుసముదయంబు రాజనగర మలంకరించిరి. సుదర్శనుఁడనేక వైభవంబున బంధుమిత్రపరివారవర్గంబుతో సభాభవన మధిష్ఠించెను.సుగుణమంజరియునాసభాభవనమున నొకవంక సఖీజనపరివృతయై కూర్చుండెను. విజయపాలుఁడు నాసభామంటపమును విడిచి యామినీపూర్ణతిలక సమీపంబునఁ గూర్చుండి యామె సౌందర్యమునుగాంచియువ్విళ్లూరుచుండెను. అప్పుడు సుదర్శనుఁడుసుగుణమంజరిని బిలిచి "కుమారీ! జయచంద్రుఁడు మనకిప్పుడు చేసియున్న మహోపకారమునకు వాఁడింతకుపూర్వ మొనర్చియున్న యపరాధమును మన్నించుటయేగాక వానియెడల నేనింతవఱకుఁ గలిగియున్న శత్రుభావమును విడిచి వాఁడు నారాష్ట్రమున నివసింప నంగీక

రించితిని. ఇఁక నీమనోవిచారమునుమాని సంతోషింపుము.

సుగుణ—ఇంతమాత్రముచే నామనోవిచార ముపశమింపనేరదు. ఆతఁడు నాకుఁ జేసియున్న యుపకారమునకిదియొక ప్రత్యుపకారమని నేను భావింపఁజాలను" అని చెప్పినప్పుడు సుదర్శనుఁడ సూయతో "క్షమాశీ! నేనింతకన్న వేఱుప్రత్యుపకారమేదియుఁ జేయఁజాలను. నీవు సార్వభౌమునికి పట్టపుదేవివై యున్నప్పుడు నీకుఁదోఁచినయుచితోపకారమును జేయఁగలవు.

సుగుణమంజరి—అట్టియున్నతపదవి నేనెన్నఁడాశింపను" అని యింకను నేదియోచెప్పఁబోవుచుండ సుదర్శనుఁడు దానినివినకయేఁ "చాలు, ఏదుష్పాండిత్యమును గట్టిపెట్టియింకనూరకుండుము. నీవెంతచెప్పినను నీపాడుబుద్ధిని నీవువిడువకుంటివి" అని కూఁతునదలించి విషణ్ణుఁడై క్రిందఁజూచుచుండెను. ఇంతలో బంగారుచిక్కములతోఁ గట్టఁబడిన రుద్రాక్షమాలను కత్తుకం దాల్చి యరువదిసంవత్సరముల ప్రాయముగల రాజపుంగవుండొకఁడు సింహద్వారమును సమీపించెను. ఈతండు కాశ్మీరదేశాధీశ్వరుండగు వీరసింహుఁడు. సుదర్శనునకు మాతులుండు. ఈతనిముఖము మిగుల యందమైయున్నను ప్రాయమతిశయించియుండుటచే కొంతవఱకు ముడతపాఱియుండెను. శిరోజములు స్వచ్ఛమైన తెల్లనితెలుపుకాంతిగలిగి యుండకపోయినను కొంతవఱకు నైల్యముతోఁగూడి బూడిదవర్ణమును గలిగియుండెను. వయస్సుమీఱుటచే శరీరపటుత్వము కొంతతగ్గినను గాంభీర్యమైన యాకృతిని గలిగియుండెను. వానినేత్రంబులు పద్మపత్రం



బులవలె సోగలై శాంతములైనఁ జూపులతోఁ బ్రకాశించుచుండెను. దంతములూడియుండుటచే చెక్కులు చొట్టలుపడియున్నను పెదవులయందుఁ గనిపించుచున్న చిఱునగవు ముఖారవిందమునకు వన్నె గలిగించుచుండెను. వీనిఁజూచినతోడనే సభాస్థానమున నలంకరించిన రాజబంధుగులందఱు లేచినిలుచుండిరి. సుదర్శనుండు పీఠమునుడిగ్గి యెదురుగఁజనుదెంచి 'మాతులా! నమస్కారము' అని నమస్కరించి వానితోడితెచ్చియున్నతాసనంబునఁ గూర్చుండఁబెట్టెను. అప్పుడు సుదర్శనుండును వీరసింహుండును నన్యోన్యక్షేమసమాచారంబులఁ బ్రశంసించుచులోకవ్యవహారంబులముచ్చటించుచుండిరి. సభలోని రాజబంధువులందఱును నొకరితోనొకరు సంభాషించుకొనుచుండిరి. ఆసమయంబున విజయపాలుఁడు యామినీపూర్ణతిలకచెలిచెంతఁజేరి రహస్యముగా సంభాషించుచుండెను.

విజయ—కామిని! నీతో నాకంతపరిచయము లేకపోయినను యీస్వల్పపరిచయముచేతనే నీయెడలనాకధికానురాగము గలుగుచున్నది. నేను నిరుపేదను. పేరుప్రతిష్ఠలు లేనివాఁడను. నేనుగొప్పరాజకుటుంబములోనివాఁడనుగాను. కాన నామనోరథమెట్లు సిద్ధించును?

యామిని—భాగ్యభోగ్యములయందు మీరు సామాన్యులైనను సుగుణసంపదయందత్యధికులని నేనెఱుంగుదును. నేనొకదిక్కుమాలిన కన్యకను. నాపైవేషమునుగాంచి మీరిట్లు భ్రమించుచుంటిరేగాని నిజస్థితి విదితమైనప్పుడు నావంటి నిర్భాగ్య

కాంతను మీ రాదరింతురాయని సంశయించుచుంటిని.

విజయ—ప్రేయసీ! నీవట్లు సంశయింపకుము. నాకీధరా
మండలమంతయు నేకచ్ఛత్రాధిపత్యముతో పరిపాలింపఁగలిగిన
సార్వభౌమపదవికన్న నునీపాణిగ్రహణమే యధికముదావహంబు
గలిగించుచున్నది. ఓనాబహిఃప్రాణమా! హృదయపూర్వకము
గా నిన్నే ప్రేమించుచున్న యీపేదమానవుని నీవు విధ్యుక్త
ముగా వివాహమాడసమ్మతింతువా?" అని యడిగినప్పు
డామె ప్రత్యుత్తర మియ్యలేకపోయినను చిఱునగవుతోఁ
గూడిన యామెవాలుచూపులు నామె యంగీకారమును
వానికి శ్రుతపఱచుచుండె. వీరిరువురిట్లు సంభాషించుచున్న
ప్పుడు వీరివెనుక నిల్చివినుచున్న మానవుఁడొకఁడువిజయపాలుని
వీపుతట్టి "నీవీసుందరాంగినివివాహమాడఁదలచితివా" యనిమం
దస్వరముతో వానినడిగెను. అపుడు విజయపాలుఁడు వానివం
కకుఁ దిరిగిచూచి కోపదృష్టితో "నీవెవ్వరవు? ప్రశంసమాలిన
విషయములలో నీవెన్నడిట్లు ప్రవేశింపకు" మని వానిని మంద
లించెను. ఆకొత్తమనుష్యుఁడు "అయ్యా! దయయుంచి నానేర
మును మన్నింపుఁడు. ఇంతకుపూర్వము మీతో నాకుఁగలిగి
యున్న పరిచయమునుబట్టియేగాక పుత్రికాసమానురాలగుటచేనీ
కన్యకామణిక్షేమమును విచారించియు నిన్నట్లడిగియుంటిని"
అని నుడివినప్పుడుయామిని వానిముఖమువంకఁ దేఱిపాఱఁజూచి
దిగ్గునలేచి వానికి నమస్కరించి నయనాంతర్గతంబులనుండి
యానందబాష్పంబులు స్రవింప వానినీక్షించుచునిలుచుండెను.



అపుడు విజయపాలుఁడు విస్మయమానసుండై
"అయ్యా! మీరు మున్ను నన్నెఱింగితిరి. మిమ్ముల నేనింత
వఱకుఁ జూచియుండలేదు." అని యడుగగా యాకొత్తమను
ష్యుఁడు "అయ్యా! నాఁడు ప్రతాపరుద్రుఁడు మిమ్ముల నా
యూరివెలుపల మఱ్ఱిక్రింద బలిసఱక్షించుచుండ నేనట మి
మ్ముల దర్శించితి. తరువాత కుండిననగరసత్రమునొద్దకు మి
మ్ములఁ గొనివచ్చి యయోధ్యాపురంబునకుఁ దెఱవుజూపితిని.
ఈమధ్య మగధరాజు మీసుదర్శనుని ముట్టడించినప్పుడా కద
నరంగమున మిమ్ములఁ గాంచియుంటిని" అని నుడివినప్పుడు
వినయవినమితగాత్రుండై భక్తివిశ్వాసంబులతో చేతులు
మోడ్చి "నాఁడు రక్షించిన మహానుభావుండవీవా? నా
మూఢహృదయ మీవిగ్రహమును గుర్తింపలేకపోవుటచే నీ
ప్రమాదదోషమునకు లోనై బాధపడుచున్నది. ఇంతమాత్ర
ముచే నన్ను కృతఘ్నునిగా భావింపక తదజ్ఞునిగా భావించి
దయజూడఁ బ్రార్థించుచున్నాఁడను." అని నుడివినప్పుడు
యామిని విజయపాలుని గాంచి "అయ్యా! యీతండు నాకు
విద్యనేర్పిన గురుఁడు. యుక్తాయుక్తజ్ఞానమును గలిగి నామా
నవజన్మమును సార్థకపఱచిన మహనీయుండీతఁడే. వీని పేరు
జయచంద్రుఁడు. నాప్రాణసఖి సుగుణమంజరివరించిన యుత్త
మపురుషుండీతఁడే" యని చెప్పినప్పుడు విజయపాలుఁడా
శ్చర్య మినుమడించుచుండెను. ఈవల వీరలిట్లు రహస్యము
గా సంభాషించుచుండ సుమా రిరువదియైదు వత్సరముల ప్రా

యముగలపురుషుం డొకఁడు రాజునెదుట నిలిచి తా నీ య
యోధ్యాపట్టణవాస్తవ్యుఁడైన ధనపాలునితమ్ముఁడ ననియు,
తనపేరు కృపాసింధువనియుఁ జెప్పి బాల్యదశయందు తండ్రి
యొప్పగించినయాస్తి తన కిపుడు యుక్తవయస్సువచ్చినందు
న మఱల దానినంతయు తన కిప్పించవలసినదని కోరుచు తన
యొద్దనున్న కాగితముల వానికిఁ జూపెను. రాజు వానినిఁ
జక్కఁగాఁ బరిశీలించి వానివిజ్ఞాపనము యథార్థమని ఋజువుప
డియున్నందున వానియాస్తినంతయు వాని కొప్పగించుటకు
నుత్తరువిచ్చిపంపెను. కృపాసింధు వావలకుఁ జనినతోడనే సుద
ర్శనుఁడు కాశ్మీరదేశాధీశ్వరుం డగువీరసింహునితో మరల సం
భాషించుచు ప్రసంగవశంబున "మాతులా! సుగుణమంజ
రీజననకాలమున మనశ్యాములకుఁ గోడలు కలిగెనని మనమంద
ఱము సంతోషించితిమి. కాని భగవత్సంకల్పము నేఱువిధము
గా నుండుటచే మనకట్టియదృష్టము సంభవింపక పోయెను.
ఇప్పుడు విష్వక్సేనసార్వభౌముం డీమెను వివాహమాడఁగోరి
యున్నందున నీమెను వానికిచ్చి వివాహముచేయనిశ్చయించి
తిని. కాని యీమె దురదృష్టమెట్లున్నదో చూడుఁడు. ఆసేతు
హిమాచలపర్యంతముగల మహీమండలంబునంతయు పరిపాలిం
చుచున్న విష్వక్సేనసార్వభౌముని నిరాకరించి చిన్నతనమున
తనకు విద్యనేర్పిన బ్రాహ్మణచిన్నవానిని వరించి తనకు వివా
హము చేయవలసినదని పట్టుపట్టి కూర్చున్నది. చదువుకొన్న
బ్రాహ్మణుఁడని జేరఁదీసి యామెకు విద్యగఱపమంటిని. తుద



కాదుర్మార్గుఁడీమెకే విద్యనేర్పెను. ఇందుచేతనే వీనికినేను మరణ
దండన విధించితిని. కాని వానిని విడువవలసినదని మీరు సం
దేశమంపినందున మీ యాజ్ఞనతిక్రమింపనేరక వానినివిడిచి
పెట్టితిని. నాఁడు వీనిని తుదముట్టించినయెడల మాకీయనర్థంబు
వాటిల్లకుండును." అని విచారించుచుండ వీరసింహుండు
కొంతసేపు విచారించియేదియో చెప్పఁబోయెనుగాని యంతలో
విజయపాలుండు సుదర్శనుని సమీపించి "ఓ రాజచంద్రమా!
విష్వక్సేనసార్వభౌముండు మొదట సుగుణమంజరిని వివాహ
మాడ నెంచెనుగాని మరల నేమి కారణంబునో తలంపువిడిచి
మఱియొక సుందరాంగి నీమధ్యకాలంబున వివాహంబయ్యె.
నాకాతఁడు ప్రాణమిత్త్రుఁడగుటచే నేనా శుభకార్యమునకుఁ
బిలువఁబడితిని. కాన నేనావృత్తాంత మెఱుంగఁగంటిని. మీరింకి
ను వానియెడల యాశగలిగియుండుటచే నేనీవిషయమును దెలి
యఁజేసితిని." అని చెప్పినప్పుడు సుదర్శనుఁడు మఱింత విచారిం
పఁదొడఁగెను. అంతలో సేవకుఁడొకఁడు నిమ్మపండుతో నలంక
రింపఁబడిన త్రిశూలము నొకదానిని గొనితెచ్చి రాజేంద్రునెదు
టనునిచి "దీని నెవ్వరో తమ పడకగదియందు పడవైచిరి"
యని చెప్పినతోడనే సుదర్శనుఁడు దానిగాంచి తత్తరిల్లి "ఇది
యెట్లువచ్చెను. దీని గదియం దెవరుంచిరి" యని నిర్ఘాంత
పడి చూచుచుండెను. విజయపాలుఁడు దానిని గాంచినప్పుడు
నాఁడు కుండిననగరసత్రము నందు శయనమందిరమునందు తన
కుఁ గనిపించియున్న విశేషమే యిచట సంభవించుచున్నదని

యు ఋదియంతయు భైరవమతావలంబకుఁడైన ప్రతాపరుద్రు
ని దుర్నయమేయనియు నూహించుచుండెను. రాజబంధువు
లందఱు భీతిల్లుచుండిరి. సుదర్శనుఁడు దానిని వ్రేలాడఁగట్టఁబడి
న కాగితమును పుచ్చుకొని యిట్లు చదువుచుండెను. ‹‹ నీవు
భైరవద్రోహివి. నీప్రాణములు నీకు దక్కనేరవు›› అని చదివి
యులికిపడి మణిభద్రునిబిలిచి ‹‹ ఓయి! మన సైన్యమును సిద్ధ
పఱచియుంచుము. కోటను జాగ్రతగా కాపాడుము. ›› అని
యాజ్ఞాపించి విజయపాలుని వీక్షించి ‹‹ అన్నా! యీభైరవ
మత మెంతవఱకు విజృంభించినది? దీని కెన్నటికిని వినాశనము
న్నట్లు గనుపించదు.›› అని చెప్పి విచారించుచుండ విజయ
పాలుఁడు ‹‹రాజేంద్రా! నీవట్లు విచారింపకుము. నాఁటి యుద్ధ
మున నిన్ను రక్షించిన మేటిరౌ యీమతావలంబకుల గీటడం
చును. నీవు చింతింపక యూరకుండుము. వానిని నీకుఁజూపెద
నని జయచంద్రుని వ్రేలితోఁజూపెను. అపుడు సుదర్శనుఁడు
తెల్లఁబోయి వానినిఁ జూడసాగెను. వీరసింహుఁ డధిక వాత్స
ల్యంబున జయచంద్రుని జేరఁజీరి ‹‹ వత్సా! ఈభైరవమతము
ను రూపుమాపుటకు నీకన్న శక్తిపరుఁ డెవ్వఁడును లేఁడు.
తాను కష్టపడియైనను లోకము నుద్ధరింపఁజూచుట యుత్తమ
పురుషుల పరమధర్మము ›› అని నుడివినతోడనె జయచంద్రుఁ
డు ‹‹ అయ్యా తమరు పితృసమానులగుటచే మీయాజ్ఞ
సర్వవిధముల నాదరణీయంబు. మీయాజ్ఞ శిరసావహించి చేత
నైనంతవఱకు దుర్మార్గుల రూపుమాపఁ బ్రయత్నించెదను ››



అని పలికినప్పుడు వానిని మిగుల ప్రీతితో గారవించెను. సుదర్శ
నుఁడేదియో యోచించుచు నొక్కింత సేపూరకుండి వినయుఁ
డై జయచంద్రుని సమీపించి ‹‹ బ్రాహ్మణోత్తమా! నానేర
మును మన్నింపు›› మని వానికరంబు నిజహస్తంబున గీలించి
స్నేహభావంబుతో వానిని గారవించుచుండ సుగుణమంజరికి
పట్టరానిసంతోష ముదయించి తనమనోభావంబు చూపులతో
వానికి నివేదించుచుండెను. తరువాత సుదర్శనరాజు జయచం
ద్రునియొద్ద శలవుగైకొని యాస్థానంబు విడిచి బంధుమిత్రపరి
వారంబుతో లోపలికిఁ జనుదెంచెను. జయచంద్రుఁడును రాజ
భవనమును విడిచి నిజనివాసంబుఁ జేరెను.

——o——

## తొమ్మిదవ ప్రకరణము.

——o——

ఢిల్లీనగరము యమునానదీతీర పట్టణరాజంబులం దగ్ర
గణ్యంబై సకలసిరులం జెన్నారుచు మహావిభవంబున నాగ
లోకంబును బురడించుచుండెను. ఇది త్రివిక్రమసేన సార్వభౌ
మునికి నివాసంబగుటచే గజతురగవాహనవాహినీసమన్వితంబై
కలధౌతప్రభావిభాసితసౌధరాజవిరాజితంబై యనేకదివ్యమం
దిరారామాభిరామంబై సౌందర్యసౌభాగ్యంబునకు నిధానంబై
ప్రకాశించుచుండెను. ఇప్పురవరంబును బాలించుచున్న త్రివిక్ర

మసేనుండు నిర్వక్రపరాక్రమంబున నాసేతుహిమాచలపర్యంతం బుగల ధరణీమండలంబును జయించి రాజాధిరాజై సార్వభౌమ బిరుదాభిధానంబున భూతలదేవేంద్రుని బలె ప్రకాశించుచుండెను. ఈహిందూదేశంబునగల మగధ నేపాళాదిసర్వదేశంబులు సార్వభౌమునియేలుబడికి లోఁబడి సామాన్యరాజవరులచేఁ బరిపాలింపఁబడుచుండెను. ఈతఁడు సామ్రాజ్యధురంధరుండై మహోదర్పంబున విరాజిల్లుచుండ నాతనిభార్య సునందనాదేవి గర్భవతియై విష్వక్సేనచక్రవర్తిఁ గనెను. త్రివిక్రమసేనుని పినతండ్రి కుమారుఁడు ఆనందసేనుండు. త్రివిక్రమసేనుని మహావైభవంబుఁ జూచి యోర్వలేక వానియంకురంబును నశింపఁజేసి తానెట్లయిన నీసార్వభౌమపదవిని బొందవలెనని యెంచి దురాలోచనాపరుండై విరూపాక్షుఁ డనురాజవైద్యునికి విశేషవిత్తము లంచమిచ్చి యాపాడుపనికి నియోగించెను. ఆవైద్యుఁడును దురాశాపీడితుండై పాపంబునకొడిగట్టి ప్రసవించినప్పుడు సునందనాదేవిని విషప్రయోగంబున జంపెను. తరువాత మఱి రెండు సంవత్సరములకు శిశువునకుసయితము విషప్రయోగము జేయఁబడెను. కాని యాశిశువు పూర్ణాయుష్మంతుండగుటచే దాది యాకీలకము నెఱింగి వైద్యుఁడిచ్చిన యాపథంబును శిశువునకియ్యక సార్వభౌమునికిఁ జూపి తనసంశయమును నివేదించెను. సార్వభౌముండు దానిని పరిశోధించి నిజస్థితిని కనిపెట్టినతోడనే వైద్యుఁడగు విరూపాక్షునకు మరణదండనము విధించెను. ఈదుర్మార్గమునకంతకును కారణభూతుఁడైన



యానందసేనుఁడు వేఱొకశిక్ష యవసరము లేకయే కొంతకాలమునకు బాధచేఁ గృశించి తన పాపఫల మనుభవింప కృతాంతనిశాంతంబున కతిథియై చనుదెంచెను. తుదకు కొలఁదికాలములో వానిసంతానముసయితము నశించిపోయెను. శిశువు విష్వక్సేనుండు దినదినప్రవర్ధమానుండై శైశవబాల్యావస్థలంగడచి యిప్పటి కిరువదివత్సరముల ప్రాయముగలిగి చక్కఁగా వర్ధిల్లుచుండెను. త్రివిక్రమసేనుండు భార్యావియోగదుఃఖమును భరింపనేరక క్రమక్రమముగా కృశించి విష్వక్సేనునకు దశవర్షంబులు పరిపూర్తిగాకపూర్వమే రాజ్యసహితంబుగా కుమారుని, తనకు మిగుల విశ్వాసనీయుఁడయిన చంద్రహాసుఁ డను ప్రధానమంత్రికి నొప్పగించి లోకాంతరగతుండయ్యెను.

చంద్రహాసుండును తండ్రిలేనికొఱంత నాటిల్లకుండ విష్వక్సేనుని పుత్రభావంబుతోఁ బెంచి పెద్దవానిఁ జేసి సర్వవిద్యల నేర్పెను. త్రివిక్రమసేనుఁడు భార్యావియోగసంతాపంబునఁ గుందుచుండుటచే రాజ్యాంగతంత్రములయం దెంతమాత్రమును గలుగఁజేసికొనక యూరకున్నందున ప్రతాపరుద్రుండు పెచ్చుపెఱిగి సార్వభౌము నెంతమాత్రము లక్ష్యము సేయక తానొకస్వతంత్రరాజై కొంతదేశము నాక్రమించుకొని చక్రవర్తినిసయితము జయింపఁజూచుచుండెను. కాని చంద్రహాసుండు వానిప్రయత్నముల నెంతమాత్రము సాగనీయక దేశమును సర్వవిధముల కాపాడుచుండెను. విష్వక్సేనుఁడు ప్రతాపశౌర్యములయందును నితరయోగ్యతలయందును

దండ్రికన్న నధికుఁడై ప్రాయ మంకురించినదిమొదలు దేశ
సంరక్షణార్థము మిగుల పాటుపడుచుండెను. ఈతనికి యుక్త
వయస్సు సంప్రాప్తమయినందున సామ్రాజ్యపట్టాభిషేకమ
హోత్సవము జరుప నిర్ణయింపఁబడెను. ఆమహోత్సవదినంబు
రేపటిదినంబు. పట్టణంబంతయు మిగుల విచిత్రింబుగా నలంక
రింపఁబడెను. కదళీకాకాండంబులతోడను రసాలపల్లవతోరణం
బులతోడను కల్హారాదిప్రసవధామంబులతోడను చలువపంది
ళులతోడను వీధులెల్ల మహావైభవంబుతోఁ బ్రకాశించు
చుండెను. రాజనగరమంతయు ననేకశిల్పవిన్నాణంపుపనులతో
చిత్రింపఁబడి చూపరులకనిమిషత్వమును గలిగించుచుండెను.
సామంతరాజులందఱు కప్పంబులం గొని నిరీక్షించుచుండిరి.
పట్టణములోని దివ్యభవనములన్నియు నితరదేశాధీశ్వరులతో
నిండియుండెను. దేశదేశంబుల ప్రజానీకంబు యీమహోత్స
వంబుఁ జూడ నేతెంచియుండుటచే పట్టణమంతయుఁ గ్రిక్కిరిసి
యుండెను. కాని విష్వక్సేనునిజాడ యింతవఱకుఁ దెలియనం
దున చంద్రహాసుండు మిగుల పరితపించుచుండెను. రెండు
మాసములక్రిందట యీతఁడు డిల్లువిడిచి వెళ్లిపోయెను. సుగుణ
మంజరిని వివాహమాడ నభిలషించియుండుటచే నీతం డయో
ధ్యాపురంబున కరిగియుండునని చంద్రహాసుండు తలంచినను
నచ్చట యీతనిజాడ యొకించుకయుఁ గనిపించకుండుటచే నీతం
డేమయ్యెనో యని చంద్రహాసుండు విచారించుచుండెను. ఆతఁ
డిలువిడిచి చనునప్పుడు పట్టాభిషేకముహూర్తమునకునొకరోజు



ముందుగా వచ్చెదనని చంద్రహాసునితోఁ జెప్పెను. ఆచెప్పిన
గడువుదినముసయితము నిన్నటితో గతించినది. ఇంతవఱ
కాతఁడు రాకయుండుటచే కార్యభంగము వాటిల్లెనని నిశ్చ
యించుకొని విఫలమనోరథులై యూరకుండిరి.

ఈవృత్తాంత మిట్లుండ ఢిల్లీనగరమున మాఱుమూల
నొక్కపూరింట నివసించియున్న విజయపాలుఁడు తనభార్య
యైనయామినీపూర్ణతిలక నీక్షించి. “ప్రియసఖీ! విష్వక్సేనుని
పట్టాభిషేకమహోత్సవమును జూడ నరుదెంచినవారిలో మన
మొకరము. వారివలెనే మనమును వ్యర్థమనోరథులమై మరల
వలసియుంటిమి. కాని యీఢిల్లీనగరము భరతఖండములోని
పట్టణంబులన్నిటికన్నను మిగుల వన్నెకెక్కియుండుటచే దీని
లావణ్యవిభవంబు సందర్శింపఁదగియుండెను. మనమీపురంబు
జేరి నేటికి మూఁడుదినంబులైనను నిప్పట్టణశృంగారంబు నింత
వఱకుఁ బరికింపకయే పాడుగోడలనడుమ నీక్షుద్రకుటీరంబున
దాఁగియుంటిమి.’ ఇందలివిశేషంబులు మిగులరమ్యంబులై
నీకు సంతోషంబును గలిగింపఁగలిగియుండును.” అని చెప్పి
భార్యాసహితంబుగా బయలువెడలెను. అనుపమానరూపలావ
ణ్యంబుల శోభిల్లుచున్న యీమిథునంబు రాజమార్గం
బున నడుచుచున్నప్పుడు భూమిపై విలాసార్థ మవతరించిన
రతీమన్మథులని చూపరులు దలంచుచుండిరి. రాజమార్గముల
యందును విపణిదేశంబులయందును నధికనైపుణ్యంబున నిర్మిం
పఁబడిన చప్పరంబులును కట్టడంబులును యితరవిన్నాణంపు

శిల్పకళాకలాపనైపుణ్యంబును గాంచినప్పుడు యామిని మిగుల యద్భుతపడి "నాథా! నేఁడేల యీవీథులెల్ల నీలీల శృంగా రింపఁబడెను." అని యడిగెను. విజయపాలుఁడు, ఇదియంతయు విష్వక్సేనసార్వభౌముని పట్టాభిషేకమహోత్సవప్రయత్నము. ఇంకను నాతఁడు రాకయుండుటచే నీమహోత్సవమునకు భంగ మువాటిల్లెనని ప్రజలు విచారించుచుండిరి.

యామిని—ఆతఁ డెటకేగెను. ఊరువిడిచివెళ్ళుట కేమి కారణంబు?

విజయ—ఆతఁడు సుగుణమంజరిని వివాహమాడఁగోరి యయోధ్యాపురంబున కేగెనని ప్రజలు చెప్పుకొనుచుండిరి.

యామి—అది యెంతమాత్రము సత్యముగాదు. నా ప్రియసఖి మాగురువర్యునందన యన్యు నెన్నఁడు వివాహ మాడనేరదు.

విజయ—మొదట యాతఁడు సుగుణమంజరిని వివాహ మాడఁదలఁచెనుగాని యామె యన్యునివరింపఁ దలంచియుండుట నెఱింగినతోడనే యాప్రయత్నమును విడిచి యామెతో సమాన రూపసౌందర్యములు గలమఱియొకసుందరాంగినివిధ్యుక్తంబున నీమధ్యకాలమున వివాహంబయ్యె.

యామిని—అందుచే నాతఁడు మిగుల బుద్ధిమంతుఁడని భావించెదను. తనపై యిష్టములేనికాంతను బాధింపకుండుట చేత నాతని యోగ్యత మిగుల ప్రస్తుతింపఁదగియున్నది.

వీరిట్లుసంభాషించుచు చక్రవర్తి దివ్యభవనమును సమీ



పించిరి. వీరాభవనమును బ్రవేశించునప్పుడు కావలివారలు మొదట వీరి నడ్డుపెట్టిరి. కాని వారు విజయపాలుని కంఠస్వర మువినినతోడనే భీతచిత్తులయి కరయుగళంబులుమోడ్చి భయ గౌరవంబులతో దూరంబున నిలుచుండిరి. ఆభటులవ్యాపార ములఁ గాంచినప్పుడు యామిని యాశ్చర్యపడఁజొచ్చెను. అప్పు డాసంగతిని గ్రహించి విజయపాలుఁడు "కామినీ! నేను విష్వ క్సేనచక్రవర్తి సమానవయస్కులమౌటచే మేమిరువురము పసి తనమునుండియు నేకగ్రీవమున మైత్రితో మెలఁగుచుంటిమి. నేను కడుపేదనైనను నాపేదరికమును పాటింపక నన్ను మిగుల ప్రీతితో గౌరవించుచుండెను. యజమానుఁడు చేయుచున్న యాదరమునుబట్టియె సేవకులిట్లు మన్నించి గౌరవించుటకు కారణము" అని చెప్పుచు నందలి ప్రాకారగోపురప్రాసాదాది విశేషంబులఁ జూపుచు నొక్కసుందరమందిరమునకు నామెను గొనిపోయి యందలివిషయంబుల నామెకుఁ జూపుచుండెను. ఇందలిపదార్థములన్నియు మిగుల విలువఁగలిగి యతిరమ్య ముగాఁ గనిపించుచుండెను. సుదర్శనునిమందిరంబునందు తాను మున్నుజూచినవస్తువులేవియు జిగితరమునందు విలువయందును సౌందర్యమునందును సహస్రాంశమైనను నిందలిపదార్థములలో దేనినిబోలనేరవు; ద్వారములయందు కట్టఁబడిన హురుమంజి ముత్యాలజాలరులును చంద్రకాంతమాణిక్యనిర్మితంబులైన దివ్వెకంబములును కుడ్యభాగములయందు వ్రేలఁగట్టఁబడిననిలువు టద్దములును సువర్ణరజతదంతంబులతో వేయఁబడినయాసన

వితానంబును పేటికానికరంబులయందు భద్రపఱుపఁబడిన నవరత్నస్థగితభూషణంబులును గాంచినప్పుడామె కనిమిషత్వంబు సిద్ధించెను. ఆభవనముయొక్క యడుగుభాగమంతయు చిత్రచిత్రితములైనరత్నకంబళములతో నలంకరింపఁబడెను. అందలి వేదికలయందుంచఁబడినకృత్రిమవృక్షంబులు బహుసుందరములై కనిపించుచుండెను. ఆవృక్షములయం దమర్పఁబడిన ఇంద్రనీలమాణిక్యంబులతోఁ జేయఁబడినపత్రంబులును కాంచనమయమంచితపుష్పగుచ్ఛంబులును వజ్రవైడూర్యమరకతమాణిక్యనిర్మితంబులైనఫలకదంబంబులును కన్నులుమిరుమిట్లుఁగొన ప్రకాశించుచుండెను. ఈపదార్థములన్నియు తన కాశ్చర్యకరంబులై కనిపించుచున్నను విజయపాలునిదృష్టికి సామాన్యములైయుండుటను గ్రహించి యామిని "ప్రాణనాయకా! ఇవి యన్నియు నాకు విచిత్రంబులయ్యును మీకివి సామాన్యగణ్యంబులై తోఁచుచుండుటచే నేనాశ్చర్యపడుచుంటిని" అని నుడివినప్పుడు విజయపాలుఁడు "కోమలీ! వీని నిదివఱ కొకటి రెండుమాఱులు చూచియుండుటచే నిపుడివి యంతయాశ్చర్యమును గలిగింపనేరకుండెను. ప్రేయసీ! నీవు చూడఁదగినవిశేషం బింకొకటి కలదు. దానిఁ జూచితివేని నీవింతకన్నను నధికాశ్చర్యము నొందఁగలవు.

యామిని—అది యేది ?

విజయ—మీసుగుణమంజరిచే నిరాకరింపఁబడిన విష్వక్సేనచక్రవర్తియొక్క విగ్రహము.



యామిని—నాథా! నాచెలికత్తెను వివాహమాడఁ గోరినపురుషవరుఁ డెంతసౌందర్యవంతుఁడో చూడనభిలషించుచుంటిని. దయయుంచి వానివిగ్రహమును నాకుఁ జూపుఁడు.

విజయ—ఆసౌందర్యవిగ్రహమును గాంచినప్పుడు నాయెడల నీకుఁ దిరస్కారభావముగలుగునేమోయని భయపడుచుంటిని.

యామిని—మీరు నన్నిట్లుపరిహసించుట ధర్మమా!"

అనవుడు విజయపాలుఁడు నవ్వి "కోమలీ! నీకు దానిని జూపెదను రమ్ము" అని కేలుపట్టుకొని యామెను గొనిపోయి చెంతనున్న గదితలుపు తెఱచి యావిగ్రహము నామెకుఁ జూపెను. దానిఁ జూచినతోడనే యామిని "ప్రాణేశ్వరా! విజయపాలా!" అని నిశ్చేష్టితురాలై కొంతసేపటికి తెలివి నొంది "ప్రాణేశ్వరా! మీరూపమే యీవిగ్రహమునందు సరిగా కనిపించుచున్నది ఇది మీరూపమే. ఇది మీవిగ్రహమే. నాకు భయమగుచున్నది. నా దేహము కంపమెత్తుచున్నది. దీని యర్థమేమి ? మీనిజస్థితిని నాకెఱింగింపవలయు"నని తత్తరపడుచుండ విజయపాలుఁడామెను జూచి "శోధించి కనిపెట్టఁదగినకాలము గతించినది. గౌరవింపఁదగినకాలము సమీపించినది. కావున నిజస్థితినంతయు నీకునెఱింగించెదను. ఈవిజయపాలుఁడే విష్వక్సేనసార్వభౌముండు. నీవిఁక పేదరాలవని భావింపకుము. ఈధరామండలంబును బరిపాలించెడివిష్వక్సేన సార్వభౌముని పట్టపురాణివి. ఈకిరీటాంగదాదిభూషణం

ములనలంకరింపుము. ఇందలిరత్నంబులేవియు నీగుణరత్నంబులతో నుపమింపనేరవని నేనెఱుంగుదును." అని నుడువుచుండ చంద్రహాసుం డరుదెంచెను. దానిని గాంచినతోడనే విష్వక్సేనుం డతిగౌరవంబున ప్రత్యుత్థానంబుజేసి యుచితాసనంబునం గూర్చుండ నియోగించెను. అప్పుడు చంద్రహాసుఁడు దేవరరాక తెలియకుండుటచే యింతదనుక తమ్ము దర్శింపనేరకపోతిమి. ఊరువిడిచినప్పుడు తిరిగివచ్చుటకు దేవరయుంచినగడువు దినము నిన్ననే గతించినది. ఇంతవఱకు భృత్యామాత్యపరివారబృందంబంతయు మీరాకనిరీక్షించి వేచియున్నది. కాని దానిని కనిపెట్టుట నెవరికిని సాధ్యపడనందున నేను మిగుల విచారించుచుంటిని. దేవర భూభారంబువహింపవలసినదినం బెల్లియే. దేవరజాడ యింతవఱకుఁ దెలియకుండుటచే కార్యభంగమ వాటిల్లునని నిరుత్సాహులై ప్రజలు విచారపడుచుండిరి" అని వక్కాణించి విష్వక్సేనుఁడు "అమాత్యచంద్రమా! నేనీయూరుఁ జేరి మూఁడురోజులయినది. ఒరులెవ్వరు నన్ను గుర్తింపకుండుటకై నేను ప్రచ్ఛన్నవృత్తితో మారుమూల నీపురంబునం దొదిగియుంటిని. మీహృదయమున కీమారాటమును గలిగించి నిరుత్సాహపఱచినందున నేను లజ్జించుచుంటిని. ప్రజలిట్లు నాశ్రేయస్సును గోరియుండుట దయానీయమైన మీయాదరణంబుగాక వేఱొకటేమున్నది? మీరు పితృసమానులగుటచే నన్ను మన్నింపవేఁడుచుంటిని." అని మగధరాజుదౌర్జన్యంబునను, జయచంద్రుఁడు తన్ను రక్షించుటయు



ను, యామినీపూర్ణతిలకను తాను వివాహమాడుటకుఁదగిన కారణంబును సర్వంబును నివేదింపుచుండ దౌవారికుండరుదెంచి "రాజాధిరాజా! రాజపరమేశ్వరా!" యనుబిరుదాంకములు చదివి "సామంతరాజబృందంబును పౌరానీకంబును దేవరదర్శింప సభాస్థలిని వేచియుండిరి." అని నుడివినతోడనే విష్వక్సేనుండు నిజామాత్యసహితంబుగా సభాస్థల మలంకరించెను. సభాసీనులైన రాజలోకమంతయు విష్వక్సేనుని దర్శించి గౌరవించి లోకవృత్తాంతముల ముచ్చటింపసాగిరి. అంతలో ప్రొద్దుగ్రుంకినందున వారు సెలవుగైకొని తమతమవిడిదెలకుం జనిరి. ఆమరునాఁడు మహావైభవంబుతో పట్టాభిషేకమహోత్సవము జరుపఁబడెను. ఆమహోత్సవకాలంబున సార్వభౌముండు తనకు జయచంద్రుని ప్రతినిధిగా నేర్పఱచికొని హారత్య్రజాలంబును సర్వసనంబులును దాసీదాసగణంబును సర్వాసైకారంబును గజతురగవాహినీసమూహంబును నొసంగి తనతోసమానునిగా నొనర్చి యయోధ్యాపురంబునందు నియోగించెను. జయచంద్రుఁడును సార్వభౌమునియెడల మిగుల కృతజ్ఞుఁడై దక్షిణబాహుదండమువలె వానికి సర్వవిధముల తోడ్పడి లోకక్షేమముకొఱకు సర్వవిధముల పాటుపడుచుండెను.



## పదియవ ప్రకరణము.

---

భరతఖండమున పెక్కుతావులయందు భైరవమతము వ్యాపించి జనులకు జెప్పరానియనర్థమును గలిగించుచుండెను. ప్రతాపరుద్రుఁడు తనదౌర్జన్యముచే సుదర్శనుని బాధింపఁ జూచుటయేగాక సార్వభౌమునిసయితము జయింపఁబ్రయత్నించుచుండెను. వంగదేశమును పరిపాలించుచున్న యుసేనరాజు లోకమును నాకుల పెట్టుటయేగాక సార్వభౌమునిసయితము తిరస్కరించుచుండెను. భైరవమతస్థులు దేశమునందచ్చటచ్చట ప్రబలి సాధుజనుల వేధించుచుండెను. దేశముయొక్కదుస్థితి యనిర్వచనీయమై యుండెను. పాపభీతి యించుకయుఁ గనిపించదు. దేశమునందు దారుణకృత్యములు ప్రబలుచుండెను. సాధువులకును నిరపరాధులకును దినదినగండముగా నుండెను. దేశమంతయు తల్లడిల్లుచుండెను. సుదర్శనుఁడు ప్రతాపరుద్రుని పైకి లక్ష్యము చేయకపోయినను లోపల ప్రక్కబెదురుగలిగి మెలఁగుచుండెను. సార్వభౌముఁడు లోకక్షేమమునకుఁ బాటుపడుచున్నను నాతఁడింతవఱకు దేశమునకు నెమ్మదిని గలిగింపలేకపోయెను. ఎవరెన్నిప్రయత్నములుచేసినను భైరవమతమునకింతవఱకు కించుకయు వినాశనములేక నిరంకుశముగా లోకమున వ్యాపించుచుండెను. కాని భైరవమతమును కొంతవఱకణఁగఁద్రొక్కి ప్రతాపరుద్రుని భంగపఱిచిన దొక్క జయచంద్రుఁడే. విష్వక్సేనసార్వభౌముని పట్టాభిషేకమహోత్సవసమయమున నీతఁడు రెండవసార్వభౌమునిగా నొనర్పఁబడినదిమొదలు ప్రతాపరుద్రుఁడు మొదలుగాగల భైరవమతస్థులందఱు గుండెబెదరుగలిగి పైకి నిలచూపనేరక నణగియుండి లోలోపల కుతంత్రములఁ బన్నుచుండిరి. రాజ్యభారమును వీనిమీఁద నునిచినదిమొదలు విష్వక్సేనచక్రవర్తికి చిత్తశాంతిగలిగి మెలఁగుచుండెను. సుదర్శనుఁడు ప్రతాపరుద్రుని వలన భయముమాని హాయిగా నిద్రించుచుండెను.

జయచంద్రుఁడిపుడు మహోన్నతపదవి నొందియున్నను రాజ్యభోగముల నెంతమాత్రము నపేక్షింపక స్వార్థపరిత్యాగియై దేశము నుద్ధరించుటయందును, తనయజమానుఁడైన విష్వక్సేనసార్వభౌముని ప్రతాపకీర్తులను దిగంతరాళములస్థిరముగా నెలకొల్పుటయందును తనశక్తి నంతయు ధారపోయుచుండెను.

జయచంద్రుఁడు సార్వభౌమునకుఁ బ్రతినిధిగా నేర్పఱుపఁబడిన కొన్నిరోజులకు నయోధ్యాపట్టణరాజమార్గమునం దిరువదివత్సరముల ప్రాయము గలపేదమానవుఁడొకఁడు శిథిలవస్త్రములం దాల్చి విచారగ్రస్తుఁడై చనుదెంచుచుండెను. ఆతఁడు ధరించియున్న వస్త్రములును మిగుల కృశించియున్న నాతనిశరీరంబును బరిశీలింప నాతండు కూటిపేదమాత్రమేగాక వ్యాధిగ్రస్తుఁడైనట్టునయితము గనిపించుచుండెను. ఆహారలోపముచేఁ గృశించియున్నందున నెమ్మొగము కొంతచిన్నతఱిగియున్నను విశాలములయిన వానినేత్రయుగళం బాతం

పందగాఁడని దెలియఁజేయుచుండెను. ఇది శీతకాలమగుటచేతను సూర్యాస్తమయసమయంబు సమీపించుచుండుటచేతను చలిబాధ మిక్కుటముగానున్నందున చినిఁగియున్నప్రాతవస్త్రమును పైఁగప్పుకొని విచారించుచు నడుచుచుండెను. "నేనీదినమున పదునైదుమైళ్లదూరము నడిచితిని. నేనచ్చటచ్చటఁ ద్రాగియున్నవి సెలయేటినీరుదక్క వేఱాహారమేదియును లేదు. ఇంతకష్టమనుభవించుచున్నను నాధైర్యము నన్నువిడిచిపోవుచున్నది. నేనీయయోధ్యాపురంబుఁ జేరఁగలిగినపిదప యన్నవస్త్రములుగలిగి సుఖింతునన్నయాశ నాహృదయమున పాదుకొనుచున్నది. నాచెల్లెలు భువనమోహిని నన్నుఁ గొంతకాలమైన నాదరింపకపోవునా! నేసంపాదించిన ధనమంతయు వ్యాధిమూలమున వ్యయమపడియున్నందున నాకొరులసహాయమపేక్షింపవలసి వచ్చినది. అయ్యో! నాకెంతగతిపట్టినది! నేనన్యుల నపేక్షింపవలసియుంటినిగదా. నాతల్లి పాడువృత్తిచే విశేషవిత్తము గడించినను యంత్యదశ నామెకుఁ దిన నన్నమైన లేకపోయెను. పాడువృత్తులచే జీవించెడివారలబ్రతుకెప్పుడును నిట్టిదియేగదా. అయ్యో! ఆకలి నన్ను దహించుచున్నది. నాచెల్లెలియిల్లుఁ జేరినతోడనే కడుపార భుజించెదను. మాతల్లి చనిపోయినతోడనే యయోధ్యారాణిగారామెను పెంచి పెద్దదానిని జేసెను. మాపూర్వులవలెగాక భువనమోహిని పూజ్యమైనసంసారవృత్తితో జీవించుచుండునని భావించెదను. ఆమెనివాసమును నేనెట్లుతెలిసికొనఁగలను? సందుగొందు లెన్నిదాటినను దానిల్లు నాకింకను గనిపించుటలేదు.



ఎంతలో చీఁకటిపడినది? నాకడుపాకలిచే మండుచున్నది. తెల్లవారినది మొదలు శుష్కోపవాసముతోఁ బ్రయాణముచేయుచుండుటచేఁ గాళ్ళుపడిపోవుచున్నవి. తల్లీ! లోకులవంచించి నీవంతధనముగడించినను, తినుట కన్నమైన లేక నీపిల్లలెట్లు బాధపడుచుండిరో చూడుము. నేను కప్పుకొనియున్న చింకిగుడ్డకుఁ జలియాగక నన్నుగజగజవడఁకించుచున్నది. భువనమోహినీ! మనతల్లివలెఁగాక గౌరవనీయమైనసంసారవృత్తితో జీవించుచు నన్నవస్త్రములు గలిగి నేకొఱంతయులేక మహారాణియనుగ్రహముఁ జల్లగా వర్ధిల్లుచుంటివో, వారిని విడిచి వేఱొకయింట కాపురముచేయుచుంటివో నేనూహింపలేకుంటిని" యని తనకుఁ దాను జెప్పుకొనుచు మిగులచీఁకటిపడినందున త్వరితగతితో నేతెంచుచు మధ్యమధ్యమార్గమున నెదురుపడినవారిని దాను బోఁదలఁచినతావు నడుగుచు పెక్కువీధులను గంతలను దాఁటి తుద కొక్కపెంకుటింటియొద్ద కేతెంచెను. ఆయింటియొక్కవీథితలుపు మూయఁబడియుండెను. గవాక్షమూలమున లోపలనున్నవారు వెలుపలకుఁ గాన్పించుట లేదుగాని, లోపలమాటలాడుచున్నవారిమాటలు కొన్ని వీధినడచువారిచెవులకు వినిపించుచుండెను. ఆగదిలో నెవ్వరో మువ్వగోపాలపదములనుకూనిదీర్ఘముతోఁ బాడుచు మధ్యమధ్య హద్దుదప్పిన మోటుమాటలతో సంభాషించుచుండిరి. తనకుఁ జెప్పఁబడినగుఱుతులనుబట్టి యది భువనమోహినినివాసంబని యాతఁడు మొదట భావించెనుగాని యాయింటివాలకమునుబట్టియు

నందునంభాషింపఁబడుచున్న సంగతులనుబట్టియు నది యొకగుడిసెవేశ్యటుకొంప యనియెంచి వెనుకకుఁ బోవుచుండెను. అంతలో పక్కయింటికెలుపు తెఱచుకొని మనుష్యుఁడొకఁడు వెలుపలకు వచ్చెను. అప్పుడా వేదమార్గస్థుఁడు వానిని గాంచి 'భువనమోహినియిల్లేది?' యని యడిగెను. "అదే భువనమోహినియిల్లు" అని యామనుష్యుఁడు బదులు చెప్పెను. అప్పుడా మనుష్యుఁడా పక్కయరుగుమీఁద కూర్చుండి యేదియో యోచించుచు "ఇంతమాత్రముచే సంశయింపరాదు" అని చివాలున లేచి నాలుగడుగులు ముందుకు నడిచి మఱల నేదియో తలంపునకు వచ్చినందున వెనుకకు మరలి యామరుగుమీఁదనే గూర్చుండి యిట్లు విచారింపసాగెను. "నే నీమెను జూచి దీర్ఘకాలమైనది. ఈమధ్య యొకటిరెండుమారు లీమెను జూచియుండుటచే నీమె నన్ను గుర్తింపఁగలిగియుండవచ్చును. కాని యీచింపిరిగుడ్డలును ఛడలుగట్టినయీశిరోజములును నాకు క్రొత్తరూపమును గలిగించుచుండుటచే యామె నన్నిపు డానవాలుపట్టఁగలుగునా? ఆకలి నన్ను మిగుల బాధించుచున్నది. ఏమైననుసరే త్వరగా నేను లోపలకుఁ బోయి పట్టెడన్నమడిగి తినువఱకు నాప్రాణములు నిలువవు" అని లేచి మరల గదికవాటమును సమీపించి నిలుచుండెను. ఆకిటికితలుపింకను దెఱువఁబడియుండెను. పూర్వమువలె యందు కూనిదీర్ఘములేవియు వినిపించుట లేదుగాని యందు సంభాషించుచున్న స్త్రీపురుషులసంభాషణము పైకి స్పష్టముగా వినిపించుచుండెను. ఈతెఱవరి పొంచి దానిని జాగ్రత్తతో వినుచుండెను.

స్త్రీ—మీవంటిరసికాగ్రగణ్యుల చేఁబట్టుటచే నేను మిగుల యదృష్టవంతురాలను.

సుగుణమంజరి నన్ను సర్వవిధముల నాదరించుచున్నను నాకచట స్వేచ్ఛలేనందున నేనామెను విడిచి యీవలకు వచ్చితిని. మీవంటివారిని జూచుటకును సంభాషించుటకును నచట వలనుపడదు. పైగా యామె నన్ను దగినవరునకిచ్చి వివాహముజేయఁజూచుచుండెను. అది నాకెంతమాత్రమిష్టములేనందున నేనామెను విడువవలసినచ్చెను.

పురుషు—నీశరీరమున మెఱయుచున్న యీయమూల్యాలంకారములును నీవుధరించిన జల్తారుయుపరంజివలువయు నీ వెట్లుసంపాదించితివి.

స్త్రీ—ఇవియన్నియు నాకు సుగుణమంజరిచే దయచేయఁబడినవి. పనికత్తెనని చులకనగాఁజూడక తల్లివలె మిగుల ప్రీతితో ప్రేమించుచుండెను. సుకుమారమైన నాశరీరము కందిపోవునని నాకెన్నఁడును బరువుపని చెప్పియెఱుఁగదు. అయినను నాయిచ్చవచ్చినట్లు తిరుగ వీలులేనప్పుడు నాకవియేమి లాభము?

పురుషు—సంపదలెన్నియున్నను సుఖములేనప్పుడవి యేమిప్రయోజనము. నీబుద్ధివిశేషమునకు నేను చాలా సంతోషించితిని. నీవామెనువిడిచి వచ్చినందుకు లోపమెంతమా

తప్పుముండ నేరదు. సర్వవిధముల నిన్నంతకన్న నెక్కువసంతోష పెట్టెదను. నీకు నేపంపిన మద్యమేది? యిదిమిగులఘాటుగా నున్నది. దీనిని నీవును గొంతచవిజూడుము.

వీరి సంభాషణవిషయములను విని యప్పుడా తెఱవరి మిగులలజ్జించి "అన్నా! ఇాటనున్న యీపాడువిద్య నీకును పట్టువడినదా! నీవుల కెట్టిసత్కారంబుఁజేసినను నది గణుతి కెక్కనేరదు. శునకము నందలమునను౦చి పూజించినంతమాత్రముచే దానికి సత్తమబుద్ధు లెట్లబ్బును. వివాహము నీకుఁగిట్టకుండెనా? పేడతినమఱిఁగిన పురుగునకు బెల్లమెట్లురుచించును? నిర్భాగ్యులబాగుచేయు వారెవ్వరును లేరు" అని యోచించుచుండ వానికిపట్టరానికోపముగలిగి "ఓసిదుర్మతీ! రంకుసాగిన పెండ్లిగిట్టదనుచుడి నీయెడ యసత్యమైనది." అని ద్వారముసమీపించుచుండెను. అంతలోఁ దలుపుతెఱచుకొని లోపలనున్న మనుష్యుఁడు వెలుపలకువచ్చుచుండెను. వానిఁజూచినతోడనే యీబాటసారికి రౌద్రమతిశయించి శక్తిబలముగలిగినందున నంతవఱకుబాధించుచున్న యాఁకలియు నీరసమునుబోయి కన్నులింతఁజేసికొనివానిపైగవిసి "నీవా! యీమెకుదుర్బుద్ధులు కఱపుచున్నది" యని వానిజుట్టుబట్టుకొని వంగఁదీసి వాని వీఁపుమీఁద మణుగుగుద్దులను వేనవేలుగాఁ గురిపించుచుండెను. అప్పుడావిటపురుషుఁడును తనశక్తికొలఁదివఱకుఁ జూపఁబోయెనుగాని సురాపానమువలన మత్తుగొనియుండుటచే శరీరమువశముగాక తాడిపండ్లవలె గుభేలుగుభేలుమని చరుపులు



ను గుద్దులును వీఁపుమీఁదపడుచున్నను లక్ష్యముచేయక వాని మీఁదపడెను. అంతనా తెఱవరి వానినిక్రిందకుదొర్లించి వెలికిలవైచి ఱొమ్ముపైనెక్కికూర్చుండెను. ఈగందరగోళమునంతయు నాలకించి భువనమోహిని లోపలనుండి పరుగెత్తుకొని వచ్చి తనవిటునిపైఁగూర్చున్న తెఱవరినీక్షించెను. వానినిదివఱకొకటిరెండుమారులు చూచియున్నందున నావెన్నెలకాంతియందు వానియాకృతినిఁగని పెట్టి వానిని తనయన్నయని తెలిసికొనెను. తానుజేసిన యవమానమును సహింపనేరక దురాగ్రహగ్రస్తుఁడై తనవిటునిఁజంపఁబోవుచుండెనని యెంచి వానిని మందలింపఁబోయెనుగాని సమీపించినయెడల తన్ను సహితముప్రాణములతో విడువఁడనియెంచి కొంతసేపూరకుండెనుగాని యామె మనసుపట్టఁజాలక తుదకువానినిసమీపించి "అన్నా! శూరసేనా! నానేరమును మన్నించి వానిని విడిచిపెట్టుము" అని దీనత్వముతో వానినివేఁడుకొనఁజొచ్చెను. తనప్రార్థనవాఁడు చెవిఁబెట్టనందున భువనమోహిని దనవిటుని పైనుండి లాగఁబ్రయత్నించెను. అప్పుడైనను వాఁడు వానిని విడిచిపెట్టక చెల్లెలినావలకువిదల్చి "ఓసిభ్రష్టురాల! క్షణకాలమోపికపట్టుము. నీకునుబుద్ధిచెప్పెదను" అని యాపల్లవుయుల్లమెఱియనీక్షించి "ఓరీ! నీవీమెనువివాహమాడి భార్యగానంగీకరించి నీయాస్తికీమెనుకర్తగాఁ జేసితివేని నిన్నుప్రాణములతో విడిచిపెట్టెదను. లేకున్న నీమెను నిన్నును గలిపి పరలోకమునకుఁబంపెదను" అని చెప్పఁగా నావిటపురుషుఁడు

'వల్లె' యన్ని తనయంగీకారమును హీనస్వరముతోఁ దెలియఁ
జేసెను. వాఁడిందుల కంగీకరించుటకు కారణము కేవలము
వానిదుర్బలత్వమే గాదు. ఎవ్వరైన తన్నుఁ జూచి పరిహసింతురను
నుభయముసయితము వానినిందులకు నొడఁబఱుచుచున్నది.
ఆహా! జారులబ్రతుకెంతశోచనీయమైనది. మానధనంబులుఁ
గోలుపోవుటయే గాక ప్రాణహానిసయితము వీరలకు సంభవించు
చుండును. కీర్తిగౌరవములఁ బాడుచేసి పెక్కుగతులహింసింపఁ
గలిగినది యీవ్యభిచారదోషముగాక యింకవేఱొకటేమున్న
ది? అప్పుడాతెఱవరి వానినిలోనికిఁగొనిపోయి చెల్లెలిచే వ్రా
తపరికరములను దెప్పించి వానిచేనిట్లు చెప్పి వ్రాయించుచుండె
ను. "ఈభువనమోహిని నీశ్వరసాక్షిగా వివాహముచేసి
కొంటిని. యీమె యె నాధర్మపత్ని. ఈమెయు, నావలన నీమె
కుఁగలిగినసంతానమును నాకు వారసులు. నాయాస్తికంతకును
వీరలే కర్తలు" అని వానిచే వ్రాయించి మరలచదివించివినిన
తోడనే దానిపై వ్రాలుచేయుమనికోరెను. అప్పుడాతఁడు
"కృపాసింధువు వ్రాలు" అని వ్రాలుచేసెను. అప్పుడు శూర
సేనుఁడు దానినందుకొని మరలచదివి తాను సాక్షి వ్రాలుచేసి
చెల్లెలిచేతికిచ్చి, "ఓసిదుష్టవనితా! నిన్ను పూజ్యురాలనుగాఁ
జేయ సుగుణమంజరి ప్రయత్నించినను నదినీకు విషప్రాయమై
తోఁచినది. పురాకృతకర్మదోషమెవరు తప్పింపఁగలరు? నీము
ఖమెన్నఁడును చూడఁజాలను. ఎన్నడును నీపడుపుకూడు ముట్ట
నోపను" అనిచెప్పి శూరసేనుఁడు వెళ్ళిపోయెను. భువనమో
హినియు కృపాసింధువును లోనజేరి తలుపువేసికొనిరి.

## పదునొకండవప్రకరణము.

—o—

ఆనాఁడు సుదర్శనునిమందిరమున గొప్పమహోత్సవము
జరిగినప్పుడు కృపాసింధువు కాశికాపురంబున నుండి మరలివచ్చి
తండ్రి తాను చనిపోవునప్పుడు రాజునకు వశపఱచినయావదా
స్తిని మఱల యొప్పగించుకొన్నట్లు మనమెఱిఁగియుంటిమి.
కాశికాపురంబునుండి వచ్చినపిదప నీతనియాకృతియందించుక
భేదము గనిపించుచున్నను గుణములుమాత్రము పూర్తిగా
మాఱినవి. చంద్రబింబమువంటి వీనిముఖము కొంతవఱకు నల్ల
వడి పూర్వమంత మనోహరముగాఁ గనిపించుట లేదు. వీనిముఖ
వివర్ణమునకు దేశాటనమే కారణమని వీని నెఱిఁగినవారు
భావించుచుండిరి. దేశాటనముచేసినది కొద్దికాలమైనను నింత
స్వల్పకాలములో నీతనిస్వభావము పూర్తిగా మాఱిపోయినం
దున వీనిపరిచయులు మిగుల నాశ్చర్యపడుచుండిరి. విదేశ
యాత్రకుఁ జనక పూర్వము దయాస్వభావముమాత్రమే గాక
వితరణముచేతను శమదమాదిగుణసంపదచేతను నీతఁడుత్తమ
పురుషులలో నగ్రగణ్యుఁడని పేరుపొందెను. ఈతఁడు దేశాట
నముమాని మఱల యిల్లుచేరినప్పుడాయుత్తమగుణములన్ని
యు నశించి వానిస్థానమున సర్వదుర్గుణము లుద్భవించెను.
పూర్వమువలె నీతఁడు తనధనమును లోకోపకారకార్యముల
యం దెంతమాత్రము వ్యయపెట్టక జారద్యూతసురాపానాది

దుర్వృత్తులయందుమాత్రమే వినియోగించుచుండెను. ఈతఁడు గౌరవనీయునివలె పైకిఁ గనిపించుచున్నను నాతనియందు గనిపించుచున్న మేహ్యగుణములు వానిహృదయముయొక్క నీచభావమును వెల్లడించుచుండెను. మాన్యులును యోగ్యులును మునుపటివలె వీనినాశ్రయించుటలేదు. జారులును, త్రాగుఁబోతులును జూదరులును మొదలుగాఁగల నీచబృందముమాత్రమే వీనిని పరివేష్టించుచున్నది. ఈతనిమేనమామ శివశంకరపాండ్యో యీమధ్యకాలమున జనిపోయెనుగాని బ్రతికియుండిన మిగుల విచారించియుండును. ఈతఁడు కాశినుండి వచ్చినతోడనే యితరసద్గుణములవలెనే గురుభక్తిసయితము నశించి జయచంద్రునియెడల ద్వేషబుద్ధిని గలిగియుండెను. ఈతఁడు మరల వచ్చినతోడనే వీనినిఁ జూడఁగోరి జయచంద్రుఁ డనేకవర్తమానములఁ బంపెను. ఆతఁ డేమికారణముననో యింతవఱకు జయచంద్రునకుఁ గనఁబడియుండలేదు. ఇందుచే జయచంద్రునకు వీనియెడల నొకవిధమైన యనుమానము గలిగి జాగరూకతతో వీనివ్యాపారములఁ గనిపెట్టి చూచుచుండెను. ఈతఁడు దేశాటనమునుండి మరలవచ్చిన కొలఁదిరోజులలో భువనమోహినితో సంబంధమును గలిగియుండెను. ఈతఁడు భువనమోహినియింటినుండి బయటకు వచ్చుచుండ నామెయన్న శూరసేనునిచే చావఁగొట్టఁబడి యామెను భార్యగా నంగీకరించినదిమొదలామెను బహిరంగముగా తనయింటనుంచుకొని తన భార్యయని చెప్పుచుండెను. ఈయపూర్వదంపతుల కొంటా



ఱులయెడలఁ గలప్రేమస్వభావమును గనిపెట్టినవారెవ్వరు వీరల భార్యాభర్తలని గ్రహింపలేకపోవుచుండిరి. భార్యాభర్తలయందుండవలసిన యైకమత్యంబును ననురాగంబును వీరలహృదయములయందు శూన్యమైయున్నను దుష్కృత్యములయందుమాత్రము వీర లొకరికొకరు తోడ్పడుచుండిరి. ఒకనాఁడు కృపాసింధువు భువనమోహినిఁ గాంచి “ఓమోహనాంగీ! ఈమధ్య నీవెప్పుడైనను సుగుణమంజరిని దర్శించితివా” యనియడిగెను. “నేనామెయిల్లువిడిచినను తఱుచుగ నామెనుదర్శించుచుందును. అప్పుడప్పుడామె నాచే జయచంద్రునకు సందేశములఁ బంపుచుండును” అని బదులుచెప్పెను. “అట్లయిన నీకొకరహస్యము నెఱిఁగించెదను. దానిని నీవు బయలుపఱచెదవనిమాత్రము సంశయించుచుంటిని.”

భువ:—మీరట్లు సంశయింప నవసరములేదు. మీతోడు. నేను దాని నతిగోప్యముగా నుంచెదను. మీరు చెప్పఁదలఁచినదానిఁ జెప్పుఁడు. అని నుడివినతోడనే కృపాసింధు వామెను దగ్గరకుఁ బిలిచి చెవిలో రహస్యముగా నేదియో చెప్పెను. దానిని వినినతోడనే భువనమోహిని తెల్లఁబోయి “అబ్బె నేనట్టిపాడుపని నెన్నఁడును జేయఁజాలను. ఆతఁడు నాకు పితృసమానుఁడు” కృపాసింధువు “కామినీ! నీవట్లు నన్ను నిరాకరించుట ధర్మమా? నీవు నాకు భార్యవు. నేను నీకు భర్తను. నాసర్వస్వమును నీ కిదివఱకె ధారపోసితిని. ఇందువలన మనకు విశేషలాభ మున్నది. ఎట్లయిన నీవీపని చేయకతప్పదు.” అని

కొంతధనమును నొకచిన్నపొట్లమును నామెచేతికిచ్చి "ఈకార్యమును నీవు కొనసాగించితివేని నిన్నింతకన్న నధికముగా సంతోషపెట్టెదను" అని చెప్పెను. అపుడు భువనమోహిని వానిమాట తోసిపుచ్చనేరక యందులకు సమ్మతించెను. ఆహా! ధనమెంత ప్రభావముగలది. ప్రాణమిత్రులకును వైషమ్యమును గలిగించుచున్నది. గురువునైన హింసింపఁజేయుచున్నది. భువనమోహిని తనకార్యమును జక్కఁజేయుటకు సమ్మతించినందున తనమనోరథము సిద్ధించునని నిశ్చయించుకొని యెవ్వరో పిలిచినందున కృపాసింధువు వెలుపలకు వెళ్ళిపోయెను. భువనమోహిని మనస్సునం దొకవిధమైనయూహాపోహము జనించి యేమి చేయుటకును దోఁచక విచారించివిచారించి యెట్టకేలకు "గురువైననేమి దేవుఁడయిననేమి! ఈప్రపంచకములో బ్రతుకఁదగినసాధనము ధనము. ఈధనమును మఱియొకవిధముగా నే నెట్లు సంపాదించఁగలను. ఈతఁడు నాకునేర్పినవిద్య నావృత్తి కెంతమాత్రి మనుగుణ్యమైనదికాదు. ఇందుమూలమున నే నెంత ధనము సంపాదించితిని. నే నిపుడవలంబించిన వృత్తిమూలమున నీయైశ్వర్యమును సౌఖ్యమును ననుభవించుచుంటిని నే ననుభవించుచున్న సంతోషమును సౌఖ్యమును యామినీపూర్ణతిలకగాని సుగుణమంజరిగాని యనుభవించుటలేదు." అని యోచించుచుండ నొక్క దివ్యసుందరవిగ్రిహ మాపాదమస్తకము మేలిముసుగును ధరించి లోనికివచ్చి "ఈయిల్లు కృపాసింధుదేనా" యని యడిగెను.



భువనమోహిని—అవును. కృపాసింధుదే! వారియొద్ద వారితో నీకు పనియున్నదా! అప్పుడా స్త్రీ మేలిముసుగు నొత్తిగించుకొని "నాకు వానితోనే పనియున్నది" అని బదులు చెప్పెను. షోడశకళాపరిపూర్ణమై దేదీప్యమానమై వెలుగుచున్న యాసుందరీమణిసౌందర్యవిగ్రహము కొంతవఱకు కామెకుఁ గనిపింప యామె మిగుల యద్భుతపడుచుండెను. ఆమెముఖసౌందర్యము మిగుల రమణీయమై యున్నను దీర్ఘవిచారముచేఁ గృశించియున్నందున వాడుబాఱినపద్మమువలెఁ గనిపించుచుండెను. ఆమెయవయవసౌందర్యము మిగుల నిరుపమానమగుటచే వానిని బోల్పఁదగినసుందరపదార్థములేవియు సృష్టియందు గనిపించవు. ఆమెసౌందర్యవిగ్రిహము చూచుటకు మిగుల మనోహరమైయున్నను నీచహృదయములు దానిని సమీపించుటకు కన్నెత్తిచూచుటకును భయపడునంతనిర్మలమైనపావనతేజస్సుతోఁ బ్రకాశించుచుండెను. భువనమోహిని యామెవిగ్రిహమును గాంచినతోడనే యామెయెడల కొంతయాదరణబుద్ధి గలిగి కూర్చుండనియోగించెను. ఆమె కూర్చున్నతోడనే భువనమోహిని తనపనికత్తెను జేరఁబిలిచి "యజమానుఁడింట నుండెనా" యని యడిగెను. పనికత్తె లేఁడని ప్రత్యుత్తరమిచ్చెను. అపుడు భువనమోహిని యీయామెకుఁ దనయజమానునితోఁ గల సంబంధమును నెఱుఁగఁగోరి పనికత్తె నావలకుఁ బంపి "అమ్మా! నాయజమానుఁడు వచ్చువఱకు నీవిట కూర్చుండి నీచెలిమిని నాకుఁ బ్రసాదింపుము:" అని నుడివినప్పు డామానినీతిలకంబు

"నీవుసమ్మతించితివిగాన నీయజమానుఁడువచ్చువఱకు వేచియుండెద" అని భువనమోహినిని నఖశిఖపర్యంతముఁ జూచి నిట్టూర్పు నించుచు లోపలనుండి పొరలివచ్చుచున్న దుఃఖము నాపుకొని కరతలంబున కన్నీరుఁదుడుచుకొనుచుండెను. అప్పుడు భువనమోహిని యామెవిచారహేతువును దెలియఁగోరి "అమ్మా! నాముఖ మేమిదోషము జేసినది? నాముఖమును జూచినకొలఁదిని నీవిచార మతిశయించుచున్నది.

కొత్తకాంత—అమ్మా! యిదినాపూర్వకర్మదోషమే గాని నీముఖముజేసిన దోషముగాదు" అని కన్నీరు నించుచు మఱింత పరితపింపసాగెను. అప్పుడు భువనమోహిని "ఓకాంతా! నీవట్లువిచారింపకుము. నీనిజస్థితిని నాకెఱింగించితివేని నీమనోవ్యథ నివారింపఁ బ్రయత్నించెదను.

కొత్తకాంత—నీయజమానుఁడు సింధురాజకుమారికలభాషిణినిగూర్చి యెన్నఁడైన నీతోఁ బ్రశంసించెనా?

భువనమో—ఆతఁడు నాతో నింతవఱ కెన్నఁడు నామెనుగూర్చి ప్రశంసించియుండలేదు.

కొత్త—ఆహా! పురుషు లెంత కాఠిన్యహృదయులు! అగ్నిసాక్షిగావివాహమాడినభార్యలను విడిచి నిర్దయులై యీవిధముగా బాధ పెట్టుచుందురు. ఆనిధర్మపరాయణత్వము సత్యవ్రతమును నేఁడెందుబోయెను. ధర్మపత్ని నీవిధముగాఁ గాసిబెట్టినదోషం బూరకపోవునే; నాకర్మఫల మిట్లుండ వానిని నిందింపనేల" అని గద్గదస్వరంబుతో నుడువుచుండ భువనమో-



హిని నిర్ఘాంతపడి చూచుచుండెను. అంతలో కృపాసింధువు వచ్చి యెదుట నిలుచుండెను. వానిని జూచినతోడనే భువనమోహిని "అమ్మా! నాయజమానుఁడిడుగో చూడుము" అని చెప్పినతోడనే కలభాషిణి వానివంకఁ దేఱిపాఱ చూచి "అయ్యో! నన్ను వివాహమాడిన కృపాసింధు వీతఁడు గాఁడు," అని నిరాశఁజెంది వెళ్ళిపోయెను.



## పండ్రెండవప్రకరణము.

—o—

అయోధ్యాపట్టణములోనిపూరియింటియందు పేదమానవుఁడొకఁడు రాత్రియంతయు సుఖముగానిద్రించి యామఱునాఁడరుణోదయంబుననే మేల్కని కాలోచితకృత్యంబుల నిర్వర్తించినతోడనే కలిగినకొలఁది భుజించి యొంటరిగాఁ గూర్చుని యిట్లు విచారించుచుండెను. "శరీరకష్టముచే సంపాదించిననాలుగణాలమూలమున నీమూఁడుపూట లింతగంజి ద్రావితిని. నేనీయూరుజేరిననాఁటిరాత్రి యాఁకలిచే మలమలమాడి బాధపడుచుండ నాపుణ్యాత్ముఁడు నన్నుగొనిపోయి యన్నపానీయముల నొసగి నన్నాదరించెను. ఆహా! యేమివానిదయ! ఆతఁడు చక్కగావర్ధిల్లుగాత. ఈశ్వరుఁడు జయచంద్రుని జల్లగా కృపఁ జూచుగాత! ఆతఁడింకను నాబోఁటిపేదవాండ్ర ననేకులరక్షింప

శక్తి గలిగియుండుగాక! పనిపాటలు దొరకనివఱకు కాంతుఁడు నన్నా
దరింపఁజూచినను సోమరినై వానియింటఁ గుడుచుచుండుట
నాకు ధర్మముగాదు. ఆహారమును మరల నెట్లుసంపాదించుకొనఁ
గలను. ఆహార మాకలములవలె యప్రయత్నముగా లభింప
దు. వచ్చినను సరే మాచెల్లెలుభువనమోహినియింటికి నే నె
న్నఁడు వెళ్ళను. కూలిపనియైన నేఁడు కనిపించదు. ఇఁక నే
నెట్లుజీవింపఁగలను '' అని విచారించుచుండ నేదియో జ్ఞప్తికి
వచ్చి చివాలున లేచి మూలనున్న చిన్నసంచిని పైకివేసి తెఱ
చి బదరికాఫలమాత్రింబులైన చిన్నికొప్పెలను పైకిదీసి
ఇది లోకనాధరసము. ఇది పూర్ణచంద్రోదయము. ఇది మహా
వాతగజాంకుశము; ఇది సర్వవిషసంహారిణి ,, అని యౌషధపు
పేళ్ళను నుడువుచు ‘‘ ఇది నాకిపుడేమిప్రయోజనము; అ
య్యో! కుజనుఁడగు వైద్యునివలెనే నాహృదయము ప్రజా
పీడనముగోరుచున్నది. పాపము నశించునుగాక. వైద్యులును
మందులును నవసరములేకయే సర్వజనులాయురారోగ్యభాగ్య
ములు గలిగి సుఖింతురుగాక ,, యని యామందులసంచిని
మఱల చక్కఁగాఁ గట్టి క్రిందనుంచి ఇఁక నేనెట్లుజీవింపఁగలను?
జీవింపఁదగిన సాధనమేదియుఁ గనిపించదు. శిల్పమునందును
చిత్రలేఖనమునందును నేను కొంతసామర్థ్యమును గలిగియు
న్నను పనిపాటలు దొరకువఱకు నన్నాదరించువారెవ్వరును
లేరు. ,, అని విచారించుచుండ ‘‘ దిక్కులేనివారి కీశ్వరుఁడే
దిక్కు ,, అనుశబ్దమొకటి వానివెనుకనుండి వినిపించెను. శూర



సేనుఁడు దానిని వినినతోడనే వెనుకకుఁ దిరిగిచూచెను. అపుడు
క్రొత్తమనుష్యుఁడొకఁడు వానికనులకుఁ బొడసూపెను. శూర
సేనుఁడు తెల్లఁబోయి ‘‘ ఓయి! నీవెవ్వఁడవు ,, అని యడి
గెను. ఆక్రొత్తమనుష్యుఁడు ‘‘ నేను జయచంద్రుని సేవకుఁ
డను. నీ యంగీకారమును బడయకయే లోనికిఁ జనుదెంచిన
నానేరమును మన్నింపుము. నీవు నన్ను జూడఁబోయినను నీవె
నుక నిలిచి నీవృత్తాంతము సర్వము గ్రహించితిని. దారిద్ర్యము
చే నీవు మిగుల బాధపడుచున్నను నీయుత్తమస్వభావము
ప్రస్తుతింపఁదగియున్నది. సంపదకన్నను దరిద్రమే మానవు
లకు శ్రేయోదాయకమని యోజించెదను. సంపద మానవు
లకు గర్వము సోమరితనము మదము మొదలయినదుర్గుణజా
లంబును గలిగించుచుండును. యుక్తాయుక్తజ్ఞానమును హృద
యమునుండి తరిమివేయును. మాంద్యముసంఘటించును. దరి
ద్రము బుద్ధిని వికసింపఁజేసి శరీరపాటవమును గలిగించుటయే
గాక మహాత్కార్యముల సాధింపఁదగినశక్తిని బ్రసాదించును.
ఇందుచేతనే యుత్తమపురుషులు దరిద్రముచే బాధపడుటయు
నీచమానవులు సిరిసంపదలచేఁ బ్రకాశించుటయు తఱుచు తట
స్థించుచున్నది. అంతమాత్రముచే కొఱంత గలుగలేదు. తుద
కుత్తమపురుషులచరిత్రమును హీనమానవులయైశ్వర్యసౌభాగ్య
మును వేఱువిధముగా పరిణమించును. కట్టకడపటకు నుత్తమ
పురుషులు మహోన్నతపదవినొంది సర్వసుఖముల ననుభవిం
చుదురు. నీచమానవులు సిరిసంపదలఁ దొలఁగి దుఃఖభాజనులై

గాసిల్లెదరు. నీహృదయము సద్భావపూరితమై కనిపించుచు
న్నందున నీ వచిరకాలములోనే దరిద్రమును బాసి సుఖింపఁ
గలవు. ఓయి! నీవింతకుముందునుడివిన యౌషధనామములఁ
బట్టి నీవు వైద్యశాస్త్రవేత్తవని యూహించితిని. ప్రస్తుతమున
నవి నిరర్థకములని భావించితినిగాని నీవు వానిఁ బ్రయోగించి
నీచికిత్సానైపుణ్యంబును జూపఁదగినతరుణ మాసన్నమైయుం
డెను. అమితబలపరాక్రమసంపన్నుఁడును నధికదయాపరుండు
ను నగుజయచంద్రుఁ డాకస్మికముగా నిపుడు మరణబాధ
నొందుచుండెను. వైద్యులనేకులు తమచేతనైనచికిత్సలం జేసి
కార్యము లేక నిరాశ జెందియుండిరి. నాయజమానుఁడింతవఱకు
నన్ను పుత్రవాత్సల్యముతోఁ బోషించుచుండెను. భృత్యధ
ర్మముకన్నను వానియెడల నాకుఁగల పితృప్రేమయే మిమ్ముఁ
బ్రార్థింపనంతగాఁ బ్రేరేపించుచున్నది ,, అని చెప్పెను. ఈవృ
త్తాంతమును వినినతోడనే శూరసేనునిహృదయనాళంబు సహ
స్రశకలంబులయ్యె. అపు డతఁ డమితచింతాక్రాంతుఁడై
వాఁడు రక్షించినపరమదయానిధికి నేఁడెంతకష్టముసంభవించె
ను. ఆసచ్చరితుని పరమేశ్వరుఁడె తప్పక రక్షించును ,, అని
యించుకయు జాగుచేయక మందులసంచిని చేఁదాల్చి జయ
చంద్రునిసన్నిధానంబున కేతెంచెను.

శూరసేనుఁడు చూచునప్పటికి జయచంద్రునికి ప్రపం
చకవ్యక్తి లేదు. కన్నులు మూసికొనియున్నను మధ్యమధ్య
తెఱవఁబడిన తెల్లగుడ్డు ప్రత్తికాయవలె పైకివచ్చి చూచు



వారలకు భీతిఁబుట్టించుచుండెను. కడుపు భేరివలె పెద్దదై కు
త్తుకను త్రట్టియుండెను. ముగముచ్చి మెత్తబారియుండెను.
కంఠమునందు వాపు గనిపించుచుండెను. కాళ్ళు చేతులు గిజ
గిజ కొట్టుకొనుచుండెను. జిహ్వ వెనుకకు లాగుచుండెను.
శూరసేనుఁడు ధాతువులను జక్కఁగా పరిశోధించెను. ముఖవై
ఖరిని జక్కఁగా కనిపెట్టెను. వెంటనే మందులసంచిని విప్పి
తెల్లనిచూర్ణమును పైకిఁదీసి జలమునందుగలిపి త్రాగించెను.
జయచంద్రుఁడు దానిని మిగుల ప్రయాసముతో కొంతసేపు
నకు దిగమ్రింగెను. అపుడు ఘనియాయాసము మఱింత యతి
శయించెనుగాని యిరువదినిమిషములకు వమనమువచ్చి మిగుల
చిక్కనైయున్న జిగురుపదార్థమును తిత్తులుతిత్తులుగా వెడలఁ
గ్రక్కెను. తరువాత మఱికొన్నినిమిషములకు బాధ కొంతవఱ
కుపశమించినందున శరీరస్మారకము దెలిసి నెమ్మదిగా పరుం
డెను. వెంటనే శూరసేనుఁడు మరల నింకొకయౌషధమును
బ్రయోగించెను. ఇట్లు రెండుమూఁడుమారు లౌషధసేవఁ జే
యుటవలన బాధయంతయు పూర్తిగా నుపశమించి జయచం
ద్రుఁడు సుఖముగా నిద్రించెను. అతఁడు కక్కియున్న జిగురు
తిత్తులను జక్కఁగా పరిశోధించి చూడఁగ విషముతోఁ గూరిం
పఁబడినట్లు కనఁబడెను. అపుడు వానిని సేవించుచున్న రాజ
బృందము మిగుల యాశ్చర్యపడి యిది సేవకులదుర్నయమని
భావించి సూపకారులను సేవకులను భర్జింపసాగిరి. అంతలో
జయచంద్రునికి మెలకువవచ్చి జరిగినవృత్తాంతము నంతయు

వినినతోడనే “అయ్యలారా! వారల బాధింపకుఁడు. నాపరివా
రజనంబులందెవ్వరును నాకనిష్టులు లేరు. నాభృత్యులందఱు
నాకు పరమమిత్రులు. విశ్వాసనీయులు. వారలపై నాకించుక
యు ననుమానము లేదు. వారల బాధింపక విడిచిపెట్టుఁడు”
అని వారల విడిపించి చెంతనున్న శూరసేనుని గాంచి “ఓయి!
నన్ను బ్రతికించినపుణ్యాత్ముండ వీవ. ఎన్నిజన్మములెత్తినను
నీఋణము తీర్పవీలులేనిది” అని వానిని విశేషముగా సన్మా
నించుటయేగాక యధికధనంబుగూడ నొసంగెను. శూరసేనుఁ
డు దాని నెంతమాత్రము ముట్టక “స్వామీ! యీశరీరము
మీరు రక్షించినదే; నేను మీయెడలచేసినది విధాయకకృత్య
మేగాని యది యొకమహత్కార్యముగాదు. మీరు మరల
బ్రతుకుఁగలుగుటకు నీశ్వరానుగ్రహమేగాని నాప్రయోజకత్వ
మించుకయు లేదు. సర్వమున కీశ్వరుఁడు కర్త. మీరు నన్నొక
పెద్దఁజేసి యిట్లు శ్లాఘించుచుండుటచే నేను సిగ్గుపడుచుం
టిని” అని నుడివినప్పుడు వానిసౌజన్యమునకు జయచంద్రుఁడు
మిగుల సంతోషించెను. ఇపుడు జయచంద్రుఁడు పూర్వమువ
లెనే సంపూర్ణమైన యారోగ్యమును గలిగియుండెను. హీనవం
శసంభవుఁడైనను శూరసేనుని చులకనఁజేయక పరమమిత్రుని
గా భావించి సోదరప్రేమతో నాదరించుచుండెను.

తరువాత కొన్నిదినములకు శూరసేనాదియాప్తవర్గంబు
తోడను రాజకీయతంత్రజ్ఞులతోడను పేరోలగంబున కొలువు
దీర్చి రాజకీయవ్యవహారముల సంభాషించుచుండ శూరసేనుఁ



డు “స్వామి! నాఁడాదుర్మార్గకృత్యమునకొడిగట్టిన పుణ్యా
త్ముఁ డెవ్వఁడై యుండునో దేవర యింతవఱకు నూహించియు
న్నట్టుకనిపించదు. ఆదుర్మార్గునుపేక్షించి యూరకున్న మఱల
నెప్పుడైన నొకప్పుడు ముప్పుతటస్థింపక తప్పదు” అని చెప్పఁగ
దగ్గరనున్నవారందఱది తథ్యంబని యేకగ్రీవంబుగా నుడివిరి.
జయచంద్రుఁడు “నేనెంత యోచించినను దాని నిర్ధారణఁజే
యలేకపోవుచుంటిని. అది దైవమాయ. అది యెట్లుజరిగినదో
నేను యోచింపలేకపోయినను, నాసేవకులలో నెవ్వఁడును నిట్టి
పాడుపని జేసియుండఁడని నేను నొక్కి వక్కాణింపఁగలను. పాప
మెన్నఁడును దాగదు. కృపాసింధు వర్తనము మిగుల యను
మానాస్పదమై యున్నను దానికది బయలుపడువఱకు వేచి
యుండవలయును” అని చెప్పుచుండ సేవకుండొకఁడు కాగిదము
నొకదానిని గొనితెచ్చి “స్వామీ దీనిని చిత్తగింపుఁడు”
అని జయచంద్రునిచేతి కందిచ్చెను. వానిని జదివినతోడనే
జయచంద్రుఁడు తెల్లఁబోయి చెంత నాసీనులయియున్నవారి
ముఖములవంక యాశ్చర్యముతోఁ జూడసాగెను. అందుల విష
యములను వినఁగోరి యొద్దనున్నవారందఱు వేగిరపడుచుండిరి.
అపుడు జయచంద్రుఁడు “ఇందలి చిత్రములనువింటివా శూర
సేనా” అని యిట్లు చదువఁదొడంగెను. “మనకు చిక్కియున్న
మానవుని నెందినములలో భైరవస్వామి కైంకర్యమున విని
యోగింపఁబోవుచుంటిమి. వానినిగూర్చి నీవించుకయు భయ
పడనవసరము లేదు. కపటోపాయముచే నెట్లయిన జయచంద్రు

ని ప్రాణములతో విడువక త్వరలో తుదముట్టింపుము" అని చదివి ఈదుర్మార్గమునంతయు వింటివా శూరసేనా?

శూరసే—ఇది యంతయు భైరవమతస్థుల దౌష్ట్యమని స్పష్టమగుచున్నది. ఈదుర్మార్గులు తమపై శత్రుత్వమును వహించియున్నను బహిరంగముగా తమ్ము నెదిరింపనేరక లోలోన నిట్టి కపటోపాయంబుల నాచరించుచుండిరి.

జయచం—ఇపుడు నాకు సంభవించిన విపత్తున కీదుర్మార్గులే కారణమై యుందురు.

శూర—స్వామీ! యీలేఖన మెవరికి వ్రాయఁబడినది?

జయ—ఇందు వ్రాసినవారి పేరును వ్రాయఁబడినవారిపేరును లేవు." అని దానిని గొనితెచ్చిన సేవకుని బిలిచి "ఓయీ! నీ కిది యెట్లు చిక్కినది?"

సేవకుఁడు—మద్యశాలాసమీపమున మానుష్యుఁ డొకఁడు శరీరస్మృతిఁ దప్పి పొరలాడుచుండ నీయుత్తరము వానియొడినుండి జాఱి క్రిందఁబడినది. దానిని దీసి చదివితిని. అది దేవరకు సంబంధించియుండుటచే వానిని మఱియొక సేవకున కొప్పగించి దీని తమసన్నిధానమునకుఁ గొనితెచ్చితిని.

అని చెప్పఁగానే జయచంద్రుఁడు వానిని పట్టితెచ్చుటకు భటుల కాజ్ఞాపించెను. వారును నతివేగముగఁ బోయి యామనుజుని బట్టితెచ్చి జయచంద్రుని యెదుట నిలువఁబెట్టిరి. అపుడు జయచంద్రుఁడు వాని యూరును పేరును వ్యాపారంబును దెలి



యఁగోరి వానిని బ్రశ్నించెను గాని వాని ప్రత్యుత్తరములు పొందిక లేకయుండుటచేతను వానిప్రలాపము లసంబంధములై యుండుటచేతను వానియం దనుమానము గలిగి వానిని కఠినముగా బాధించి యడుగఁజొచ్చెను. వాఁ డాబాధలకుఁ దాళఁజాలక తాను భైరవమతస్థుఁడననియు తనపేరు మాఱీచుఁ డనియు శ్రీనివాసయోగి సేవకుఁడ ననియు శ్రీనివాసయోగియే యీయుత్తరమును తనచే కృపాసింధునకుఁ బంపె ననియు మొదలయినసంగతులతో నిజస్థితి నంతయుఁ దెలియఁజేసెను. ఇంకను నాయుత్తరమునందు లిఖింపఁబడిన కొన్ని విషయములు తెలియఁగోరెను. కాని తన్ను జంపినను నంతకన్న నెక్కువ విషయములు తనకేమియుఁ దెలియ వని చెప్పినందున వానినంతటితో విడిచిపెట్టక చెఱసాలయందు బంధించుటకు నుత్తరువిచ్చెను. కృపాసింధువు తనయెడల యంతవిశ్వాసహీనుఁ డయినందునకు మిగుల విచారించి యింత శీఘ్రకాలములో వాని వర్తనమంతయు మాఱినందుకు కారణము నూహించుచుండెను. నాఁడు ప్రతాపవర్ముని భవనమునందు తాను పిచ్చివానివలె సన్యాసివేషముతో నటించినప్పుడు శ్రీనివాసయోగి కృపాసింధునిగూర్చి పలికినసంగతులు జ్ఞప్తికి వచ్చి దేశాటనమునందు కృపాసింధువు శ్రీనివాసయోగికిఁ జిక్కి వానికి దాసుఁడై తన్ను ద్వేషించియుండు నని నిశ్చయించుకొనెను. అంతటితోనైనను దృప్తినొందక దీనినిజస్థితినింకను దెలియఁగోరి శూరసేనునిఁ బిలిచి "ఓయి శూరసేనా! నీవు త్వరితగతితో

ప్రచ్ఛన్నుఁడవై భయిరవమఠమునకుఁ జని యందలిసంగతు
లను నైపుణ్యంబుతో పరీక్షింపుము. అందు బంధింపఁబడిన
మందభాగ్యుఁ డెవ్వఁడో తెలిసికొనుము. అప్రమత్తుండవై
జాగరూకతతో కార్యమును నడుపుము " అనిచెప్పి వానిని
బుత్తెంచెను.



## పదుమూఁడవప్రకరణము.

---

"మానవహృదయములయందు దుర్బుద్ధులును దురా
లోచనలును లేనియెడల యీభూలోకము స్వర్గలోకమువలెఁ
బ్రకాశించును. సుఖసంపాదనార్థము మానవుఁ డెంతప్రయ
త్నించినను నీశ్వరేచ్ఛననుసరించి కార్యఫలము లభించుచుం
డును. భూమి పూర్ణముగా ఫలించి సస్యసమృద్ధితోఁ బ్రకా
శించుచున్నప్పుడు కర్షకుఁడు తనకష్టమీడేరెనని యెంచి
దానినెట్లయిన భద్రముగా యిల్లుచేర్పవలెనని ప్రయత్నించు
చుండ మేటివరద దానినంతయు భూమిని బూడ్చి వానిని విఫల
మనోరథునిగాఁ జేయుచున్నది. వర్తకవ్యాపారమునకై దూర
దేశమేగినవణిజుండు విశేషధనమునుగడించి భార్యాపుత్రా
దులఁజూడఁదలఁచి గంపంతయాసతో యింటికేతెంచుచుండ
మార్గమధ్యమున తస్కరాపహృతధనుండై ప్రాణములసయి



తము గోలుపోయి తనరాకనిరీక్షించుచున్న భార్యాపుత్రాదు
లకాశాభంగమును గలిగించుచుండెను." అని తలపోయుచు నిరు
వదియైదువత్సరములప్రాయముగలభైరాగియొకఁడు సూర్యాస్త
మయమునకుఁ బూర్వమూరుచేరవలెనుతలంపున యాయటవి
మార్గంబునందు శీఘ్రగమనముతోఁ బయనంబుచేయుచుండ
మార్గపరిశ్రాంతిచే శరీరమునఁబూయఁబడిన విభూతికఱిగి వా
నిదేహకాంతి బంగారువలె పైకిఁగనిపించుచుండెను. ఆతఁడు
ధరించియున్న చెంగావిరంగు దీర్ఘకంచుకము చెమటచేఁ
దడిసి శరీరమునంటియుండుటచే నాతఁడు దూరప్రయాణము
చేయుచున్నట్లు కనిపించుచుండెను. కంఠమునవ్రేలాడుచున్న
రుద్రాక్షపేరులు జరువుచే వానిమార్గాయాసమును నతిశయిం
పఁజేయుటయేగాక వానికొకవిధమైన చికాకును గలిగియుం
డెను. శిరోజములను గలిగియుండుటచే నాతఁడు కేవలము
సన్న్యాసి గాకపోయినను నాతఁడు ధరించియున్న కాషాయ
వస్త్రములును చంక నున్న కక్షపాలయు చేతనున్న యో
గదండమును నాతఁ డొక భైరాగి యని దెలియఁజేయుచుండెను.
ఆయడవియందు నడచునప్పు డచ్చటచ్చట పల్లెలందుగనిపించు
చున్న మోటమానిసులను గాంచి నాగరికత నెఱుఁగకున్నను
నిష్కాపట్యమును గలిగియుండుటచే నాగరికులయిన పట్టణవా
సులకన్న నుత్తములని యాభైరాగి తలఁచుచుండెను. అడవి
దాఁటి భైరాగి యూరుచేరునప్పటికి వృక్షాగ్రములయందు నీ
రెండ మినుకుమినుకుమనియింకను ప్రకాశించుచుండెను. భైరా

గియూరేయి యొకగృహస్థునింటభుజించి సుఖముగా నిద్రించెను. మఱునాఁడు ప్రాతఃకాలమున మేల్కాంచి భైరాగి మరల పయనమై జనుచుండెను. ఇంకను సూర్యోదయమునకుఁ గొంత వ్యవధి యున్నందున కారుకమ్మిన మొగిలివలె మంచు దట్టముగా వ్యాపించి యామార్గస్థునకుఁ గొంతసంకటమును గలిగించుచుండెను. కాని, యంతలో బాలసూర్యుఁ డుదయించి నిజకిరణప్రసారంబున దిగంతరాళముఁ బ్రకాశింపఁజేయుటచే మంచు విరిసి మార్గస్థునకు నూతనోల్లాసంబును గలిగించుచుండెను. కొంతదూర మీతఁడు నడచినతరువాత మార్గము మిగుల వడిదుడుకుగా నుండెను. అప్పు డాతఁ డధికజాగ్రతతో పాదములఁ గదలించుచు నెమ్మదిగా నడచి తుద కొక్కలోయ సమీపించెను. ఆలోవియదాటి యధికప్రయాసమున యెదుట నున్న కొండనెత్తము నెక్కెను. ఆప్రదేశమంతయు నీలపురాలు దాపిన తిన్నెవలె సత్సమానమై లేతపచ్చికచేఁ గప్పఁబడి యుండెను. అందు గోగణంబులును అజాతండంబులును కడుపార మేసి గొల్లపిల్లలూదు పిల్లనగ్రోవుల కడ్డులెత్తి వినుచుండెను. అందలి తరుషండంబంతయు తుహినాశ్రయంబులై యుండుటంజేసి రజతద్యుతులఁ దేజరిల్లుచుండెను. నిర్మలసలిలకాసారంబులెల్ల కలహంసకారండవబకబలాహాకాదిజలవిహంగంబులకు నివాసంబై కుముదకమలకల్హార కుసుమవిసరసుందరంబై యామార్గస్థునకు నేత్రానందంబై తోఁచుచుండెను. గగనమండలంబున నొరయుచున్న పర్వతపంక్తులచే నావృతంబైన యా



ప్రదేశమంతయు నగమ్యమార్గమువలె బాటసారికిఁ గనిపించుచుండెను. ఈమార్గస్థుఁ డిచట కొంతసేపు విశ్రమించి సేదదేరినతోడనే మరల పయనంబై పర్వతమధ్యమందు కనిపించుచున్న యిరుకుదారిని మరల నడువఁజొచ్చెను. ఈమార్గము బహుదూరము నిడువుగా వ్యాపించి క్రమక్రమముగాఁ బర్వతోర్ధ్వభాగంబున కెగసి శిఖరప్రదేశంబున మిగుల వైశాల్యమును గలిగి మైదానమువలె యుండెను. సత్సమమైన యానగోపరిభాగం బనేకసరోవరంబులచే నలంకృతంబై వివిధజంతుసంతానశరణ్యంబై మిగుల భాసిల్లుచుండెను. అందు పల్లవకోరకసుమఫలభరితంబులయిన భూజలతానికుంజపుంజంబులును శుకపికశారికానికరకోలాహలంబును బర్హిబర్హసౌందర్యంబును కుసుమవిసర పరిమళమిళిత మందమారుతంబును నీతనికి హృదయరంజకములయి కనిపించుచున్నందున కొంతసేపు విడియించి “ అల్లది కాంచనశృంగము. ఇదెధవళగిరి. గౌరి శంకరునికొఱకు తపంబాచరించిన తావిదియె ” అని చెప్పుకొనుచు మరలనడువ ప్రారంభించెను. ఆతఁడు నడచుచున్నమార్గమధ్యమున నచ్చటచ్చట మంచురాతిదెబ్బలకు నఱిగియున్న చెట్లకొమ్మలనుగాంచి యీదుర్గప్రదేశమున నెవ్వరు వీనిని ఛేదించి యుందురని యాశ్చర్యపడఁజొచ్చెను. ఆతఁడునడచుచున్నమార్గమింకను వక్రమై క్రమముగా నూర్ధ్వభాగమునకు బోయిపోయి తుదకు పాతాళతలంబునంటియున్న యగాధమును సమీపించెను. ఆమార్గస్థుఁ డాయగాధముముందునిలిచి యిఁక

ముందు త్రోవఁగనిపించనందున యెటుబోవుటకును దోఁచక
దిగులుజెంది విచారించుచుండ నాయగాధముచెంగటొక యడు
గుజాడ కనిపించెను. ఆమార్గము మిగులప్రమాదకరమని దోఁ
చినందున నామార్గస్థుఁడు మిగులభయపడసాగెను. అంతఁక
న్నవేఱుమార్గమేమియు గనిపించనందున ధైర్యము తెచ్చుకొని
యధికప్రయాసతో నామార్గమున నడచుచుండెను. ఆ యగా
ధము పెక్కుమైళ్ళలోతుగలిగి యుండుటచే యావంచనునడచు
చున్న దెఱువరి వియద్వీథిని సంచరించుచున్న విహంగము వలె
గనిపించుచుండెను. ఆమార్గమున నడచుచున్నప్పుడా తెరువరి
యాయగాధమువంకకుఁజూచినయెడల కన్నుతిరుగునని భయ
పడి తలవంచుకొనియుండెను. అతఁడు మిగులధైర్యశాలియగు
టచేతను యెట్లయిన తానుపూనినకార్యమును సాధింపవలయు
గలిగియుండుటచేతను మంచుకరుళ్ళతాఁకుడునకు పాదములు
తిమ్మిరెక్కుచున్నను వెనుదీయక యామార్గమున కదలుచుం
డెను. ఈవిధముగా రెండుఘంటలకాలము నడచినపిదపయా
మార్గమధోభాగమునకు దిగి నిట్టనిడువుగా వ్రేలాడుచు
న్న కొండయొక్క యడుగుభాగమును సమీపించెను. ఆకొండ
పై కెక్కుటకు మిగులప్రయాసకరముగా కనిపించుచున్నందున
కొంతదూరమువఱకు నాతెరువరి కొండవారనే పడువఁజొ
చ్చెను. తరువాతనాకొండమధ్య చరియయొకటి గనుపించెను.
దానిమధ్యనున్నమార్గము మిగులయిరుకుగానుండెను. ఈమా
ర్గమున యీబాటసారి సుమారు రెండువందలగజములదూర



మునడచి యినుపమేకులతో బిగింపఁబడిన కొయ్యతలుపుల
ద్వారమునొద్దకువచ్చెను. తెల్లనిశిఖరములచేప్రకాశించుచున్న
యాపర్వతదుర్గము మిగులయున్నతమైయున్నందున దానివెను
కభాగమున నేమిజరగుచున్నది యీమార్గస్థునకు కనిపించు
టలేదు. అది శత్రుభయముగలిగినప్పుడు తమ్మురక్షించుకొను
టకు మానవులు నిర్మించిన పర్వతదుర్గమని యాతెరువరి
యూహించెను. ఆదుర్గము నిర్మాణచాతుర్యంబున కచ్చెరువంది
దానినిపరిశీలించుచుండ యాగోడయందమర్పఁబడిన పెద్దద్వా
రములోని చిన్నితలుపు యాకస్మికముగాఁ దెఱువఁబడి మను
ష్యునికంఠధ్వని యాబైరాగి చెవులకు వినిపించెను. " ఓపు
ణ్యాత్ముఁడా! రెండుమాసములనుండి యీగుహాంతరాళంబున
మిగుల బాధపడుచుంటిని. నన్నెట్లయినరక్షింపుము. " ఈదీ
నాలాప మాత్రఁ డాలకించినతోడనే యాతలుపువంకకుఁ జూడ
సాగెను. అపుడు కృశించియున్న మానవుని ముఖముమాత్ర
ము వానికి కనిపించినవెంటనే యదృశ్యమయ్యెను. ఆ తెరువఁ
బడినతలుపు తత్క్షణమే మూయఁబడెను. దురాగ్రహజనితము
లయిన పరుషభాషణములుకొన్ని లోపలనుండి వానికివినిపిం
చెను. అప్పుడాతెరువరి యేమిచేయుటకునుదోఁచక యద్భుత
పడి కాలుకదపనేరక యచ్చటనేనిలుచుండి " ఈమనుష్యుని
దివఱకు నేనుచూచియుండలేదు. ఆయుత్తరమునందు సూచిం
పఁబడిన మానవుఁడీతఁడై యుండును. అట్లయినదియే భైరవ
మఠమై యుండవలయును. కన్నీటిధారలఁదడపఁబడియున్న యా

దీనవదనమెంతకృశించినది.' అని విచారించుచుండ యా పెద్ద ద్వారము కిఱ్ఱుమనిచప్పుడై వెంటనే తెఱవఁబడె. యాయుధపాణులయిన సిద్ధసుభటులు వానిని సమీపించి యాకస్మికముగా చేతులతో నెత్తి వానిని లోనికిఁ గొనిపోయిరి. వారాసింహద్వారమును దాఁటినతోడనే వారా తలుపును మఱల మూసి వాని పైనున్న కాషాయవస్త్రముతో వానికన్నులు గట్టిగా బిగించి వానిని నడపించి తీసికొనిపోవుచుండిరి. పాదస్పర్శనమువలన రాతిమీఁద నడచుచున్నట్టు లాతెరువరి గ్రహించెను. కొంతదూరము నడచినతరువాత సుడితిరిగియున్న డబ్బదిరెండు మెట్లు దిగియున్నట్లు సహితమాతఁడు లెక్కపెట్టెను. వారా తెరువరి నా మెట్లపైనుండి క్రిందికిదింపినతరువాత మఱల వానిని కొంత దూరము నడపించి "ఆఁగుము" అని వానినిగవిసిరి. అప్పుడా ప్రక్కనున్న గదియందు పెద్దశబ్దమొకటి బయలువెడలి యాపర్వతమంతయు ప్రతిధ్వనించుచుండెను. ఆ ధ్వనిమంత్రములతోఁ గూడిన సామవేదమువలె మిగుల శ్రావ్యమై వినిపించుచుండెను. ఆశ్రావ్యనినదమాలకించినతోడనే యా తెరువరి తనదురవస్థను మఱచి యానందపరవశుఁడయ్యెను. అతనికరము నొడిసి పట్టియున్న మానవుఁడు వానిచెవిలో "ముందునకునడువుము" అని చెప్పెను.

అతఁడు నడుచుచున్న ముందుభాగము మిగుల వైశాల్యమును గలిగియున్నట్లాతఁడు నడిచియున్న కాలపరిమాణమునుబట్టి తెలిసికొనెను. తరువాత వారాగదిని



విడిచి బహిరంగస్థలమున నడువఁజొచ్చిరి. అపుడాపర్వతమునందలి శీతవాయువులు దేహముపై ప్రసరించి యాబాటసారిని గజగజ వడఁకించుచుండెను. తరువాత వారు కొంతసేపటికి మఱియొక ద్వారమును సమీపించి తలుపు తెఱవఁబ్రయత్నించిరిగాని బీగము వేసియున్నందున వానినచట నిలువఁబెట్టి వారిలో నొకఁడు 'ఓరీదుర్ముఖా త్వరగాఁబోయి తాళముచెవిని గొనిరమ్ము" అనిచెప్ప దుర్ముఖుఁడు పోయి తాళముచెవిని తెచ్చి తలుపు తెఱచెను. తరువాత మంచుచే కప్పఁబడిన రాతి నేలయందు వానిని గొన్నియడుగులదూరము నడిపించి యొక యింటిలోనికిఁ గొనితెచ్చిరి. అపుడు వారిలోనొకఁడు "ఇది వఱకున్నవారెందఱు?" అని మఱియొకని నడిగెను. 'ముప్పదియిద్దఱు' అని యందొకఁడు బదులు చెప్పెను. "నిన్నమధ్యాహ్నము మనముపట్టితెచ్చినవానిని యెచటనుంచితిరి" యని మొదటివాఁడు మఱల ప్రశ్నించెను. "వానిని గుడివెనుకఁ బాతిపెట్టితిమి" అని రెండవవాఁడు మఱల ప్రత్యుత్తరమిచ్చెను "ఆవైపు గుహాయాం దీఁరపశువులను బంధించుట మిగుల ప్రమాదకరము. వాఁడప్పుడప్పు డామార్గమున నడుచువారి కగుపడి సంభాషించుచుండును. "ఆమార్గమున నితరులెవ్వరును రారు. నేఁడెట్టెట్టో యాతఁడుమాత్ర మీమార్గమున రా తటస్థించెను" వీరిసంభాషణమును వినినప్పుడీతెరువరి మిగుల భీతిఁ జెంది యచట జరుగుచున్న వృత్తాంతమును జూడఁ దలంపున దన కన్నులవంకకు బోనిచ్చుచుండెను. వెంటనే దగ్గరనున్న మాన

ష్యుఁడు దానిని గ్రహించి వానిచేయి కదలకుండ గట్టిగాపట్టు
కొని మఱియొకమందిరమునకుఁ గొనిపోయి యందలిమెట్లపై
కెక్కించి ముందఱికవాటంబును దెఱచి లోనికి వానిని గొని
పోయిరి. వా రందుఁ బ్రవేశించినతోడనే వారాతలుపును మ
ఱల బంధించి వానికన్నులఁ గట్టినగుడ్డను విప్పివేసిరి. ఆకట్టు
విప్పినకొంత సేపువఱ కా బాటసారి కన్నులు చక్కఁగాఁ జూడ
లేకపోయెను. ఆతఁడు చూడఁగలిగినప్పుడు తానొకమందిర
మున నున్నట్లును తనచెంత నిలుచున్న భయంకరులైన యాభ
టులు తన్నుఁగొని తెచ్చినట్లును నాతఁడూహించుకొనెను. వార
లయాకృతి కొంత కొండవానివలెను కొంత యుద్ధభటునివలెను
గనిపించుచుండెను. వారిముఖములయందు కాఠిన్యమును భ
యోత్పాతమును గనిపించుచుండెను. నల్లనిముఖములయందు
గనిపించుచున్న విషపునవ్వు వారియాకృతికి మఱింత వికృతిని
గలిగించుచుండెను. వారలఁ గాంచినప్పుడే తెరువరిహృదయ
మున కొంత బెదరుకలిగి యాశ్చర్యముతో వారివంకఁ జూడ
సాగెను. అప్పుడు దురంతకుఁడు వానిని జూచి "ఓయి నీవేల
యాశ్చర్యపడుచుంటివి. ఇం దాశ్చర్యకారణ మేమున్నది.

తెరువరి.—ఇది శీతలప్రదేశమైయున్నను నిందు చలి
యంతగా కనిపింపకుండుటచే నేను కొంత యాశ్చర్యమును
గలిగియుండుట నిజమే.

దురంతకుఁడు—నీయాశ్చర్యమున కిది యే కారణమా?
నీ వీయుదయమునుండియు నీపర్వతమున నల్లాడుచుంటివి. ఆక



లిచే మిగుల డస్సి బాధపడుచుంటివి. ఈపీఠముపైఁ గూర్చుండి
వలసినంతవఱకు భుజింపుము" అని చెప్పి తాను నాప్రక్క
నున్నపీఠముపైఁ గూర్చుండి భుజింపనారంభించెను. అప్పుడా
తెరువరి "ఇంతలో వీరు చేయఁదలఁచినదుర్మార్గ మేదియుఁ గన
పించదు. ఆకలి మిగుల బాధించుచున్నది. ఏమయిననుసరే"
యని యోచించి యాపీఠముమీఁదఁ గూర్చుండి భుజించుచుం
డెను. ఆతఁడు భోజనము చేయుచున్నప్పుడు మధ్యమధ్య
యేదియో యోచించుచు నాగదినలుగడలు పరికించి చూచు
చుండెను. మందిరకుడ్యములయందు గవాక్షములు లేవుగాని
దానియుపరితలమున వెల్తురునిమిత్తము అద్దములతో మూయఁ
బడినరంధ్రములుమాత్ర మచ్చటచ్చట కనిపించుచుండెను.
దూలములుగాని వాసములుగాని దానియందుఁ గనిపించవు.
అందు చూపఁబడిన శిల్పనైపుణ్యంబు మిగుల విచిత్రమై కను
పట్టుచుండెను. దానినిర్మాణవిధాన మెంతయోచించినను నీతె
రువరిహృదయమునకు గోచరించుటలేదు. భోజనానంతరము
దురంతకుఁ డాతెరువరిని గాంచి "ఓయి! యింతకుముందు నీవె
ప్పుడైన నీపర్వతప్రాంతమున కేతెంచితివా?

తెరువరి—ఇంతకుపూర్వ మెన్నఁడీప్రాంతమునకు వచ్చి
యుండ లేదు.

దురంత—ఇంతవఱకెన్నఁడును రానియెడల యీయగ
మ్యమార్గమున కిపుడేల వచ్చితివి.

తెరువరి—ఆలుబిడ్డలు లేని సన్యాసిని. తాపత్రయములు నన్నెంతమాత్రమంటుటలేదు. మోక్షార్థినై సకల పుణ్యతీర్థంబుల గ్రుమ్మరి హిమవత్పర్వతము మహాత్ములకు వాసస్థానంబని యెఱింగి తుదకట కేతెంచితిని. మీవంటి యుత్తమపురుషసందర్శనంబున నాదురితంబులు దూరంబులయ్యె. ధన్యాత్ముఁడనైతి.

దురంతకుఁడు—అయియుండును. రుద్రాక్షపేరులును కాషాయదుకూలంబులును బట్టి యోచింప నీవు నిజముగా సన్యాసివలెనే గనిపించుచుంటివి. నీవా ద్వారమున చిన్నికంత నుండి నీ వెవరినైన జూచితివా.

తెరువరి—చూచితిని.

దురంతకుఁడు—ఇంతకు పూర్వము వాని నెన్నఁడైన జూచియుంటివా ?

తెరువరి—నేనింతవఱకు వాని నెన్నఁడును జూచియుండలేదు.

అపుడు దురంతకుఁడును దుర్ముఖుఁడును కొంతసే పేదియో రహస్యముగా సంభాషించినతరువాత దురంతకుఁడు దుర్ముఖుని గాంచి "ఓరీ దుర్ముఖా అయోధ్యాదేశములోని కాపాలికునకు సందేశము గొనిపోయిన మారీచుఁడింతవఱకుఁ గనిపించలేదు. అతఁడేమయియుండును.

దుర్ముఖుఁడు—వాని జాడయేమియు నింతవఱకుఁ దెలియలేదు. అందుచేతనే మనస్వామివారు మనస్థిమితములేక బాధపడుచుండిరి.



తెరువరి—ఇంకను మారీచుఁడెక్కడ. మారీచుఁడు మాయమయ్యెను.

దురంతకుఁడు తెల్లఁబోయి "నీ కిది యెట్లు తెలియును ?

తెరువరి—మాయలేఁడియైన మారీచుని శ్రీరాముఁడు సంహరించినట్లు శ్రీమద్రామాయణములో చెప్పఁబడియుండుటచే నేను దానిని వింటిని." అని చెప్పినతోడనే దురంతకుఁడు పక్కున నవ్వి "నీగోడవ నీది. నీవు ప్రపంచకజ్ఞానము లేని శుద్ధ సన్యాసివే." అని దుర్ముఖుని గాంచి "ఓయి నీవు శీఘ్రముగా జని యీసంగతిసందర్భములను శ్రీస్వామివారికి నివేదించి కర్తవ్యమును దెలిసికొని రమ్ము" అని చెప్పినతోడనే దుర్ముఖుఁడా తావును విడిచి వెళ్ళిపోయి మరల వచ్చి "పట్టుకున్నపిట్టను విడిచిపెట్టుటకు స్వామి యనుజ్ఞ యిచ్చిరి." అని నుడివినతోడనే దురంతకుఁడా తెరువరి నీక్షించి "ఓయి నిన్ను విడిచిపెట్టెదము." నీవాకంతయందు జూచినమానవునిగూర్చి యెచ్చటను వెల్లడింపనని ప్రమాణముచేయుము.

తెరువరి—అయ్యా మీరట్లు కోరనవసరము లేదు. ఇంకను మీయొద్ద కొంతకాలముండి మిమ్ములను మీపెద్దలను సేవించి తరింపఁగోరెదను.

దురంతకుఁడు దుర్ముఖుని పిలిచి రహస్యముగా "గురువులవారు సెలవిచ్చినట్లు రాజకార్యసంబంధము గలవాఁడని తోఁచదు" అని యాతెరువరివంకఁ జూచి "మాచేఁజిక్కినవారందఱు వెంటనే తరించి స్వర్గలోకమును బొందుచుండిరి. నీవు

దిక్కుమాలినసన్న్యాసివగుటచే నీకాగతి సిద్ధించుట లేదు. నీ వింకను ప్రాపంచికఋణానుబంధమును గలిగియుంటివి. ఈ మధురసమును గ్రోలితివేని మార్గపరిశ్రమోపశమనంబుఁ జేకూరు. రమ్ము 'చేకొమ్ము' అని గిన్నెడు మధురసమును వానిచేఁ ద్రావించిరి. అతఁడు దానిని ద్రావినతోడనే మత్తుఁగొని నిద్రించెను. నిద్రతీరినవెనుక యాతెరువరి రత్నగిరియను చిఱుతపల్లియందు నొకపొలముమూల నిద్రించియున్నందుకు నద్భుతపడఁజొచ్చెను. అతఁడు మెలఁకువగాంచి చూచునప్పటికి జాముప్రొద్దెక్కినది. అంతవఱకు తనకుఁ దటస్థించినవిషయములన్నియు స్వప్నకల్పితములని యాతఁడు మొదట యోచించెనుగాని యవి స్వానుభవములైయుండుటచే యథార్థవిషయములని మరల నిశ్చయించుకొనెను. అచట తనకుఁ గనిపించుచున్న పైరుపంటలనుబట్టియు తీవజొంపములఁబట్టియు నది పూర్వమంతశీతలప్రదేశముగాదనియు సమశీతోష్ణప్రదేశమనియు నెంచి యాకస్మికముగా తానంతదూర మెట్లు రాఁగలిగితి నని తలపోయుచు మరల తాను జూచినదంతయు స్వప్నమేయని భ్రమించుచుండెను. తా నాదుర్గమప్రదేశమున నధికప్రయాసముతో పయనముచేయుటయు, అందు తనకు సంభవించినవిషయములును స్మరణకువచ్చియుండుటచే నవియన్నియు జాగ్రదవస్థాకృత్యములే యని మరల నిశ్చయించుకొనెను. ఇట్లు డోలాయమానమానసుండై యాబైరాగి తానిపుడెచ్చటనున్నదీ తెలియక తహతహపడుచుండ కాపువాఁడొకఁడు



వానిని సమీపించుచుండెను. వానియాకృతి తా నాదుర్గమున జూచినవారి నెంతమాత్రముఁ బోలియుండనందున నీతఁడు మఱియొకక్రొత్తవాఁడని యెంచి "ఓయి మిత్రమా! ఇపుడు నే నెచటనుంటిని? ఇది యేదేశము?" అని యడిగెను. అందుకా కాపువాఁడు నేపాళదేశమనియు, అగుపించుచున్న పురంబు రత్నగిరియనియు తనపేరు మైత్రేయుఁడనియుఁ జెప్పి వెళ్ళిపోయెను. అప్పుడా బైరాగి యాబయలునందుఁ గూర్చుండి యప్పుడు కనిపించుచున్న ప్రొద్దునుబట్టి దురంతకుఁడు తనకు మధురసమును ద్రావనిచ్చుట మొదలయిన కృత్యములన్నియు పూర్వదినసంచితములని నిశ్చయించుకొనెను. తరువాత నాతెరువరి లేచి సమీపమున కనిపించుచున్న పురంబునకుఁ జని యొకగృహస్థునిల్లు చేరెను. ఆయింటిగవాక్షమునందు సౌందర్యవతి యొకతె కూర్చుండి రవికకుట్టుకొనుచుండెను. ఆయిగురుఁబోఁడి వీనిని కాంచినతోడనే కుట్టుచున్నరవికను క్రింద నుంచి పాదప్రక్షాళనార్థ ముదకమును గొనితెచ్చి వాని ముందుంచెను. ఆజలకలశము నందికొని శూరసేనుఁడు పాదములను ముఖమును కడిగికొని యరఁగుపై నున్నతుంగచాపమీఁద కూర్చుండెను. అపుడాయిందువదన తనసుందరవదనారవిందమును సిగ్గుచే క్రిందకు వంచుకొని వానికి కొంతదూరమున నిలుచుండెను. పర్వతప్రాంతప్రదేశములయందుసహిత మిట్టిలావణ్యవతు లుండఁగలిగినందున కాతఁడాశ్చర్యపడి "ఓకోమలీ! ఈగృహ మెవ్వరిది" అని యడిగెను. అది తనతండ్రి

మైత్రేయుని గృహమనియు నాతఁడిల్లువిడిచి పొలమునకు వెళ్ళి
యుండెననియు బదులుచెప్పెను. కడు బడలియున్నందున శూ
రసేనుఁడు చాపపై గూరగి కన్నులు మూయుచుండెను. అప్పు
డామె క్షుద్బాధాపీడితుఁగా నెఱింగి మిగుల యాదరముతో
"అయ్యా! వంటసిద్ధముగానున్నది. మీరు లేచి భుజింపుఁ
డు. మాతండ్రిగారింతలో రాఁగలరు" అనిచెప్పెను. క్షు
ద్బాధమిగుల యధికముగా నున్నను యజమానుఁ డింటలేన
ప్పుడు తానొంటరిగా భుజించుట బాగుగానుండదని యెంచి
శూరసేనుఁడు "తొందరలేదు. మైత్రేయుని రానిమ్ము" అని
చెప్పి కొంతసేపూరకుండి మరల "ఓకోమలీ! నేఁడేమివార
ము" అని యడిగెను. సోమవారమని యామె ప్రత్యుత్తర
మిచ్చెను. అపుడాతఁడు తనమనంబున "నేను యోచించినది
సరిగానున్నది. నేను రామానగరమునుండి భానువారమున
బయలువెడలితిని. నేఁడు సోమవారము. అటనుండి యిటకేతెం
చుటకు రెండుదినములుపట్టెను" అని యోచించుచు, మరల
"రామానగర మిట కెంతదూరము?" అని యడిగెను.
"ఎంతదూరమో నేనెరుంగను. ప్రయాణమునకు నాలుగుది
నములుపట్టునని కమల బదులుచెప్పెను. శూరసేనుఁడు—అం
తకన్న దగ్గరమార్గమేదియు మఱియొకటి లేదా?

కమల—నాకది తెలియదు. మాతండ్రిగారికి సర్వ
మును తెలియును. ఆయనవలన మీరు సర్వమును దెలియఁ
గలరు. అంతలో మైత్రేయుఁడేతెంచి చాపపై పరున్న రాజు



నుష్యుఁ వంక పాఱఁజూచి "అయ్యా! యింతకుముం దూరు
వెలుపలపొలమునందుఁ గనిపించినవారలు మీరలా!" యని
యడిగెను. అగునని శూరసేనుఁడు చెప్పెను. అపుడు కమల
"బాబా! నేఁడు మనయింటికి క్రొత్తమనుష్యుఁ డభ్యాగతి
రూపమున వచ్చియుండెను. ఆయనకు భోజనమునకుఁ బ్రొద్దె
క్కుచున్నది. త్వరగా లెండు" అని నుడివినతోడనే మైత్రే
యుఁ డధికగౌరవముతో శూరసేనుని లోనికిఁ గొనిపోయి విం
దుచేసెను. ఆతఁడు భుజించుచున్నప్పుడు కమలచేసినయాదరణ
మునకు పరిమితిలేదు. ఆమె సౌందర్యముకన్నను నామెవినయా
దిసద్గుణము లధికముగా నాహృదయము నాకర్షించినవి. మై
త్రేయుఁడును శూరసేనుఁడును భోజనానంతరము యరఁగుపైఁ
గూర్చుండి సంభాషించుచుండిరి. అపుడు శూరసేనుఁడు
మైత్రేయునిఁగాంచి "యిటనుండి రామానగరముపోవుట కెం
తకాలముపట్టు"నని యడిగెను. నాలుగుదినములు పట్టునని
యాతఁడు జవాబిచ్చెను. శూరసేనుఁడు—అంతకన్న దగ్గరమా
ర్గమేదైనను గలదా" అని మరల యడిగెను. అపుడు మైత్రే
యుఁడు సంశయముగలిగి కొంతసేపేదియో యోచించి "ఓయి
నీవు మార్గస్థుఁడవగుటచే నీవచటికి త్వరగావెళ్ళగోరి యడిగి
తివా? మరిదేనినైననుద్దేశించి యడిగితివా?" యని యడి
గెను. మైత్రేయుఁ డడిగినరీతిఁబట్టి యందేదియో విశేషమున్న
దని యూహించి వానియెడల దాపరికముంచరాదని తలఁచి
"అయ్యా! నిన్న నేను రామానగరమునుండి బయలువెడలి

నిర్మానుష్యమైన హిమవత్పర్వతమున నడిచి తుదకొక్క దుర్గమును సమీపించితిని. అందు పెద్దద్వారమున నున్న చిన్న తలుపు తెఱచుకొని శుష్కించియున్న మానవముఖ మొకటి నాకుఁ గనుపించి వెంటనే యదృశ్యమయ్యెను. అందలి కావలివారలు నన్ను పట్టుకొని లోనికిఁ గొనిపోయి నిర్బంధపెట్టి నాచే మధురసమును ద్రావించిరి. వెంటనే నేను మైమఱచి నిద్రించితిని. మెలకువవచ్చి చూచునప్పటికి నేను మీకుఁ గనిపించిన పొలమునం దుంటిని." అని జరిగినవృత్తాంతమునంతయు పూసగ్రుచ్చినట్లు నివేదించి మరల "నేను రామానగరమునుండి బయలువెడలినది నిన్ననే. ఈవృత్తాంతమంతయు నిన్ననే జరిగినది. కావున నచటనుండి రామానగరమునకు నొకదినముకంటె నెక్కువప్రయాణ ముండదని భావించెదను" అని చెప్పి మైత్రేయుఁడేమి చెప్పునో యని వేగిరపడుచుండెను. కాని మైత్రేయుఁడు దానినంతయు విని బదులు చెప్పక యూరకుండెను. అపుడు శూరసేనుఁడు "అయ్యా నామాటలు మీకుఁ బూటకములవలెఁ గనిపించుచున్నవి. ఇంచుకమాత్ర మసత్యములేదు. నేను చెప్పినదానినంతయు విని యూరకుంటిరి" అని చెప్పి మరల యావిషయమునే గ్రుచ్చిగ్రుచ్చి యడుగ కొంతవడి తాళి "అబ్బాయి! నీవు చెప్పినదంతయు యథార్థమే. ఇంతకుముందు దీనినంతయు నేను ననుభవించితిని. అపాయకరమైనందున నుడువుటకు భయపడుచుంటిని".



శూర — మీ కెంతమాత్రము నపాయములేదు. భయపడ నవసరములేదు.

మైత్రేయుఁడు — పదునైదుదినములకిందట నొకరోజున రామానగరమునకు సమీపమున నున్న వైజయంతీపట్టణమునుండి బయలుదేరి త్రోవతప్పి నీవు చెప్పినమార్గముననే నడచి యాపెద్దద్వారమునొద్దకు వచ్చితిని. అందమర్పఁబడిన చిన్నకంతను దెఱచికొని యిరువదివత్సరముల ప్రాయముగల సుందరపురుషుఁడొకఁడు శుష్కించినమోముతోఁ గన్నులనీరుఁ గార్చుచు "ఓపుణ్యాత్ముఁడా! నే నయోధ్యాపట్టణవాస్తవ్యుఁడను. నాపేరు కృపాసింధువు. రెండుమాసములనుండి యీకారాగృహబద్ధుఁడనై బాధింపఁబడుచుంటిని. నాకొఱ కయోధ్యాపట్టణమునకుఁ జని జయచంద్రికతో... అని చెప్పుచుండ తలుపాకస్మికముగా మూయఁబడి పరుషభాషణములుమాత్రము నాకు వినిపించెను. తరువాత నీకు తటస్థమైన దుర్దశయంతయు నాకు సంభవించెను. వారు నాచే మధురసమును ద్రావించుటకుముందు దీనిని బయలుపెట్టితిరేని జంపెదమని భయపెట్టిరి. దీని నుడువుటకు భయపడినకారణ మిదియే. ప్రమాదముచేతనైనను దీని నింతవఱకు వెల్లడింపలేదు.

ఈచెరయందు బంధింపఁబడినవాఁడు కృపాసింధువని వినినప్పుడు శూరసేనుఁడు మఱింత విస్మయమునొందసాగెను. "నాఁడు కృపాసింధుని నాచెల్లెలియింటపట్టుకొని చావఁగొట్టితిని. వాఁడు నాచెల్లెలకు వ్రాసియిచ్చిన వివాహపత్రికయందు

'కృపాసింధువ్రాలు' అని వ్రాలు చేసెను. ఇది జరిగి యిప్పటికి ముప్పదిదినములకంటె నెక్కువకాలమై యుండదు. ఈకృపాసింధు వా కృపాసింధు వెట్లగును. నేను బయలుదేరినప్పుడు వాని నయోధ్యాపట్టణమున జూచియుంటిని. ఇంతలో యీతఁ డెట్లుచెరగొనఁబడెను. ఆతఁడును నయోధ్యాపట్టణవాస్తవ్యుఁడే యఁట. అట్లయిన నాయూరనే ఆపేరుగలవాఁడు మఱియొకఁ డుండియుండవచ్చును." అని మనస్సునందు యోచించి మైత్రేయునిఁజూచి "ఓయి తోడిమానవుఁడొకఁడట్లు బాధపడుచుండ చూచి యూరకుండుట మానవధర్మము కాదు. నీవీవిషయములో మాకు చేతనైనసహాయమును జేయుము మఱల వచ్చెదను." అని చెప్పి కమలవంకఁ జూచుచు వెళ్ళిపోయెను. కమలయు వానియందధికానురాగము గనిగి వానిపునర్దర్శనమును నిరీక్షించుచుండెను.



## పదునాల్గవ ప్రకరణము.



[illegible]డయోధ్యాపట్టణముజేరినతోడనే భైరవమతమునందు సంభవించిన సర్వవిషయములను జయచంద్రునకు నివేదించెను. కృపాసింధువు దేశాటనమునుండి తిరిగివచ్చినది మొదలు వానియెడల కొంతయనుమానమును గలిగియుండెను



గాని నిజముఁదెలియువఱకు వానిని నిరోధించుట యుక్తముగాదని యెంచి వానివ్యాపారములనుమాత్రము కనిపెట్టి చూచుచుండెను. సన్యాసివేషముతో పిచ్చివానివలె ప్రతాపరుద్రుని భవనమున వర్తించుచున్నప్పుడు తాను వినియున్న ప్రతాపరుద్రాదుల దురాలోచనలును సంభాషణావిషయములును స్ఫురణకువచ్చి యిదియంతయు శ్రీనివాసయోగిదుర్నయమని నిశ్చయించుకొనెను. కృపాసింధువు దుస్థితినివినినప్పుడు జయచంద్రునికిఁ గలిగిన హృదయపరితాపముఁ జెప్పనలవిలేదు. ఇప్పుడిచట గనిపించుచున్న కృపాసింధువు కపటవేషధారి యని నిశ్చయించుకొని వాఁడు పురమువిడిచి పలాయనముగాకుండుటకుఁ దగినయేర్పాటులనుజేసెను. ఇంచుకాలస్యమైనయెడల కృపాసింధువునకుఁ బ్రాణాపాయము వాటిల్లునని భీతిజెంది వెంటనే పయనమై శూరసేనసమేతముగా రత్నగిరికేగెను. మైత్రేయుఁడు వీరలఁగాంచినతోడనే యెదురుగఁజనుదెంచి సవినయంబుగఁ దోడితెచ్చెను. ఆరాత్రియంతయు తాము చేయఁబూనిన కార్యమునుగూర్చి చక్కగా యోచించుకొని కర్తవ్యమును నిశ్చయించుకొనిరి. ఆమఱుచటియుదయమున కాలచోదితకృత్యముల నిర్వర్తించుకొని భోజనములుచేసినతోడనే శూరసేనుఁడు వెంబడింప జయచంద్రుఁడాదుర్గప్రదేశమునకు బయలుదేరెను. మైత్రేయుఁడు వారలముందు నడిచి త్రోవఁదీయుచుండెను. పర్వతపఙ్క్తియొక్క ముందుభాగమంతగా మంచుచే నావరింపఁబడి యుండలేదు. పచ్చనిబయళ్ళచేతను చెట్లచేతను

దట్టముగ వ్యాపింపఁబడియుండెను. వీరు కొంతదూరము నడిచి
నతరువాత నామార్గము క్రమక్రమముగా పైకిలేచి మధ్య
మధ్య డొంకలచేతను పొదలచేతను నావరింపఁబడియున్న
యగాధములులతో నిండియుండెను. వీరు నడిచినడిచి కొంతదవ్వు
పర్వతముపైకి వెళ్ళఁగలిగిరి. వారు నడుచుచున్న మార్గమునకు
కుడివైపు సస్యసమృద్ధిగలిగి మిగుల మనోహరముగా నుండెను.
ఎడమపార్శ్వము శైలకదంబంబుచేఁ బ్రకాశించుచుండెను.
వాని శిఖరమును మంచుచేఁగప్పఁబడి వెలిగుడారములవలె గను
పట్టుచుండెను. తరువాత మఱికొంతదూరము నడిచినపిదప
శూరసేనుఁడు మైత్రేయుని గాంచి "ఓయి! యీపర్వతదుర్గ
మున కిచటనుండి దగ్గరమార్గ మేదైన నుండునేమో పరిశీలిం
చుదము.

మైత్రేయుఁడు—ఆముందున్న పర్వతమునెక్కి పరిశీలిం
చుదము. ఇంతవఱకు మఱియొకమార్గమున్నట్టు కనుపించదు"
అని సంభాషించుచు వారియెదుట నున్నకొండపై నెక్కి
నాలుగైదుమైళ్ళు నడిచినతోడనే యామార్గము మిగుల
సన్నగిలి యిరుకుగానుండెను. ఆమువ్వురు బాటసారులకును
నాకొండలమధ్య యిరుకుబాటను నడచుట ప్రాణసంకటము
గానుండెను. అది యగమ్యము. ఆశీతనగమునుండి ప్రసరించెడి
శైత్యవాయువులు వారిముఖములపైఁ బ్రసరించి వారికి బాధ
గలిగించుచుండెను. ఈమార్గగమనము మిగుల ప్రయాసకరము
గానున్నను చలిబాధ మిగుల దారుణముగానున్నను వారెంత



మాత్రము భయపడక యుత్సాహముతో ముందుకు నడుచు
చుండిరి. మఱికొంతదూరము నడిచినతరువాత నామార్గమున
కడ్డుగా పాతాళప్రమాణమైన నగాధమొకటి తటస్థించెను.
ఆయగాధముచుట్టును కొండగుట్టలొకదానిపై నొకటిలేచి గో
పురములవలె కనిపించుచుండెను. వానియగ్రములు కారుమే
ఘములచే నావరింపఁబడి మిగుల నైల్యముగానుండెను. అటనుం
డి యెటుపోవుటకును మార్గము గనిపించనందున వారు త్రొక్కి
టుపడిచూచుచుండ మైత్రేయుఁడు "ఈవంక నడుచుటకు వీలు
గనుపించుచున్నది. ఇందలి చెట్లుచామలు నఱకఁబడినందున
మార్గమేర్పడియున్నది రండి" అని వారల వెంటఁబెట్టుకొని
కొంతదూరము నడిచెను. అది యంతటితో నంతమైనందున
వారలు మరల కష్టపడఁజొచ్చిరి. వారుమువ్వురు మూఁడువై
పులను మార్గమును వెదకుచుండిరి. తరువాత కొంతసేపటికి
మైత్రేయుఁడు సంతోషముతో "నిట్టనిడుపుగానున్న యీకొం
డవంచమార్గ మొకటి కనిపించుచున్నది చూడుఁడు" అనిచెప్ప
వారు సంతోషించి యామార్గమున నడువసాగిరి. అపుడు
కాఱుమేఘము లాకాశమంతయు వ్యాపించి గాలి యుపద్రవ
ముగా వీవనారంభించెను. మంచు క్షోణీపాతముగాఁ గురియసా
గెను. అపుడు వారు దైవముపై భారమువేసి వేగముతో నడు
గులిడుచు చెంతనున్న పర్వతగుహయందు శరణుజొచ్చిరి.
అది నిర్మానుష్యప్రదేశమయినను నందు భద్రపరుపఁబడిన వం
టకట్టెయలును భోజ్యపదార్థములును వారల కాశ్చర్యమును

గలిగించుచుండెను. చీఁకటిపడినందున నాఁరాత్రి యచట విశ్రమింప నిశ్చయించుకొనిరి. చలిబాధ యాధిక్యముగానున్నందున కట్టెల మంటవేసికొని చలికాఁగుచుండిరి. అపుడు జయచంద్రుఁడు "ఓయి శూరసేనా! రేపు మన మాచరింపవలసిన ముఖ్యకృత్యములు ముందు చెరయందు బంధింపఁబడిన వానిని విడిపించుటయు తరువాత నాదుర్మార్గులఁబట్టి దండించుటయు"

శూర—స్వామి! ఈకడపటికృత్యమును రేపునిర్వహింపలేకపోయినను తమరు సెలవిచ్చిన ప్రథమకార్యము రేపుతప్పక నెరవేర్పవలసియున్నది. జాగుచేసిన యెడల యాదురదృష్టవంతునకు ప్రాణభయము సంభవించును.

జయచంద్రుఁడు— ఈశ్వరానుగ్రహము మనయెడల పరిపూర్ణముగా నున్న యెడల మనకార్యము తప్పకసిద్ధించును. కాని యీచెరయందిపుడు బంధింపఁబడిన దురదృష్టవంతుఁడు కృపాసింధువైనను గాకపోయినను, అయోధ్యాపట్టణములో నిపుడున్న కృపాసింధువుమాత్రమాతఁడుకాఁడు. వాఁడు కృపాసింధువేషమును ధరించి లోకమును మోసపుచ్చుచున్న పరమవంచకుఁడని నేనునిశ్చయముగాఁ జెప్పఁగలను. కృపాసింధువు పరమయోగ్యుఁడు. ఈవంచకుఁడు పరమదుర్మార్గుఁడు. ఈకపటనాటకమునకంతకును శ్రీనివాసయోగియే సూత్రధారుఁడు. కృపాసింధువు యీదుర్మార్గులకు చేఁజిక్కి సజీవుఁడై యుండునా యని సంశయించుచుంటిని.



శూర.—ఈచెరయందు బంధింపఁబడిన వానిపేరు కృపాసింధువేనఁట. ఆతనిమధ్య మైత్రేయునికి చెరయందు గనుపించి తనపేరు కృపాసింధువనియు తన దురవస్థను మీకెఱింగింపవలసినదనియుఁజెప్పి వానిని వేఁడుకొనెనఁట. మైత్రేయుఁడు చెప్పిన గుఱుతులనుబట్టి నాకు గోచరించిన పురుషుఁడాతఁడేనని నేను రూఢిగాఁ జెప్పఁగలను. కనుక కృపాసింధు వింతవఱకు సజీవుఁడై యుండెననుటకు సందియము లేదు.

వీరలిట్లు సంభాషించుచుండ యామంట వెలుతురున నొక్క సుందరాంగియు యిద్దఱు సేవకులును గనిపించిరి. దేదీప్యమానమైన యామెసౌందర్య విగ్రహమునుగాంచి నప్పుడు వారలామెను దివ్యకాంతయని దలంచిరి. ఆమెయందు రెప్పపాటు గనిపించుచుండుట వారికి సంశయముగలిగి యామె భూలోకసుందరియే యని మరల నిశ్చయించుకొనిరి. కాని మర్త్యలోకకాంతల కట్టి సౌందర్యముండుట యసంభవమని యూహించి జయచంద్రుఁడు "అమ్మా! నీవీ వనదేవతవో లేక యిందు విహారార్థమేతెంచిన గంధర్వకామినివో యని సంశయించుచుంటిమి. లేకున్న నీసుందరాంగము నీలీల నేలగాసిపెట్టఁదలఁచెదవు" అని యడుగ యామానిని "అయ్యా! తమరు దలచినవారిలో నేనెవతెనుగాను. ఇది భూమియందుఁ జెట్టలగుడువఁబుట్టిన యొకపాపిష్టిజీవము" అని కన్నీరునించుచుండెను.

జయచంద్రుఁడు—అమ్మా! నీకేదియో గొప్పవిపత్తు సంభవించియుండుటచే నీజీవితమునందింత యసహ్యభావము

గలిగియుండుటకు కారణమైయుండవచ్చును. వినిపింప వలనుపడునేని నేను దానినివినగోరెద. అంతమాత్రమున నీ శోకబాధ నివృత్తిజెందకపోయినను వినువారలకు దానిని కొంత పంచియిచ్చుటచే దానిభారమించుక యుపశమించునని తలంచెదను.

స్త్రీ—మీదర్శనమాత్రముచేతనే నాబాధ కొంతవఱకు నుపశమించుచున్నది. మదీయ కథాశ్రవణంబు స్వాంతరంజితముగాకపోయినను వినువారల హృదయములకు జాలిగొలుపంగలిగియుండును. కాన దానిని వినిపించుట కించుకయు సంశయంబులేదు. నేను సింధురాజకుమారికను. నాపేరు కలభాషిణి. నేనుదక్క మాతండ్రికితరసంతానంబులేదు. అయోధ్యాపట్టణవాస్తవ్యుఁడగు కృపాసింధువు నన్నుగోరి విధ్యుక్తంబుగా వివాహమయ్యెను. మావివాహంబుఁ బ్రవర్తించి మాసద్వయంబు గతించెను. వివాహముజరిగిన పంచమదినంబున మఱల వచ్చెదనని చెప్పి నన్నువిడిచి చనియె. ఆతఁడింతవఱకు మరల నాకుఁ గనుపింపఁడయ్యె. నేనెంత ప్రయత్నించినను వానిజాడ లవలేశంబైనఁ దెలియదయ్యెను. అనిచెప్పుచు కన్నీటిధారలు చెక్కుటద్దంబులపై సంతతధారగాఁ బ్రవహింప దుఃఖింపసాగెను. అప్పుడు జయచంద్రుని సంశయము మఱింత యతిశయించినందున కొంతసేపేదియో విచారించి "ఓసాధ్వీ! నీవీప్రాంతమున పరిభ్రమించుటవలన నేమి ప్రయోజనము? కృపాసింధు వయోధ్యాపురంబున నిజసతీసమేతంబుగ సుఖంబుగ నున్న



వాఁడు. నీమాటలు నాకు విషాదంబును నాశ్చర్యంబును గలిగించుచుండెను.

కలభాషిణి—ఆర్యా! నామాటలయందసత్యమించుకయు లేదు. నావచనములు యథార్థములు. కృపాసింధు వయోధ్యాపురంబున నున్నవార్త నేను వినియుంటిని. నేనీసంగతిని వినినతోడనే యయోధ్యాపురంబున కరిగి వాని నీక్షించితిని. నన్ను వివాహమాడిన కృపాసింధు వాతఁడుకాఁడు.

జయచంద్రుఁడు—నిన్ను వివాహమాడిన కృపాసింధు వెవ్వఁడు.

కలభాషిణి—ఆతఁడును నయోధ్యాపుర నివాసియే. ధనపాల తనూజుఁడు. కాని యయోధ్యాపురమున నేను గాంచిన కృపాసింధువు నాజీవితేశ్వరుఁడుకాఁడు. అయోధ్యాపట్టణమంతయు కలయవెదకినను నాప్రాణేశ్వరుఁడు కనిపించనందున పరితాపానలంబు హృదయంబును దహింప నవ్వీడువిడిచి పెక్కుపట్టణంబులను పల్లెలనుశోధించి వానినెందును గానక యుసురులపై నాసవిడిచి యొడలజీవమున్నంతవఱకు నీ శీతశైలంబున దినంబులుగడుప నిటకేతెంచితిని. ఈ సేవకాద్వయంబు నన్నువిడిచి చననేరక నన్నింకను వెంబడించుచుండిరి. గతదినాంతరమున నేనీగుహాయందు శయనించి, నేను గొనితెచ్చిన యాహారపదార్థములనిందు భద్రపఱచి యీ పర్వతంబున నలుగడలు పరికింప నేఁటియుదయంబున నీదరీముఖంబు వెలువడి సంచరించితిని. ఈహిమశైలంబు మహాత్ములకు నిలయం

బని వినియుండుటచే నిందలి కందరంబుల శోధించుటయందు
నేఁడంతయు కాలంబుగడిపితిని. దోషకారులకు మహాత్మసందర్శ
నంబు లభించునే. హర్యక్షపుండరీకాది క్రూరసత్వంబులుసహిత
మీపాదుకళేబరంబును గర్హించి మట్టకమె దిగవిడిచి తొలఁగి
చనియె.'' నని కిన్నెరస్వరంబున నేడువఁదొడంగె. అంత జయ
చంద్రుఁడు దయార్ద్రహృదయుండై ''అమ్మా! యూఱడిల్లు
ము. ఈశ్వరానుగ్రహమున నీభర్తను నీవు బడయఁగలవు''
అని మృదుమధురవచనంబుల నామెను దుఃఖోపశమనంబు
జేయుచుండెను. ఆహా! యిమ్మగువ మగఁడు లేనియెడలున నెట్లు
బాఁగులుచున్నది! తల్లిదండ్రు లెంతధనవంతులైయున్నను బం
ధుజను లమితబలాఢ్యులైయున్నను సకలైశ్వర్యంబులఁ దుల
దూఁగుచున్నను నవియేవియు నీనారీమణి చిత్తమును రంజిం
పఁజేయలేకున్నవి. తండ్రియింట రాజ్యాదిభోగంబుల ననుభ
వింపనొల్లక, కనిపెంచిన తల్లిదండ్రులనయితము విడనాడి గండ
శైలారణ్యకటంబుల భర్తృవియోగదుఃఖంబున నెట్లల్లాడు
చున్నది. పతివ్రతలమోహ మెంతపరిశుద్ధమైనది. ఇట్టి యుత్త
మనారీరత్నంబులు హిందూసుందరులయందుదక్క నిఁక నెందు
నుందురు? అపుడు జయచంద్రుఁడు శూరసేనుని గాంచి
''ఓయీ! నీకిపు డీదుర్మార్గమంతయుఁ దేటపడినదా! ఈ
భైరవమఠమునందు బంధింపఁబడిన దురదృష్టవంతుఁడే యీమె
భర్త. ఈతఁడే నిజమైన కృపాసింధువు. అయోధ్యాపురంబున
కృపాసింధునామమును వహించియున్న దురాత్ముఁడు; పరమ



వంచకుఁడు. మోసగాఁడు. భైరవస్వామికి బలినఱుకఁబోవుచు
న్నది యీమెభర్తనే'' అని నుడివినప్పుడు కలభాషిణి మఱింత
పెద్దపెట్టున నేడ్చుచు ''నాయనా! నాభర్త యెందు బంధింపఁ
బడెను. వానిని నఱుకఁబోవుచున్న దుర్మార్గులెవ్వరు? మహాను
భావా! నీవు నన్ను రక్షింప నవతరించిన పరమపురుషుండవు.
నాపాలిటి భగవంతుఁడవు. లేకున్న నేనీనిర్జనప్రదేశమున
నిన్నెట్లు దర్శింపఁగలను. నీముఖవికాసంబును నాకారసౌజన్యం
బును బరిశీలింప నీవొక యుత్తమపురుషుండవని దోఁచుచున్న
ది. నన్ను కన్నవారికన్న నిన్నెక్కుడుగా భావించెదను. నీవే
నాకుఁ దండ్రివి, దైవమవు. ఇంతకుపూర్వము నాతండ్రి జేసిన
వివాహంబు వివాహంబుగాదు. నీవుచేసిన వివాహంబె వివా
హంబు. ఇదియే నాకనిశంబు శ్రేయోదాయకంబు. నాభర్త
నెట్లయిన రక్షించి నాకుఁ బతిభిక్షఁ బెట్టి రక్షింపుము.'' అని
యేడ్చుచు వానిపాదంబులపైఁ బడినయనాంతర్గళితసలిలధార
లచే వాని పాదప్రక్షాళనంబుఁ జేయుచుండెను. అపుడు జయ
చంద్రుఁ డామెదైన్యంబునకు మిగుల జాలిపడి ''అమ్మా!
ధైర్యమవలంబించి యూరకుండుము. హరిహరాదు లడ్డంబైన
ను సరకుసేయక నీభర్తను వెల్లిగొనితెచ్చెద. లెమ్ము శోకం
బువిడువుము. భవదీయకళత్రుండు మాకుఁ బరమమిత్రుండు.
నీప్రార్థన మవసరములేక నే వాని దుర్దశాశ్రవణంబు మామిత్ర
తదవ్వ గొనితెచ్చినది. నీచింతయుడిగి మనంబు దిటవుపఱచు
కొనుము'' అని యామె నోదార్చి శూరసేనునిబిలిచి ''నీవుం

మైత్రేయుఁడును నింతకుముందు, భైరవమతమునకుఁ జనియు
న్నందున వారు మిమ్ముల గుర్తింపఁగలరు. అందుచే మనకుఁ
బ్రమాదము సంభవించును. ఆడుదిగనుక యీయువతీరత్నం
బు నిజసేవకాద్వయ సమేతంబుగా మఠంబు బ్రవేశించినను
నందువలన నెగ్గేదియు సంభవింపనేరదు. మనము మువ్వురము
మఱియొక మార్గంబున నీమెను మఠమునందు గలసికొంద
ము. అంతలో నామె యచటి సర్వరహస్యములను గనిపెట్టి
మనకు దెలియఁజేయఁగలదు. అందుమీఁద సంగతిసందర్భమును
సర్వమును విచారించి కార్యమును నడుపవచ్చును" అని చెప్పె
ను. దానికి మైత్రేయుఁడును శూరసేనుఁడును తమయంగీకారము
లను బ్రకటపఱచిరి. ఈయుపాయము మిగుల ననుకూలముగా
నున్నందున కలభాషిణియు మిగుల సంతోషించెను.



## పదునేనవ ప్రకరణము.



మఱునాఁ డుదయకాలమున శూరసేనుఁడును మైత్రే
యుఁడును పడకవిడిచి లేచి మఠమునకుఁ జేరువమార్గమును
గనిపెట్టిరి. గుహావిడిచి కొన్నిగజములదూరము పోయినతోడనే
యామార్గము రెండుగాఁ జీలి యొకటి కుడివైపుగా మఠము
యొక్క సింహద్వారమునకును మఱియొకటి యెడమవైపుగా



మఠముయొక్క వెనుకభాగమునకుఁ బోయెను. కలభాషిణిసేవ
కు లిరువురును వెంబడింప కుడివైపుమార్గమున బయనమై చను
చుండెను. వారుగుహావిడిచి చనునప్పుడు జయచంద్రుఁడు మఠ
మునందుగమనింపవలసిన విషయములను నడువవలసినవిధాన
మును జక్కఁగా బోధించిపంపెను. కలభాషిణి యామార్గ
మునఁ జనునప్పుడందు పెక్కువిచిత్రములు గనుపించుచున్నను
నవి యేవియు నామెకు సంతోషమును గలిగింపలేకున్నవి.
ఆమెహృదయ మింతవఱకు భర్తృవియోగదుఃఖముచే
దహింపఁబడుచున్నది. గుహయందు నిన్న నామె జయచంద్రు
నిదర్శించినది మొదలు భర్తను జూడఁగలననెడియాశ నురల
జనించెగాని తుదకది యెట్లుపరిణమించునో యని యామెమన
స్సు తామరాకులోనినీటిబిందువువలె తల్లడించుచుండెను. సూ
ర్యాస్తమయము సమీపించునప్పటికి సేవకసహితంబుగా కల
భాషిణి మఠముఁ బ్రవేశించెను. మఠముయొక్కసింహద్వార
మునందు పెద్దగంటయొకటి వ్రేలాడఁగట్టఁబడెను. వీరు సింహ
ద్వారము సమీపించినతోడనే యచట కావలియున్న సేవకుఁడు
ఘంటను వాయించెను. ఆఘంటానినదం బాలకించినతోడనే
నల్లనిశరీరచ్ఛాయగలయోగియొకఁడు వెలుపలకు వచ్చి "మీర
లెవ్వరు" అని వారల నడిగెను. తాము మార్గస్థులమనియు
చీకటిపడినందున నందు శయనింపవచ్చితిమనియు నాసేవకు
లలో నొకఁడు బదులు చెప్పెను. అప్పుడాయోగి "చిదానందా"
యని కేకవైచెను. వెంటనే మేఖలావలయులోలకృపాణియై

భటుఁడొకఁడు వచ్చెను. వానిని జూచినతోడనే యోగి “ఓరీ సేవకా! వీరలిరువురకును బరుండఁ దావుఁజూపుము. నే నీమెను లోనికిఁ గొనిపోయెదను” అని చెప్పి యామెను మఠములోనికిఁ గొనిపోయి సైరంధ్రియను వృద్ధవనితకు నొప్పగించెను. సైరంధ్రి యామెను దీపికాసహాయంబున లోనికిఁగొంతదూరముకొనిపోయి సన్నని మెట్లపై కెక్కించి యొకగదియందుఁ బ్రవేశపెట్టెను. ఆగదియందు దీపసమూహంబు చక్కఁగాఁ బ్రకాశించుచుండెను. కలభాషిణి యాగదిఁ బ్రవేశించినప్పుడు దానిని నలుగడలు పరికించి చూడసాగెను. దానిని బరికించినప్పుడు కలభాషిణి స్వాంతమున గొంతప్రమోద ముదయించి “శూరసేనుఁడును మైత్రేయుఁడును జెప్పినగుఱ్ఱు లిందు సరిగాఁ గనిపించుచున్నవి. ఈగోడలకు గవాక్షములేవియు లేవు. ఉపరితటమున నద్దములతోఁ బిగింపఁబడినరంధ్రములు గనిపించుచున్నవి. నానాథుండు బంధింపఁబడినచోటిద్దియే. ఇందుకు సందియము లేదు” అని నిశ్చయాత్మకయై యందుఁ జూపఁబడినమంచె నధిష్ఠించెను. సైరంధ్రి యామెతోఁ గొంతసేపు సంభాషించి వేకువజామున మరల వచ్చెదనని చెప్పి గదివిడిచి వెళ్ళిపోయెను. సైరంధ్రి వెళ్ళినతోడనే కలభాషిణి విచారమానసయై “నా భర్త నాకు మరల లభించునా? లభింపకున్న నేఁజేయువలసిన దేది” యని విచారించుచుండ మంచెప్రక్కనున్న గొయ్యాబల్ల తట్టినట్టు చప్పుడు వినిపించెను. ఆసందడి వినినతోడనే కలభాషిణి భయపడి “ఏదియో దుష్కార్యము సంకల్పింపఁబడిన



యెంచి తత్తరపడుచుండ మరల చప్పుడయ్యెను. అపుడు కలభాషిణి “ఈశ్వరా రక్షింపుము” అని కేకపెట్టి గజగజవడకుచు కన్నులు మూసికొని నిలువఁబడియుండెను. ఆమెకంత స్వరము మిగుల మందమై యున్నను కొంతవఱకు వెలికి వినిపించుచున్నందున “ఔను, ఇదియే మనము తలచినది సరిగా జరిగినది. ఇది యీశ్వరానుగ్రహమే” అనుమాటలు వెలుపలనుండి కలభాషిణికి వినిపించెను. వెంటనే యాబల్లను బెత్తికికొని ముగ్గురుమనుష్యులు లోనికిఁ జనుదెంచిరి. వారిలోనొకఁడు “అమ్మా! కలభాషిణి క్షేమమా?” అని యడిగెను. ఆమె కన్నులు తెఱచిచూచునప్పటికి జయచంద్రుఁడును శూరసేనుఁడును మైత్రేయుఁడును నెదుట గనిపించిరి. అప్పుడామెకు భయముపోయి యపరిమితానందము గలిగెను. శూరసేనుఁడును మైత్రేయుఁడును నాగదిని పరికించి “వెనుక మనము చూచిన గది యిదియే. మనము తలఁచినట్టు సరిగాయీగదిలోనికే ప్రవేశించుటయు కలభాషిణి యిందు విడియించుటయు నీశ్వరానుగ్రహముగాక వేఱొకటి కాదు” అని మెల్లగాఁ జెప్పుకొనుచుండిరి. వీరుమువ్వురును నీగదిప్రవేశించినతోడనే కలభాషిణి తలుపు గొణ్ణెముపెట్టి తానీమఠము ప్రవేశించినతరువాత తటస్థించిన యావద్వృత్తాంతమును బూసగ్రుచ్చినట్లు నివేదించెను. జయచంద్రుఁడును గుహవిడిచినది మొదలు మఠముప్రవేశించునంతవఱకును తాము చేసియున్న ప్రయాణవృత్తాంతము సర్వమును నిట్లు నుడువుచుండెను. “మేము మొదమువైపునను

న్నమార్గము నవలంబించి నడుచుచుంటిమి. అది పోనుపోను మిగులసన్నమయి యొకగుహాయందంతమయ్యెను. అది మిగుల పొడుగును వెడల్పును గలిగి యంధకారబంధురమై యుండెను. ఆగుహాగర్భమునం దేమియుం గనిపించకుండుటచే చేతులుసాచి తడుమనారంభించితిమి. తరువాత నీదారుఫలకములు మాహస్తాగ్రములకు తాకుటయేగాక లోపలసంభాషించుచున్నవారి మాటలు మాకుం గొన్నివినవచ్చుచుండెను. అపుడు మాకర్ణంబులుఫలకములచెంతం జేర్చి జాగ్రతతో వినుచుంటిమి. స్త్రీకంఠస్వరములు రెండు వినవచ్చినవి. అందొకటి నీదుకంఠస్వరమని సంశయముగలిగి కొంతసేపు యోచించి యీదారుఫలకమును చేతులతో తట్టితిమి. అపుడు "ఈశ్వరా రక్షింపుము," అని మరల స్వరమొకటి వినిపించెను. అది స్పష్టముగా వినిపించినందున నీకంఠస్వరమని గుర్తింపంగలిగితిమి. సంశయముతొలంగిన తోడనే యీఫలకము నూడంబెఱుకం బ్రయత్నించితిమి. ఎంత పెఱికినను నది యూడిరాదయ్యెను. తుదకు శూరసేనుఁడు తన బుద్ధిబలముచే లాగ్గివెచి లోనికి మార్గమేర్పఱిచెను. తరువాత మేముమువ్వురము లోనంబ్రవేశించి నిన్నుం జూడంగలిగితిమి." అని నుడివినప్పుడు కలభాషిణికి పట్టరానివిశ్వాసముదయించెను. తరువాత యీమువ్వురును కొంతసేపువిశ్రమించి యలపుతీరిన వెనుక కర్తవ్యమును దమకుందోంచినట్లు యోచింపసాగిరి. అపుడు జయచంద్రుఁడు "శూరసేనా! మనముకార్యమునునడపుటకు



ముందీభైరవమఠముయొక్క గుట్టుమట్టులను జక్కగా కనిపెట్టవలయును." అని విషణ్ణుండై కొంతసేపు క్రిందుజూచుచు "అమ్మా! కలభాషిణి! మేమీకొయ్యబల్లలను సమీపించి నప్పుడు నీతో సంభాషించుచున్నమఱియొక స్త్రీకంఠము వినిపించినది. ఆమె యెవ్వరు?

కల — ఈమఠమునందు పని చేయుచున్నయొకవృద్ధ వనిత. ఆమెపేరు సైరంధ్రి. నేటిరాత్రి నన్నుం బరామర్శించుటకు నియోగింపఁబడినది.

జయ — ఆమె నిన్నుంజూచుట కెప్పుడేతెంచును?

కల — ఆమె వేకువజామున వచ్చెదనని చెప్పి వెడలి పోయెను.

జయ — మఱలవచ్చినప్పుడామెను నిర్బంధించి సర్వము నామెవలన నేనెఱుంగవలయును. కావున నామె నిన్ను జూడ వచ్చినప్పుడామె యీవలకుం బారిపోకుండునట్లు తలుపుగొళ్ళెము పెట్టి "తెల్లవారినదా" యని బిగ్గరగాం బలుకుము. మే మాపలుకును వినినతోడనే మేములేచివచ్చి యామెను బట్టి బంధించెదము. అందువలన కార్యమును నిర్వహింపవీలుకలుగును" అనిచెప్పి మైత్రేయశూరసేనులతో నాగదియందొక్కమూల గొంగళ్లినిపైకప్పుకొని దాగియుండిరి. కలభాషిణి యు నిద్రలేక సైరంధ్రిరాకను నిరీక్షించుచుండెను.

అంతలో నరుణోదయముసమీపించుచున్నందున సైరంధ్రి గది సమీపమునకువచ్చి తలుపుతట్టెను. కలభాషిణి వెంటనే

తలుపుతెఱచి యామె లోపలఁబ్రవేశించినతోడనే తలుపు మరల లోనగొళ్ళెముపెట్టి ద్వారమునకడ్డముగాఁ దాను నిలుచుండెను. అపుడు సైరంధ్రి యామెనుజూచి “ అమ్మా! రాత్రిసుఖముగా నిద్రించితివా ?

కల—నీవింత ప్రీతితో నాదరించుచున్నప్పుడు నాకేల నిదురపట్టకుండును ? నీయాదరణమును మఱచిపోక నాచేతనైనంతవఱకు నిన్ను సంతోషపెట్టెదను.

సైరం—అమ్మా! నీవు సంతోషపెట్టెద వనునాశచే సేవించుటలేదు. నేను నిన్ను సేవించుటకు శ్రీనివాసయోగీంద్రునియాజ్ఞయేకారణము. వానియాజ్ఞ సుగ్రీవాజ్ఞ. దానినించుక మేరమీఱినయెడల యేరికిని బ్రాణములుదక్కవు. వానిపేరుచెప్పిన లోకమంతయు గజగజలాడును. వీనినివిడిచి నేనెచటికైనఁబోవుదమన్నను నాకు వేఱుదిక్కులేదు.

కల—అమ్మా! తెలియక నే నట్లంటిని. క్షమింపుము.

ఇట్లు కొంతసేపు సంభాషించినపిదప కలభాషిణి “ తెల్లవారినదా ” యని బిగ్గరగా నరచెను. ఆమాటవినినతోడనే జయచంద్రుఁడు నొక్కపెట్టున లఘించి మాటాడకుండులాగున నెడమచేతితో సైరంధ్రి నోరుగట్టిగామూసి “ మాటాడితివేని కత్తితోనఱికెద ” నని చెప్పి కుడిచేతితో ఖడ్గమును ఝుళిపించుచుండెను. ఆయుధపాణియై శూరసేనుఁడు జయచంద్రుని యెదుటనిలువఁబడెను. మైత్రేయుఁడు దుడ్డుకఱ్ఱను చేదాల్చి యామెనుదారసించెను. అప్పుడు జయచంద్రుఁడు



“ నోరుతెఱువకుము. మేమడిగిన ప్రశ్నములకు సదుత్తరములనుమాత్రము చెప్పుము. ఇతరులనాకర్షించుటకు నీవు బిగ్గరగా నఱచినను రోదనముచేసినను నీప్రాణంబులు నీకుదక్కనేరవు. నీయుత్తరములయందు కాపట్యముగనిపించినను నిన్ను బ్రతుకనివ్వను. స్త్రీహత్యకైనను సంకోచింపను. రెండుమాసములక్రిందట యీమఠమున నేరినైన చెఱఁబెట్టియుండిరా ?

అపుడు సైరంధ్రి భీతచేతస్కయై యాపాదమస్తకమును గజగజవడఁకుచు నోటమాటరాక స్థాణువువలె నిలువఁబడి వెఱ్ఱివెఱ్ఱిచూపులతో జయచంద్రునిఁ జూచుచుండెను. అప్పుడు జయచంద్రుఁడు “ నీకు భయములేదు. నీవు నిజము చెప్పితివేని నిన్నుహింసింపను. రెండుమాసములక్రిందట యీమఠమున నేగినైన చెఱఁబెట్టియుండిరా ?

సైరం—అయ్యలారా! నిజముచెప్పెదను. నన్నుచంపకరక్షింపుఁడు ,, అని గద్గదస్వరముతో నెమ్మదిగాఁజెప్పెను.

లేశంబైన నపాయంబుగావింపము. నీవిందునెమ్మదిగాఁ గూర్చుండుము. శూరసేనా! నీచేతనున్నయాయుధము క్రిందనుంచుము. పాపమీమె బెదరుచున్నది ,, అని యామెకు కొంతచిత్తస్థైర్యమును గలిగించి “ ఈభైరవమఠమున నేరినైన చెఱఁబెట్టిరా ?

సైరం—రెండుమాసములక్రిందట మనుజునొకనిఁగొని యిందు చెఱఁబెట్టిరి.

జయ—వానిపేరేమి ? ప్రాయమెంత.

సైరం—వానిపేరు నేనెఱుంగను. ఇరువదియైదువత్సరములకన్న వానికెక్కువప్రాయముండదు. నేనువానిని చిదానందమందిరమునకు వెనుకనున్న చెఱయం దొకమాఱు చూచితిని. అతఁడు మిగులసుందరమైనవాఁడు. కాని వానిని నేను చూచినప్పుడు వానిముఖము కొంతవఱకుఁ జెన్నుదరిగియున్నది.

కల—ఆతఁడు నాభర్తయైయుండును.

జయ—ఆతఁ డెందునిమిత్తము చెఱయందుంచఁబడెనో నీవెఱుంగుదువా ?

సైరం—వానిని భైరవస్వామికి బలినఱుకుటకుఁ గొని తెచ్చిరని మారీచుఁడు నాతోఁ జెప్పెను.

జయ—మారీచుఁడెవఁడు ? వాఁడిపు డెచ్చటనున్నవాఁడు?

సైరం—వాఁడు శ్రీనివాసయోగి పరివారజనులలో నొకఁడు. ఆతఁ డీమధ్య యయోధ్యాపురంబుననున్న కాపాలికునకు సందేశమును గొనిపోయినప్పు డచ్చటరాజువల్ల చెఱయందు బంధింపఁబడినట్టు లిచ్చటచెప్పుకొనుచుండిరి.

జయ—కాపాలికుఁడెవ్వఁడు? వానివయస్సెంత ? వాని రూపురేఖాదులెట్టివి.

సైరం—ఆతఁడు శ్రీనివాసయోగికుమారుఁడు. ఆతఁడు ప్రాయమునందును రూపమునందును కొంతవఱకు శ్రీభైరవమఠమునందు బంధింపఁబడిన దురదృష్టవంతుని బోలియుండెను.



జయ—ఈచెఱఁబెట్టఁబడినవానిని నెప్పుడు బలినఱుకుట కుద్దేశించిరి?

సైరం—రేపమావాస్యనాఁటి రాత్రియందు.

కలభాషిణి యీసమాచారమును విన్నతోడనే గుండెలువిూఁదఁగొని హీనస్వరముతో నేడ్చుచు ,, వానిని చెఱఁబెట్టుటయేగాక చంపుటకుసయితము ప్రయత్నించుచుండిరి. ఆహా ! ఎంతదుర్మార్గము.

శూర—ఇదియంతయు వానియాస్తిని హరించుటకు చేసినపన్నుగడ. అచటకృపాసింధునామముతో ప్రవర్తించుచున్నది యీకాపాలికుఁడైయుండు. నాచే చావుదెబ్బలుతిన్న కృపాసింధువు వీఁడే. నేనుచావఁగొట్టి నాచెల్లెలను వివాహము చేసినప్పుడు యీయాస్తి నంతయు వీఁడామెకు వ్రాసియిచ్చెను.

కల—నాయనా ! నాపెనిమిటి బ్రతికివచ్చినఁజాలును. నాకాయాస్తియక్కరలేదు. దానినంతయు నీచెల్లెలికే విడిచిపెట్టెదను.

శూర—అమ్మా ! నేనాయాస్తికొఱకుఁ జెప్పినమాట కాదు. ఈవంచకుని స్థితిగతుల నిర్ధారణచేయుటకు నేనీసంగతిని నుడివియుంటిని.

జయ—ఈమఠమునందు భైరవస్వామి యాలయమున్నమాట సత్యమేనా ?

సైరం—సత్యమే. అదిచిదానందమందిరమునకు సమీపమునన్నున్నది. అందు భైరవస్వామి మిగులభయంకరమైన

రూపముతోఁ గనుపించుచుండు. దానికి నాలుగుచేతులు గల
వు. ఒకచేతియందు ఖడ్గము నొకచేతియందుశూలము నొక
చేతపాశము మఱియొకచేతియందుకపాలము మెఱయుచుండును
పునుకలదండ దానిమెడనిండ నలంకరింపఁబడియున్నది.

జయ—దాని యారాధనావిధానమును నీ వెఱుంగుదువా?

సైరం—దాని నందఱుఁ జూడఁజాలరు. అది మిగుల
భయంకరముగాఁ గనిపించుచుండును. నేనును మొదట దానిని
జూడలేకపోతిని. క్రమక్రమముగా నలవాటుపడియుండుటచే
నాకిపుడంతగా భయములేదు. ప్రతిదినము రక్తవస్త్రములతో
ను, రక్తకుసుమములతోను భైరవస్వామిని బూజింతురు. రక్త
తర్పణముల నర్పింతురు. మద్యమాంసములు నివేదింతురు. ప్రతి
యమావాస్యను రాత్రియందు ప్రాయముగల మంచిజాతి
సౌందర్యపురుషుని గొనితెచ్చి స్వామియెదుట మంత్రములు
జదువుచు బలి నఱుకుదురు. ఆరక్తము భాండమునందుఁ బూరిం
చి నూతనవస్త్రముల నందుదడిపి మడితో నారవేయుదురు.
శ్రీనివాసయోగి యీవస్త్రములను ప్రతిదినము ధరించి భైరవ
స్వామిని నర్చించుచుండును. ప్రతి యమావాస్యయందును
ప్రాఁతవస్త్రములను వర్జించి నూతన రక్తవస్త్రముల దరించు
చుండును. పూజానంతరము భక్తులందఱును మనుష్యపుఱ్ఱెతో
సురాపానముజేసి బ్రహ్మానందపారవశ్యులై క్రిందపడి పొర్లాడు
దురు. ఇది భైరవస్వామి ప్రసాదమౌటచే దానినెవ్వరు దూ
షింపకూడదు.



జయ—శివశివా! వినుటకే అరోచకముగానున్నది. ఈ
మతస్థులు మతమని పేరుపెట్టి యెట్టి దుష్కృత్యములఁ జేయు
చుండిరి." అని తలచి సైరంధ్రినిగాంచి మరల "ఓసీ! ఇందు
బలి నఱుకఁబడుటకు నర్హులెవ్వరు.

సైరం—మంచి ప్రాయముగలవారును, మంచి వంశ
మునఁ బుట్టినవారును, మంచిసౌందర్యముగలవారును నర్హులు.
వృద్ధులు, బాలురు, సన్యాసులు, బైరాగులు, హీనవంశ సం
భూతులును, కురూపులును బలి యివ్వఁబడుటకు నర్హులుగారు.

శూర—బైరాగివేషముతోనున్న నన్నును వృద్ధుఁడైన
మైత్రేయుని వీరలు విడిచిపెట్టుటకిదియే కారణమై యుండ
వచ్చును.

జయ—ఈమతస్థులలో నెవ్వరినైన నీ వెఱుంగుదువా?

సైరం—ఈమతస్థులసంఖ్య వేనవేలు. వీరలనందఱిని
నేనెఱుఁగఁగలను? వంగదేశపురాజగు యుసేనుఁడును మగధ
దేశపురాజగు ప్రతాపరుద్రుఁడును నాకప్పుడప్పుడు పూజా
మందిరమందు గనిపించుచుందురు. అందులో మగధరాజు భైర
వస్వామికి ముఖ్యభక్తుఁడు. శ్రీనివాసయోగి ప్రియశిష్యుఁడు.

జయ—ఈమతస్థుల కందఱకు శ్రీనివాసయోగియేనా
గురువు.

సైరం—అవును. శ్రీనివాసయోగియే! ఆమతస్థులందఱు
ను వీనినిలోకగురువనియు జ్ఞానజనకుఁడనియు చెప్పుచుందురు.

జయ—ఈమతమునందు రక్షకభటు లెందఱుందురు?

సైరం—అయిదువేలకు తక్కువయుండరు. అవసరము తటస్థించినప్పుడు మగధాదిదేశములనుండి వేలకొలఁది సైనికు లిచట విడియింపఁగలరు. ఇందుచేతనే మాయోగీంద్రుని నెదిరింప బ్రహ్మకైన వెఱగందుచుండును.

జయ—వేలకొలఁదిగాదు కోట్లకొలఁది గానిమ్ము. మాకించుకయు భయంబులేదు. మీయోగీంద్రుని ప్రాణంబుల హరింప నేనొక్కరుండఁ జాలుదును. సైరంధ్రీ! నీవు మా కొక్క యుపకారంబుఁ జేయఁగలిగితివేని నీవు కోరినంత ధనము ను నీకిచ్చుటయేగాక నిన్ను యావజ్జీవము పోషించెదము.

సైరం—నేను పట్టి వ్యర్థురాలను. నేను మీకుఁ జేయ గలిగినకార్య మేముండును? నేనొక కూలిదానను. వేఱుదిక్కు లేనందున నేనీ పరమదుర్మార్గులను సేవించుచుంటిని. నేనెందు కును శక్తిఁగలదానను గాను. కావున నేనేమి చేయఁగలను?

జయ—నీవు చేయఁగలిగినది యెక్కుడు ప్రయాసకర మైనపనికాదు. నీవు నిమిత్తకారణమేగాని యాకార్యభారము నీవు వహింప నవసరములేదు. నీవు మాకుఁ గొంతవఱకు తో డ్పడితివేని నిన్ను సర్వవిధముల సుఖపెట్టి యామరణాంతముఁ బోషించెదము. నీవు కుటిలమానసముతో సంచరించుచున్నట్టు మాకించుక యనుమానముగలిగెనేని నిన్నుఁ బ్రాణంబులతో విడిచిపెట్టను.

సైరం—అయ్యా! నేనుమీకుఁ జేయఁగలిగినసహాయ మేది?



జయచం—ఈచెరయందు బంధింపఁబడినమానవుని విడి పింపఁబోవుచుంటిమి. అందుకు నీవు తోడ్పడి నీచేతనైనసహా యము చేసెదవా? నిష్కపటముగా నుడువుము.

సైరం—అయ్యా అది మిగుల యపాయకరము. శ్రీని వాసయోగి పరితాపము మీరెఱుఁగక యిట్లు భ్రమపడుచుం టిరి. ఆతఁడలిగెనేని లోక మల్లాడును. దిశలు తల్లడిల్లును. ఆతఁడీకీలకము నెఱింగెనేని మనలఁ బ్రాణముతో విడిచి పెట్టఁడు.

జయ—నీ కాభయ మెంతమాత్రము నవసరములేదు. నీప్రాణమునకు నాప్రాణ మడ్డమువేసెదను. శ్రీనివాసయోగి పాటు నీకన్నులతో నీవిప్పుడే గాంచెదవు. పాలాక్షుఁడు వానిని రక్షింపనెంచినను వానిని నేను మర్దించెదను. ఆయాలయంబున దాఁగియున్న యాభైరవవిగ్రహముసజీవముతో వానికడ్డుపడినను వానిని నేను విడిచిపెట్టను. నీవుమాత్ర మీచెరయందు బంధింపఁ బడినమానవుని నాకుఁ జూపుము. లేకున్న నిన్నిప్పుడే మట్టు పెట్టెదను. వంచకస్వభావము నీయందించుక కనిపించెనేని నా ఖడ్గమునకు నిన్ను బలిచేసెదను. చక్కగా యోచించుకొనుము.

కలభాషి—అమ్మా! సైరంధ్రి! నీవిందు కెంతమాత్ర ము వెనుదీయకుము. మాతల్లివలె నిన్ను భావించుకొని యతి గౌరవముతో నిన్నుయావజ్జీవముఁ బోషించెదము. కోరినంత ధనము నీకిచ్చెదము. నిన్నుసర్వవిధముల సుఖపెట్టెదను. నిరప రాధుల రక్షించినపుణ్యముసయితము నీకుఁ జేకూరును. ఈకా

ర్యమున కీశ్వరుఁడును సంతసించును. ఇహమునకును పరమునకు
ను నీ కిదియే తారకంబు. నీ విందుకు వెనుదీసినచో నీమాట
నీవు దక్కించుకొనలేకపోవుటయేగాని మహాత్ముఁ డెట్లయినను
కార్యమును సాధింపఁగలఁడు.

అపుడు సైరంధ్రి కొంతసేపు విచారించి ‘‘అయ్యా నే
నిదివఱకే వీనిని విడిచి చనవలెనని ప్రయత్నించుచుంటినిగాని
నాకింతకన్న వేఱు ఆధారమేదియుఁ గనిపించనందున నిచ్చటనే
నిలిచియుంటిని. మీ రేమిచేయుమన్నను హృదయపూర్వకము
గా నొనర్చెదను. మీకు నేను జేయఁగలిగినసహాయము చేసిన
పిదప యిపుడుచేసియున్న వాగ్దత్తము తప్పక చెల్లింపవలయును.

కలభా—దైవముతోడు. నిన్ను మాతల్లిగా నెంచు
కొని నీవు బ్రతికియున్నంతకాలము గౌరవముతోఁ బోషించె
దము. ఇందుకు భగవంతుఁడే సాక్షి.

జయచం—ఈచెరయందు బంధింపఁబడిన మానవుని
మాకుఁజూపఁగలవా?

సైరం—చూపఁగలను. నేను నివసించియున్నగది దీని
యడుగుభాగమున నున్నది. అచ్చటకు నితరులెవ్వరును రానే
రరు. ఈపగలంతయు మీ రందు నిర్భయముగా నుండవచ్చును.
ఎవ్వరైన మిమ్ములనుగూర్చియడిగినయెడల ‘నాయన్నకొమరుఁ’
డని తెలియఁజెప్పెదను. ఈమఠమునందలి మధ్యద్వారము
యొక్క బీగమును నేను సులభముగా సంపాదించఁగలను.
అచట నిద్దరురక్షకభటులుమాత్రమే సదా జాగరూకులై కా



వలకాచుచుందురు. తీవ్రమైనమాధురసప్రయోగమున వారిని
దప్పించుకొనఁగలము. ఆద్వారమును దాఁటినతరువాతనామాన
వుఁడు బంధింపఁబడినచెరసాలను సమీపింపఁగలము.

కూర—ఆవలివైపునకుఁ బెద్దగోడయునుదానిమధ్యమి
గులయున్నతమైన ద్వారమును దానియం దొకచిన్నకంతయుఁ
గలిగి గోపురమువలెఁ గనిపించుచున్నదియేనా చెరసాల.

సైరం—అవును. అదియే చెరసాల. పగటియం దీప్రయ
త్నము వలనుపడదు. రాత్రివఱకు వేచియుండవలయును.

జయ—ఆలస్యమునకు సమ్మతింపనేరము. వెంటనే
యాపని జరిగితీరవలయును.

సైరం—అయ్యా! మీయభిప్రాయము నే నెఱుంగు
దును. నేను మిమ్ముల బయలుపెట్టుటకుఁ బ్రయత్నించుచుంటి
నని మీరు భావించుచుంటిరి. దైవముతోడు. నేనట్టిపాడుపని
నెన్నఁడును జేయనోపను. నేను మీకుఁ దోడ్పడుటకుఁ గారణ
ము కేవలము ద్రవ్యాపేక్షయే గాదు. ఈదుర్మార్గులమధ్య నివ
సించుట కిష్టములేకయే నేనీకార్యమును జేయుట కొడిగట్టుకొం
టిని. పగటియందది మిగుల ప్రమాదకరము.

అపుడు కలభాషిణి జయచంద్రునితో రహస్యముగా
‘‘అయ్యా! నీకీమెను నమ్మవలయును’’అని చెప్పెను. అపుడు
జయచంద్రుఁడు కొంతసేపుయోచించి సైరంధ్రిని గాంచి‘‘నీవు
చెప్పినదానికి నేనంగీకరించినను. నీమె యిచట నుండవీలు లేదు.

ఈమె వెంటనే చనవలయును. తగిన యేర్పాటులను నేను జేసెదను” అని చెప్పెను.

అప్పుడు జయచంద్రుఁడు కలభాషిణిని గాంచి “అమ్మా నీవు నీ సేవకులతో నావలకుఁ జని నిన్న మనమునివసించియున్న గుహాయందు భద్రముగా నిలిచియుండుము. నేఁడు తెల్లవారునప్పటికి తప్పక నీభర్తను గొని తెచ్చి నీకొప్పగించెదను. నీవు సుఖముగా మఠమువిడిచి యావలకుఁ జనిన తెఱఁగు నమ్మికగలుగునట్లు నివేదింపుము” అని చెంగటనున్న వృద్ధవనిత నీక్షించి “సైరంధ్రీ! ఈమెను సుఖముగా మఠమునుదాటింపుము. మఠమువిడిచి సుఖముగానామె యావలఁ బ్రవేశించినట్టునమ్మఁదగినగుఱుతును జూపుము” అని నుడివినతోడనే సైరంధ్రి కలభాషిణిని వెంటఁబెట్టుకొని పోయెను. ఆగదియందమర్పఁబడిన కొయ్యబల్ల నొత్తిగించుకొని మైత్రేయుఁడును శూరసేనుఁడును వెంబడింప జయచంద్రుఁడు గుహాలోనికిజనెను.



## పదునాఱవప్రకరణము.



నాఁటిదినంబంతయు జయచంద్రుఁడును శూరసేనుఁడును నాగృహమందు నిలిచియుండిరి. సైరంధ్రి మోసపుచ్చి తము బయలుపెట్టునని సంశయము గలిగి, కార్యసాధనమునకు వేఱు విధమేదియుండునని యోచించుచుండెను. శూరసేనుఁడు కృపా



ణపాణియై జాగరూకతతో నలుగడలు పరికించుచుండెను. అంతలోఁ జీకటిపడినందున దారుఫలకము నొత్తిగించికొని సైరంధ్రి గుహాలోనికిఁ జనుదెంచెను. అప్పుడు జయచంద్రుఁడు తత్తరపడి ‘ఎవరువారు’ అని గాంభీర్యస్వరంబుతో నడిగెను. అప్పుడావృద్ధవనిత “అయ్యలారా! భయపడకుఁడు. నేను సైరంధ్రిని” అని చెప్పి సన్ననిరాతిపలక నొకదానిని జయచంద్రుని చేతి కిచ్చెను. జయచంద్రుఁడు దానినందుకొని చీఁకటిగానున్నందున ముందుగదిలోనికిఁ జని దీపమువెలుతురున దానినిట్లుచదివెను. “నన్ను సైరంధ్రి సుఖముగా మఠము దాటించెను. ఈమెయందు కపటమించుకయుఁ గనిపించదు. ఈమెను సంశయింపనవసరములేదు. ఇట్లు మీప్రియసోదరి కలభాషిణి” సైరంధ్రీ! నిన్నింతవఱ కనుమానించుచున్నను నిపుడు నాకు నీయందు నమ్మికకలిగినది. మనకార్యము నిపుడు ప్రారంభింపవచ్చునా?

సైర — అనుకూలమైనసమయము సమీపింపఁబోవుచున్నది. కాని శూరసేనుఁడుమాత్ర మిందుండఁదగదు.

ఆతఁడావలిగుహాయందు వేచియుండవచ్చును.

అపుడు శూరసేనుఁడు గుహాలోనికిఁ బోయెను.

జయచంద్రుఁడును సైరంధ్రియు వెంటనే యాగదిని విడిచి మెట్లపైనుండి క్రిందకు దిగుచుండిరి. అపుడు సైరంధ్రి జయచంద్రునితో రహస్యముగా “నడుమనప్పుడు చప్పుడు కానివ్వకుము. ఎవ్వరేమడిగినను బదులుచెప్పకుము” అనిచెప్పి

వానిని నెమ్మదిగా తనగదిలోనికిఁ గొనిపోయి వాని నందు భైరాగివేషముతో నలంకరించి యొకచేతితో మిగుల ఘాటు గలిగిన సారాయమును మఱియొకచేతితో మాంసఖండమును ధరించి జయచంద్రుని వెంటఁబెట్టుకొని నెమ్మదిగాఁ జనుచుండెను. వారి నడ్డుపెట్టువారెవ్వరును లేనందున మొదటియావరణమును వారు సులభముగా దాటఁగలిగిరి. రెండవయావరణము సమీపించునప్పుడు దానిద్వారము బీగముతో బంధింపఁబడియుండెను. వెంటనే సైరంధ్రి తనమొలను వ్రేలుచున్న బీగపుచెవిని పైకిఁ దీసి యాకవాటబంధమును సడలించెను. తరువాత నామె జయచంద్రుని వెంటఁబెటుకొని మూఁడవద్వారము సమీపించుచుండ నచట కావలికాచుచున్న సేవకాయుగళంబు వారల నీక్షించి "ఆవెళ్ళుచున్నవారెవ్వరు? అయ్యో! లోకగురువులా! ఓజ్ఞానపితా! మమ్ముల నాశీర్వదింపుఁడు" అని కేకపెట్టిరి. అపుడు సైరంధ్రి "జ్ఞానపితగాదు. ఇది యొక పాపిష్ఠిజీవము." అని బదులుచెప్పెను. అపుడు వారిలో నొకఁడు "నిన్ను వెంబడించుచున్నవారెవ్వరు" అని మరల ప్రశ్నించెను.

సైరం—ఈతఁడు నామేనల్లుఁడు. నిన్న నన్ను జూడ వచ్చెను. ఈతనికి మాటలుతిన్నగారావు. కొంచెమించుమించుగా మూఁగవాఁడు. మాటసయితము బాగుగా వినిపింపదు. వీఁడు భైరవస్వామిని జూడఁగోరుచున్నవాఁడు. దీని బీగముచెవిని నాకొకమారిమ్ము.



భటుఁడు—ఇపుడు వీలుపడదు. రేపుదయమున నిచ్చెదను.

సైరం—"ఈతఁడు రేపుండఁడు. ఇప్పుడే మఱల యిచ్చెదను" అని చెప్పి తనచేతనున్న సారాయమును మాంసఖండమును వానికర్పించెను. అంత వాఁడు మిగుల సంతసించి తనమొలనున్న తాళముచెవిని విప్పి వానిచేత నునిచెను. వెంటనే యామె తలుపుతెఱచి జయచంద్రుని నావలకుఁ గొనిపోయెను. సైరంధ్రి యాతలుపు తెఱచినతోడనే దుర్గంధము గుప్పున జయచంద్రునిముక్కునకు సోఁకి వికారమును గలిగించెను. వెంటనే జయచంద్రునికి దీపము వెలుతురున కుళ్ళుచున్న మనుష్యమొండెములు శిరములును గనుపించెను. అపుడు సైరంధ్రి "ఇవి భైరవస్వామికి బలినఱకఁబడిన మనుష్యమొండెములు. వీనినింతవఱకు పాతిపెట్టకుండుటచే, కుళ్ళి చెడుకంపు కొట్టుచున్నవి" అని చెప్పుచుండ, సైరంధ్రికి బీగముచెవి నిచ్చిన భటుఁడు పరుగెత్తుకొనివచ్చి జయచంద్రుని గట్టిగాఁ బట్టుకొని "నీవును సారాయమును చవిజూతువుగాని రమ్ము" అని వెనుకకు లాగుచుండ సైరంధ్రి "వద్దు వద్దు. వాఁడు వెఱ్ఱివాఁడు. వానిని బాధపెట్టకుము" అని వానిని వదలించి వానిని వెనుకకుఁ బంపెను. తరువాత వారలిరువురును గొంత దూరమునడిచి యావరణమునుదాటినతోడనే సైరంధ్రి "అదిగో! అకనుపించుచున్నదే చెరసాల. మీరు చెప్పిన మందభాగ్యుఁడు బంధింపఁబడినతావదియే"

నిదుపైన నల్లనివిగ్రహము వారిని సమీపించి "ఆవెళ్ళుచున్న
వారెవ్వరు" అని తీక్ష్ణముగా నడిగెను. అప్పుడు సైరంధ్రి వాని
వంకఁ దేఱిపాఱఁజూచి "లోకగురూ! జ్ఞానజనకా! అపరా
ధమును క్షమింపుము" అని గజగజవడఁకుచు కాలుకదప
నేరక నిలువఁబడెను. అపుడు శ్రీనివాసయోగి వారు చేయుచు
న్నమోసమును గ్రహించి "ఈమోసము చేయుచున్నది
సైరంధ్రియా! ఓసి ద్రోహీ! ఎంతపనిచేయుచుంటివి" అని
పండ్లు పటపట కొఱుకుచుఁ దీవ్రకోపానలంబున గ్రుడ్డులింత
చేసికొని వారలఁ బట్టఁబోవుచుండ, జయచంద్రుఁడు వానిని
నొడిసిపట్టి క్రింద పడవైచి తోడనే వానిఱొమ్ముపై నెక్కి
కూర్చుండి నోటఁ మాటరాకుండునట్లు వానికంఠనాళమును
వామపాదముతో గట్టిగా నడచిపెట్టెను. అప్పుడు శ్రీనివాస
యోగి వానిపట్టు తప్పించుకొననేరక, నోట మాటాడలేక
పోయి దంతములు గట్టిగా బిగియఁబట్టి కన్నులింతచేసుకొని
క్రూరదృష్టితో వాని నీక్షించుచుండెను. అప్పుడు జయచం
ద్రుఁడు మొలయందు దాఁచియుంచిన యాయుధమును బైకిఁ
దీసి వానిచెవిలో మెల్లఁగా "ఓరి లోకకంటకా! మెదిలితివేని
యీకత్తితో గొంతుకోసి చంపివేసెదను. నోరుమూసికొని
చచ్చినట్లు పడియుండుము" అని చెప్పి సైరంధ్రిని బిలిచి
"నీవు భయపడనవసరము లేదు. ఈయావరణ తలుపులను
బిగింపుము" అని నుడివి చేతనున్నవాలును నోటకఱచిపెట్టి
మొలనున్న నూలుపగ్గములను విప్పి శ్రీనివాసయోగి కాళ్ళను



చేతులను గట్టిగా విఱిచికట్టెను. జయచంద్రుఁడు పెద్దయినుప
గుండువలె ఱొమ్ముపైఁ గూర్చునియుండుటయేగాక పాదము
తో వానికంఠమును గట్టిగా త్రొక్కిపెట్టియుంచుటచేఁ దాను
కదలనేరకపోవుటయేగాక భటులనైనఁ బిలువ నోరురాక
యూరకుండెను. సైరంధ్రి జయచంద్రుని బలదర్పంబును ధైర్య
సాహసంబులను గాంచి మిగుల యద్భుతపడుచుండెను. శ్రీని
వాసయోగి యూపిరివిడువనేరక కంఠగతప్రాణుఁడై బాధపడు
చుండుటను జయచంద్రుఁ డీక్షించి కనికరముగలవాఁడై వాని
యెడలఁ గాలుచున్న గైరికాకంచుకమును దుత్తునియలుగాఁ
జేసి యాపేలికలను నోటినిండ దిగఁగుక్కి తాను వానిని
విడిచి లేచెను. కాని, యాతఁడంతటితోనైన తనివినొందక
వానిబంధములఁ జక్కఁగాఁ బరిశోధించి చెంతనున్నగదిలోనికి
వాని నీడ్చుకొనిపోయి పడవైచి "ఇచట కదలక పడియుండు
ము. నీకట్లు విప్పికొనఁ బ్రయత్నించితివేని నిన్ను బలవంతము
గా నఱికి చంపెదను" అని నుడివి తలుపుగొణ్ణెముఁ బెట్టి
సైరంధ్రీసహితంబుగా ముందుకుఁ జనుచుండెను. కొన్నియడు
గులు నడిచినతోడనే మఱల ద్వారమొకటి కనుపించెను.
దానిని దెఱచినతోడనే దీపపుకాంతి చక్కఁగాఁ గనుపించుచుం
డెను. సైరంధ్రి యాదీపమును చేతఁబట్టుకొని నిర్భయముగా
ముందు త్రోవతీయుచుండెను. తరువాత వారు సుడితిరిగియు
న్నమెట్లపై కెక్కి యున్నతమైన భవనమును సమీపించిరి.
ఆభవనము నలుప్రక్కలకమ్ముకొనియున్న కొండలమధ్యను

నతివిచిత్రముగా నిర్మింపఁబడియున్నది. ఆకొండలమధ్య రాతిస్తంభమ్ముల నిలిపిన యినపకమ్ములును కొయ్యబల్లలును బిగింపఁబడియున్నవి. ఆభవనముయొక్క వెనుక గోడకు పెద్దద్వారమును దానియం దొక చిన్నకంతయును నమర్పఁబడియున్నవి. శూరసేనుఁడును మైత్రేయుఁడును నీకంతనుండియే చెఱయందున్నవానిని జూడఁగలిగిరి. దీనినిఁగాంచినప్పుడు దీనినిర్మాణచాతుర్యమునకు జయచంద్రుఁడు మిగులనాశ్చర్యపడఁజొచ్చెను. ఇదిమిగుల యభేద్యమైయుండుటచే దీనియందెట్టిదుర్మార్గకృత్యములు జరుగుచున్నను సహించి యూరకుండవలసియుండెను. శత్రురాజులెవ్వరును దీని నింతవఱకు ముట్టడింపలేకపోయిరి. ఈభవనమున నొకమూల చిన్నచెరసాలయొకటి యేర్పఱుపఁబడియున్నది. పగటియందు దానితలుపు తెరవఁబడియుండును. అప్పు డందుబంధింపఁబడినవారీభవనమునందంతటను తమయిచ్చవచ్చినట్లు మెలఁగుచుందురు. రాత్రులయందుమాత్రమే వారాచెరయందు బంధింపఁబడుచుందురు. జయచంద్రుఁడును సైరంధ్రియు నాచెఱద్వారమును సమీపించినతోడనే దానిని తెఱువఁబ్రయత్నించిరి. అది తాళముతోఁ జక్కగా బిగింపఁబడియున్నందున దానిని దెఱువ వీలులేకుండెను. దానితాళము శ్రీనివాసయోగి స్వయముగా భద్రపఱచియుండుటచే దానిని బగులఁగొట్టుటతప్ప వేఱుసాధనము మఱియొకటి కనుపించదయ్యెను. జయచంద్రుఁడు దానినిఁ బగులఁగొట్టి తలుపు తెఱచెను. అం దిరువదియైదువత్సరములప్రాయముగల పురుషవరుఁ



డు మిగుల శుష్కించి యొకమూల పరుండియుండెను. వాని ముందుఁ గొన్నియాహారపదార్థములు కనుపించుచుండెను. ఆమనుష్యుఁడు జయచంద్రునిఁగాంచినతోడనే యర్ధరాత్రమునందు తన్నెవ్వరో చంపవచ్చుచున్నారని తలఁచి ‘‘పరాత్పరా! నాజీవితము నింతటితో ముగింపుచేయుచుంటివా? నీవేమిచేసినను నాకు సంతోషమే’’ అని చంచలితాంగుఁడై లేచి నిలుచుండెను. అపుడు జయచంద్రుఁడు వానికంఠస్వరమును గుర్తించి ‘‘కృపాసింధూ! కృపాసింధూ! నీ వింకను బ్రతికియుంటివా?’’ అని వానిని గౌఁగిలించుకొని కన్నీరు నింపసాగెను. కృపాసింధువు వానినింకను గుర్తింపనేరక ‘‘అయ్యా! మీరు నాకు పరులుగాఁ గనుపింపరు. పరమమిత్రునివలెఁ దోఁచుచుంటిరి. నన్ను రక్షింపనవతరించిన నాపాలిటి పరమేశ్వరుఁడవని తలఁచుచుంటిని. అపుడు జయచంద్రుఁడు ‘‘ఎవనిని నీవు నీపసితనమునుండి నీప్రాణముకన్న నెక్కుడు ప్రేమతో గౌరవించుచుంటివో ఎవ్వఁడు నీకు విద్యనేర్పి కృతార్థుఁడయ్యెనో, ఎవనిని నీవింతకుపూర్వము భక్తివిశ్వాసములతో నాదరించియుంటివో అట్టి జయచంద్రుఁడీతండు’’ అని నుడివినతోడనే కృపాసింధువు ప్రత్యాలింగనము గావించి ‘‘గురువర్యా! నమస్కారము. దేవరతప్ప నన్ను రక్షింపఁగల సమర్థుఁడెవ్వఁడు’’ అని నుడువ జయచంద్రుఁడు ‘‘ఓయి! ఇది సంభాషింపఁదగిన సమయముగాదు. జాగుచేయక త్వరగా లెమ్ము. మనమీమఠమువిడుచువఱకు మాటలాడకుము.’’ అని కృపాసిందుని వెం

టఁబెట్టుకొని చెఱసాలముఖద్వారమును వెలువడెను. ఆద్వారమునొద్ద సైరంధ్రి దీపమును చేతఁబట్టుకొని యెవ్వరేతెంతురో యనుభీతిచే నెల్లవంక పరిశీలించి చూచుచుండెను. తరువాత సైరంధ్రి చేతనున్నదీపమును మరల యెప్పటిచోట నుంచి జయచంద్రునివెనుక నడుచుచుండెను. జయచంద్రుఁడు శ్రీనివాసయోగి బంధింపఁబడినగది సమీపించినతోడనే యాగదితలుపు తెఱచి యాతఁడెట్లుండెనో యని పరీక్షించి చూచెను. ఆతఁడు బధించిన బంధములన్నియు కొంచెమైనసడలక యథాప్రకారముగా నిలచియున్నవి. అపుడు జయచంద్రునికి జాలిపొడమి "ఓరిదుర్మార్గస్థాపకా! నీవిట్లు కపటోపాయంబున సమయింపఁజూచుట ప్రజ్ఞావంతుల లక్షణముకాదు. కనుక నిన్నిపుడు చంపక ప్రాణములతో విడిచిపెట్టుచుంటిని. సర్వజీవులును నీశ్వరదృష్టికిసమానులు. ఈశ్వరుఁడు సర్వసముఁడు. సర్వజీవులు తమకర్మఫలమునుబట్టి సుఖదుఃఖములననుభవించుచుందురు. నీదుర్మార్గహృదయమే యీవిధముగాఁ బరిణమించి నిన్ను బాధించుచున్నది. నీవింతటితోనైన బుద్ధిఁదెచ్చుకొని నీహృదయమును జక్కఁజేసికొనుము. లేకున్న నదియే నీకనలమై నిన్ను దహించును. నేను వెడలిపోవుచుంటిని. జాగ్రత యని చెప్పి దండెమునవ్రేలుచున్న కావిరంగుగలవస్త్రములను చేతఁబుచ్చుకొని తలుపు మఱల గొళ్లెముపెట్టి యావలకు వెళ్లి నపిదప కృపాసింధును గాంచి "ఓయీ! నీ వీవస్త్రములను నలంకరించుకొని శ్రీనివాసయోగివేషమును ధరింపుము" అని



చెప్పినతోడనే కృపాసింధువటు చేసెను. తరువాత జయచంద్రుఁడు కృపాసింధును సైరంధ్రిని వెంటఁబెట్టుకొని నిరాటంకముగా పెక్కుయావరణలను దాఁటి పీనుఁగులసాల సమీపించిరి. అచ్చట దీపమింకను వెలుఁగుచుండెను. ఆసాలఁగడచినతోడనే సైరంధ్రిచే సారాయమునివ్వఁబడిన యిరువురుభటులు దేహస్మారకముఁ దెలియక క్రిందఁబడి దొర్లాడుచు వీరికిఁ గనిపించిరి. అపుడు సైరంధ్రి యింతకుముందు వారియొద్దపుచ్చుకొనిన బీగముచెవిని వారలకు మఱల నొసఁగకయే వెడలిపోయెను. తరువాత కొంతసేపటికి వీరుమువ్వురును నొక్కగదినిఁ బ్రవేశించిరి. జయచంద్రుఁడు మైత్రియశూరసేనులతో కలభాషిణిని మఠమునందు కలిసికొనినగదియిదియే. దీనిని బ్రవేశించినతోడనే మరల యాకొయ్యబల్లల నొత్తిగించికొని యావల గుహలోనున్న శూరసేనుని గలిసికొనిరి. వారందఱు గుహవిడిచి వెడలిపోయిరి.

## పదునెనిమిదవప్రకరణము

—o—

వీరందఱును గలిసి చనుచుండ జయచంద్రుఁడు కృపాసింధును శూరసేనునకుఁ జూపి "ఓయీ! శూరసేనా! ఈతండు నాకుఁ బ్రాణమిత్రుఁడు. సర్వసద్గుణగరిష్ఠుండు. ఇట్టిపరమయోగ్యుని నాదురాత్ము లెట్లుబాధించిరో చూచితివా?

శూర — నాఁడా పెద్దద్వారమునందలిచిన్నకంతయందు నాకుఁ గనుపించినపురుషపుంగవుం డీతఁడే. మైత్రేయుఁడుసహితము వీరినే జూచియుండును" అని చెప్పినతోడనే కృపాసింధువు శూరసేనునివంకఁ దేఱిపాఱఁ జూచి "అవును. నీవును నాకుఁ గనిపించితివి. మీవంటియుత్తమపురుషుల దర్శించుటచేతనే మాగురువర్యునకు నాదురవస్థ విదితమగుటకు కారణమైనది" అని చెప్పి శూరసేనుని బ్రస్తుతింపసాగెను. తరువాత శూరసేనుఁడు కృపాసింధుతో నిష్టాగోష్ఠిని సంభాషించుచు ప్రసంగవశమున "మీరు సింధురాజకుమారిక కలభాషిణి నెఱుంగుదురా" యని యడిగెను. కృపాసింధువు "ఆమె నాధర్మపత్నియే! ఆమె యిప్పుడెచటనున్నది? ఆమెను నీవెఱుఁగుదువా?

శూర — ఆమెను నే నీమధ్య చూచితిని. ఆమె నిన్నరాత్రి మీరు బంధింపఁబడినమఠమునందే నివసించియున్నది.

కృపాసింధు వీమాటవిన్నతోడనే మిగుల విచారించుచు "అయ్యో! ప్రాణేశ్వరీ! నీవును నీదుర్మార్గులకుఁ జిక్కితివా?" అని మఠమువంకకు పరుగెత్తఁబోవుచుండ శూరసేనుఁడు వానిని బట్టుకొని "మీ రచటికి వెళ్ళనవసరము లేదు. ఆమెను గొన్ని నిమిషములలో మీ రిచటనే చూడఁగలరు" అని వానినోదార్చుచు కలభాషిణియున్నగుహలోనికిఁ గొనివచ్చెను. ఈదంపతులయన్యోన్యసమాగమం బేకకాలంబుననే దుఃఖజనితంబును బ్రమోదదాయకంబునై కనిపించుచుండెను. వారొకరినొకరు వీక్షించునప్పుడు వారలహృదయములయందుఁ బొడసూపుచున్న



భావములను బాహ్యవ్యాపారములును చూపరులకు విచారమును గలిగించుచుండెను. కలభాషిణి మొదట భర్తను గాంచినప్పుడు "నాథా! బ్రతికి వచ్చితిరా" అని మిగుల రోదనముఁ జేయసాగెను. కృపాసింధు వామెను గాంచి కన్నీరుమున్నీరుగా నించుచుండెను. వారివిచారము కొంతయుపశమించినతోడనే తమహృదయంబులఁగల ప్రేమయు ననురాగమును బలుకులయందుఁ గనిపింప పరస్పరక్షేమసమాచారంబుల నుగ్గడింపఁ జొచ్చిరి. వారిమనస్సులకుఁ గొంతవిశ్రాంతి కలిగినతోడనే కలభాషిణి జయచంద్రుని గాంచి "మహానుభావా! నీవు నాకుఁ జేసియున్నమహోపకారమునకు నేఁ జేయఁగలిగినప్రత్యుపకారమేదియుఁ గనుపించదు. సకలధనసమన్వితంబైనయీవసుంధరావలయము తమకు నేను ధారపోయఁగలిగినను నది తమప్రయాసమునకుఁ దగినసత్కారంబు గానేరదని నే నెఱుంగుదును. దేవరవారిపాదారవిందములకు హృదయపూర్వకముగా వందనమర్పించుచున్నదానను. దయతోఁ బరిగ్రహింపుఁడు. నేను బ్రతికియున్నంతవఱకు మిమ్ములఁ గన్నతండ్రివలెను నాపాలిటిభగవంతునివలెను భావించుకొని పూజించుచుండెదను. ఈదీనహృదయను బుత్రికావాత్సల్యమున గృపఁజూచి చల్లగా వర్ధిల్ల నాశీర్వదింపుము" అని తన ప్రేమాతిరేకంబును దేటపడఁ బలికి శూరసేనమైత్రేయులవిశేషముగాఁ బొగడి సన్మానించెను. కృపాసింధువు మాటలచేతను వందనాదికృత్యములచేతను వారలకుఁ దనవిశ్వాసభావమును బ్రకటపఱచెను. కలభాషిణి

యీసమయమున సైరంధ్రిని మఱచియుండలేదు. తనయాభరణములను కొన్నిటి నామె కొసఁగి "నీకు నేఁ జేసినవాగ్దత్తము నెన్నఁడు మఱచిపోను: నీవు బ్రతికియున్నంతవఱకు నిన్ను నాయొద్ద నుంచుకొని సర్వవిధముల నిన్ను బోషించెదను" అని యామెను మిగుల గారవించెను. అంతలో తెల్లవారుచున్నందున వీరంద ఱయోధ్యాపురంబున కరుగుచుండిరి. జయచంద్రుఁడు మార్గమధ్యమున కృపాసింధునిఁ గాంచి "ఓయి! మిత్రమా! నీకొక చెడువార్తను నుడివి మరల నీమనసునకు బాధగలిగింపఁబోవుచుంటిని. ఈమధ్య నయోధ్యాపురంబున నొక్కదుర్మార్గుఁడు నీపేరున నవతరించి నీయాస్తి నంతయు నాక్రమించుకొని దానిని బాడుచేయుచుండెను." అనవుడు కలభాషిణి "అయ్యా! నే నిందు కెంతమాత్రము విచారింపను. నాప్రాణేశ్వరుఁడు మరల ప్రాణములతో వచ్చి నాకంటఁబడుటయే చాలును. ఈదినము లేకపోయినను మేము సుఖజీవనము జేయఁగలము. సింధురాజ్యమునకు మేముతప్ప యితర వారసులెవ్వరును లేరు" అని నుడివినప్పుడు కృపాసింధువు "స్త్రీవిత్త మెంతయధికముగా నున్నను పితృధనముతో సమానము గానేరదు. అయినను కాలవశమున దానికి నాశనము సంభవించునప్పుడు విచారించిన ప్రయోజనములేదు. లోకములోనిజను లీధనముకొఱ కనేకప్రయత్నములఁ జేయుచుండిరి. మిత్రులనుసహితము పరిత్యజించుచుండిరి. ధనముకొఱకు ప్రాణములనైన విడుచుచుండిరి. అభిమానగౌరవముల విసర్జించుచుండిరి. ఎట్టినీచకార్యమునకైన నొడిగట్టుచుండిరి. అసత్యము, అధర్మము, కపటము, మొదలయినదుర్గుణాశ్రయములైన పాపకార్యములకైనను రోయక రేయింబవలు శ్రమపడి విశేషవిత్తము గడించినను తుదకుఁ దామొక్కకాసైన మూటకట్టుకొనిపోవనేరక దానినంతయు నిచ్చటనే విడిచి పరలోకమునకుఁ జనుచుందురు. వారు పోవునప్పుడు దానిని వారు తమసంతానమునకు దాఁచిపెట్టినను నదినిలువనేరక యెగిరిపోవును" అని చెప్పుచుండ మైత్రేయుఁడు జయచంద్రునిఁ గాంచి "స్వామీ! మీరందఱు నిచటనుండియే యయోధ్యాపురంబున కరుగఁజూచుట ధర్మంబుగాదు. మీరందఱు నాగృహంబునకు విచ్చేసి నన్ను ధన్యాత్మునిఁగాఁ జేయవేఁడుచున్నవాఁడను." అని సవినయంబుగా ప్రార్థించి వారల నిజపురంబునకుఁ గొనిపోయెను. వారందఱును మైత్రేయునివల్ల యధికగౌరవముతో సత్కరింపఁబడిరి. కమల తనసౌందర్యముచేతను వినయాదిసద్గుణములచేతను శూరసేనుని హృదయాకర్షణముచేసినందున నాతఁడామె నెట్లయిన వివాహమాడ నభిలషించెను. వానిచిత్తవృత్తి నెఱింగినతోడనే మైత్రేయుఁడు మిగుల సంతోషించి యుద్వాహప్రయత్నంబు గావించుచుండెను. జయచంద్రుఁడును వీరలయనుకూలదాంపత్యమునకు మిగుల సంతసించెను. వివాహమహోత్సవము యథావిధిగా నిర్వర్తింపఁబడెను. వివాహానంతర మాక్రొత్తదంపతుల

ను, కృపాసింధు మొదలయినవారిని వెంటఁబెట్టుకొని జయ
చంద్రుఁడయోధ్యానగరంబున కేతెంచెను.



## పందొమ్మిదవప్రకరణము.



అయోధ్యాపట్టణములో కృపాసింధు భవనమున నొక
గదియం దొకనాఁటి సంధ్యాకాలంబున దీపములు చక్కఁగా
వెలుఁగుచుండెను. అది నిల్వుటద్దములతోను చిత్రపటముల
తోను నలంకరింపఁబడి రమణీయముగాఁ గనుపించుచుండెను.
అందు నలువదివత్సరముల ప్రాయముగల పురుషుఁడొకఁడు
చెంగట నున్న భువనమోహినినిగాంచి “ ఓసీ! కోమలీ!
నీయజమానుని వైభవమంతయు నేఁటితో నంతరించుచున్నది.
అతనిమోసకృత్యమంతయు బయలుపడినది. వానికిఁ బ్రపంచక
ఋణానుబంధము దీరినదని భావించుకొనుము:

భువన—నాయజమానుఁడు వదలిపోవుటయే నాయభి
మతంబు. నాయజమానుఁడు పోయినను మీరు చల్లగానున్నం
తవఱకు నా కేకొఱంతయు వాటిల్లదని నేను దృఢిగానెఱుఁగు
దును.

విటపురుషుఁడు—అతఁడు తనసర్వధనమును నీకు ధార
పోసియుండె నని లోకులు చెప్పుకొనుచుండిరి. కాని నీకావిశ్వా



స మావంతయుఁ గనుపించదు. నీకు మనసుకలసిన ప్రాణమి
త్రుఁడు పోలిశెట్టియేనా ?

భువన—నాయజమానుఁ డీయాస్తినంతయు నాయం
దలిప్రేమచే నిచ్చె నని యెంచుచుంటిరా ? మాయన్న వానిని
చావకొట్టుటచే నీధనమునంతయు నిచ్చివేయవలసివచ్చెను.
ఈతఁడు పరమనీచుఁడు.

విట—పోలిశెట్టి యోగ్యుఁడేనా ?

భువన—ఆయన మంచివిశ్వాసముగలవాఁడు. ఆతఁడు
నమ్మఁదగినవాఁడు.

విట—అందుచేతనా ? నీధనమునంతయు వానికి దాఁచ
నిచ్చితివఁట ?

భువ—అతఁడు దానిని మిగుల వృద్ధిచేయును.

వీరిట్లు సంభాషించుచుండ నెవ్వరో వచ్చి యాగది
తలుపు తట్టిరి. ఆధ్వనిని వినినతోడనే భువనమోహిని యాత
లుపు తెఱచుకొని యావలకు వెళ్ళెను. అప్పుడు పండ్రెండు
వత్సరముల ప్రాయముగలబాలికయొకతె యామెకుఁ గనుపించి
రహస్యముగా “ అవలియింట పోలిశెట్టి నీ రాకను నిరీక్షించు
చుండెను. నీకొఱ కాతఁడు మిగుల తొందరపడుచుండెను.
నిన్నుఁ దీసికొనిరమ్మని నన్ను బుత్తెంచెను. ” అని చెప్పఁగా
భువనమోహిని—ఇపుడు వీలులేదు. నేను కనిపించలేదని
చెప్పుము ” అని చెప్పి యామెను పంపివేసి పనికత్తెను బిలిచి
“ ఓసి! నీవు వీథిద్వారమునొద్దఁ గూర్చుండి నాయజమానుఁడు

వచ్చునప్పుడు నీవు జాగ్రత్తగా కనిపెట్టి వానిరాకను నాకెఱిం
గింపుము" అని చెప్పి మరల గదిలోఁ బ్రవేశించి లోపల
తలుపుగొళ్లెము పెట్టి తల్పంబుఁ జేరఁబోవుచుండ మరల తలుపు
తట్టినట్టు వినిపించెను. ఆమె వెంటనే లేచి తలుపు తెఱచినతోడనే
పనికత్తె "యజమానుఁడు వచ్చుచుండెను" అని నెమ్మది
గాఁ జెప్పెను. భువనమోహిని దానిని వినినతోడనే పల్లవుని
సమీపించి "నా స్నేహమును మఱచిపోకుఁడు. నాకే యపాయ
మును రానీక రక్షింపుఁడు" అని చెప్పి వానిని దొడ్డిత్రోవను
పాణిద్వారమునకుఁ బంపివేసెను. ఈతఁడు పాణిద్వారముదాఁ
టఁబోవుచున్నప్పుడామె యజమానుఁడు సమీపించి వీనిని
నఖశిఖపర్యంత వీక్షించి సింహద్వారము సమీపించెను.
అంతలో భువనమోహిని తనయజమానుని జూడవచ్చెను.
అతఁడు నేఁడు ద్యూతమునందు విశేషధనము గోలుపోయి
నందున కొంతవఱకు మనస్స్థిమితము లేకయుండెను. అతఁడు
పూర్తిగా సురాపానముఁ జేసియున్నందున ప్రపంచకవ్యక్తి
కొంతవఱకుఁ గలిగియున్నను తద్వికారలక్షణములు వానిము
ఖమునందు స్పష్టముగాఁ గనుపించి చూచువారికి భీతిగలిగించు
చుండెను. ఆతఁడు లోపలఁ బ్రవేశించినతోడనే వానినోట
వెడలుచున్న దుర్వాసన యాప్రదేశమంతయు దట్టముగా
నావరించి యెదుటనున్నవారిని మిగుల బాధించుచుండెను.
అపుడు భువనమోహిని యజమానునిఁ గాంచి మీతాగుబో
తుస్నేహితులను విడిచివచ్చుటకు వీలుదొరకెనా యని కేరడ



ములాడఁదొడఁగెను. అపుడీదొంగకృపాసింధునకుఁ బట్టరాని
కోపము గలిగి "నీస్నేహితులతో నింతవఱకు మనసుతీర
వ్యవహరించితివిగదా! ఆ పెరటిద్వారమున ప్రియస్నేహితుని
నింతలో నేలవిడిచిపెట్టితివి? నీ కీచెగసాలాధికారి ప్రాణమి
త్రుఁడని నేనింతవఱకు కనిపెట్టలేకపోతిని.

భువ—మీ కిట్లు నోరుచేసికొనుట స్వాభావికమే.
తాగుబోతులకు మంచిబుద్ధులు రమ్మన్నను రానేరవు.

దొంగకృపాసింధువు—ఓసిగుడిసెవ్రేటుదానా! నోరు
మూసికొనుము. నాధనమునంతయు హరించి చివరకు నన్ను
దూషించుచుంటివా!

భువ—ఓరితాగుబోతా! పేలకుము. ఇంకను నీ
వట్లు నోరుచేసికొనుచుంటివేని నిన్నావల కీడ్పించెదను.

దొంగకృ—భోగముతొత్తా! ఇఁక నీవునాయింట నుండఁ
దగవు. శీఘ్రముగా లేచి పొమ్ము. లేకున్న కత్తెడైతే పొడిచి
వేసెదను.

భువ—ఇంకను నాయిల్లని చెప్పుకొనుచుంటివే? ఆపని
నీకే తటస్థమౌను.

వీరిట్లు పోట్లాడుచుండ పనికత్తె పరుగెత్తుకొనివచ్చి
"స్వామీ! మీనిమిత్తమెవ్వరో వచ్చియుండిరి." అని చెప్ప
దొంగకృపాసింధువు మిగుల కోపముతో "వీలుపడను." అని
ప్రత్యుత్తరమిచ్చెను. పనికత్తె మరల పరుగెత్తుకొనివచ్చి ఆవ
చ్చినది నరంతకుఁడట. అని వక్కాణించినతోడనే యాతఁడు

తెల్లఁబోయి నిలుచుండెను. అపుడు దురంతకుఁడు లోనికి చను
దెంచి "ఓయీ ! కాపాలికా ! మనపనియింతటితో ముగిసినది.
గూటబంధింపఁబడినపిట్ట తప్పించుకొని పాఱిపోయినది. మీతం
డ్రి శ్రీనివాసయోగిపని చావుతప్పి కనులొట్టపోవునట్లు
యినది. దీనికంతకు మాజయచంద్రుఁడే కారణము" అని చెప్పు
చుండ దండనాథుఁడును, చెఱసాలాధ్యక్షుఁడును, రాజభటు
లతో లోనికరుదెంచి దొంగకృపాసింధువుచేతులకు సంకెలలు
తగిల్చిరి. అప్పుడు దురంతకుఁడును భువనమోహినియు పాఱి
పోవుచుండిరి. దండనాథుఁడు "వీరుకూడ నీనేరమునకు సంబం
ధించియుందురు కావున వీరలను విడిచిపెట్టక బంధింపుము" అని
నుడువ కారాగృహాధికారి "ఈమెను బంధించుటకు వీలు
లేదు" అని భువనమోహినిని విడిచిపెట్టి దురంతకునిమాత్ర
ము శృంఖలబద్ధుని గావించెను. ఈయిరువురను రాజభటులు
న్యాయస్థానమునకుఁ గొనిపోవుచుండిరి. ఇంతవఱకు కృపాసింధు
వువేషముననున్న మోసగానిపేరు కాపాలికుఁడు. ఇదిమొదలు
వాఁడు నిజనామముతో పిలువఁబడుచుండును. ఈకాపాలికుఁడు
న్యాయస్థానమునకుఁ గొనిపోఁబడుచున్నప్పుడు పదునెనిమిది
వత్సరములప్రాయము గల యొక్కసుందరాంగి నల్లని మేలి
ముసుఁగును ధరించి కాపాలికుని సమీపించి "ఓప్రియసఖా !
నీవెంతమాత్రము భయపడకుము. మాయన్న వీరవర్మయు
మీతండ్రి శ్రీనివాసయోగియు నీయయోధ్యాపట్టణమునకు
వచ్చియుండిరి" అని నెమ్మదిగాఁ జెప్పి వెళ్ళిపోయెను. కాపా



లికుఁడును కొంతధైర్యము నవలంబించి రాజభటులవెంటఁ జను
చుండెను. న్యాయసభయంతయు పురజనులతో నిండి క్రిక్కిరిసి
యుండెను. సుదర్శనుఁడు సింహాసనాసీనుఁడై సభాభవనము
నలంకరించెను. వానిప్రక్కను జయచంద్రుఁడున్నతాసనంబు
నధిష్ఠించెను. ఒకవంక కృపాసింధువు శూరసేనుఁడు మైత్రే
యుఁడును నుచితాసనంబుల నాసీనులైయుండిరి. సైరంధ్రి
యొకప్రక్క నిలుచుండెను. సింహాసనమునకు ముందుభాగ
మున రాజసభికులును రాజకార్యతంత్రజ్ఞులును గూర్చుని
యుండిరి. రాజభటులు కాపాలికదురంతకులను మూకిచుని
సంకెలలతో రాజునెదుట నిలువఁబెట్టిరి. ఈనేరస్థుల కిరువైపు
లను వరదూసినఖడ్గములం దాల్చి రక్షకభటులు నిలుచుండిరి.
ఇంతవఱకు కాపాలికుని కృపాసింధువని భావించుచున్న ప్రజా
నీకంబంతయు నిజమైనకృపాసింధువును గాంచి యద్భుతపడు
చుండిరి. ఆసభాభవనమున నొక్కమూల సుందరియొక్కతె
నల్లనిమేలిముసుఁగును ధరించి యొదిగియుండెను. ఆమెబట్ట
కట్టునుబట్టి యామె వంగదేశపుస్త్రీ యని భావింపఁదగి
యుండెను. అపుడు సుదర్శనుఁడు కృపాసింధును గాంచి "ఓయీ
నీవీనేరస్థులపై నారోపించియున్న నేరమును ఋజువుచేయుము."
అని నుడివినతోడనే కృపాసింధువు "ఓరాజచంద్రమా !
మాతండ్రి ధనపాలుఁడు వ్యాధిబాధితుఁడైయున్నప్పుడు చరస్థిర
రూపకమైన యావదాస్తిని దేవరకు వశపఱచి చనిపోయెను.
ఆయన చనిపోయినపిదప వానియస్తికలు కాశీకాపురంబునకుఁ

గొనిపోయి గంగాప్రవాహమున బడవైచి కృతస్నానుండనై యానదీతటంబున పితృకర్మ యథావిధిగా నెరవేర్చుచుంటిని. ఆసమయంబున రాజపుంగవుండొకఁడుస్నానార్థ మానదీకూలంబున కేతెంచి నన్ను బొడగాంచెను. నన్ను గాంచినప్పు డతని కపరిమితవాత్సల్య ముదయించి నన్ను దన విడిదెకుఁ గొనిపోవ ప్రయత్నించెను. నేను పరదేశి నగుటచే వానిసత్కారము నంగీకరించివానిగీమున కేతెంచితిని. ఆతఁడు నన్ను సర్వవిధముల నాదరించెను. మాయిరువురియందును నన్యోన్యప్రేమ మతిశయించెను. తనపేరు రత్నకేతుఁడనియు తాను సింధుదేశాధిపతిననియు నాకుఁ దెలియఁజేసి నన్ను నిజదేశంబునకుఁ గొనిపోయి నిజతనూజాత యగుకలభాషిణికి నన్నుఁ జూపెను. ఆమె నన్ను గాంచినతోడనే నాయందపరిమితమోహము గలిగి నన్ను వివాహమాడఁగోరెను. ఆమెసౌందర్యము చిత్తరంజకముగ కనిపించియున్నందున నామెపాణిగ్రహణమునకు నేను సంతసించితిని. శుభదినంబున మాయిరువురకును పరిణయమహోత్సవము యథావిధిగా జరుపఁబడెను. నా కింకను నుత్తరదేశమునందలిపుణ్యభూములఁ జూడవేడుక కలిగియున్నందున నష్టమదినంబున మరల వచ్చెదనని చెప్పి బదరీనారాయణంబున కేతెంచితిని. అచట నాకు శ్రీనివాసయోగి కనిపించి నీయూరుపేరేమని నన్నడిగెను. మాదయోధ్యాపురంబని బదులు చెప్పితిని. అపుడాయోగి "నిన్ను నేనెఱుంగుదును. నీపేరు కృపాసింధువు. నీవు ధనపాలకుమారుఁడవు" అని చెప్పి తలపంకించి వెళ్లి



పోయెను. తరువాత తుండువంటినలుగురునల్లనిమనుష్యులు నన్ను వెంబడింపఁజొచ్చిరి. నేనొక్కరోజున హిమాచలప్రాంతంబున గుర్రమెక్కుచుండ వెనుకపాటున వచ్చి యాకస్మికముగా నన్ను బట్టుకొని కన్నులుగట్టి మోసికొనిపోయి యొకచెరసాలయందుఁ బడవైచిరి. తరువాత కొంతసేపటికి నాకన్నులు విప్పిరి. నేను కన్నులువిప్పి చూచునప్పటికి నన్నంతకుపూర్వము వెంబడించియున్న నలుగురుమనుష్యులును శ్రీనివాసయోగియు నాకచట కనుపించిరి. అపుడు శ్రీనివాసయోగి "అయోధ్యాపురంబున నన్నును భైరవస్వామిని నేమనిదూషించితివి? నీపాపఫల మనుభవింతువులే." యని నాకు మురికిబట్టల కట్టనిచ్చి నావస్త్రములను కాగితమును లాగికొని నన్ను బంధించిరి. బదరీనారాయణమునుండియు నన్ను వెంబడించినవారిలో నీయిరువురునేరస్థులను నేను జూచియుంటిని" యనిసంకెలలతో నెదుట నిలువఁబడియున్నమారీచుని దురంతకుని వ్రేలుతోఁ జూపెను. నావద్ద హరించినకాగిదములనుబట్టి తాను కృపాసింధువునని దేవరయెదుటబుజువుచేసి దుర్మార్గుఁడొకఁడు నాయాస్తినంతయు నాక్రమించుకొని పాడుచేసినసంగతి తమకే విదితము. నేను చెరయందు బంధింపఁబడినకాలమున నెలదినములక్రిందట మైత్రేయుఁడును, పక్షముక్రిందట శూరసేనుఁడును నాకుఁ గనిపించిరి.

తరువాత మైత్రేయుఁడును, శూరసేనుఁడును తాము చూచినసర్వవిషయములను నివేదించిరి. సైరంధ్రియు నచట

జరిగినవిషయమును దానెఱిగినంతవఱకుఁ దెలియఁజేసెను. శూరసేనమైత్రేయులు నివేదించినవిషయమునే జయచంద్రుఁడు పయితము శ్రుతపఱచెను. ఇంతలో సాయంసమయము సమీపించియున్నందున నాఁటికి విచారణను ముగించి యానేరస్థులు మువ్వురిని చెరసాలాధ్యక్షునివశపఱచెను. వెంటనే వారలు చెరసాలయందు మరల బంధింపఁబడిరి. విచారణ ముగిసినతోడనే యందున్నవారందఱును నా న్యాయవిచారణాస్థలమును విడిచి వెళ్లిపోయిరిగాని నల్లనిమేలిముసుఁగును ధరించి మూల నిలువఁబడియున్న వంగదేశపుస్త్రీమాత్రము చీఁకటిపడువఱకును నాస్థానమును విడువకుండెను. చీఁకటిపడినతోడనే యాసుందరి మందయానముతో బయలువెడలి నగరుచెఱసాల సమీపించెను. చెఱసాలాధికారి దేవళుఁడామెను గాంచి యామెయూరును పేరును దెలియఁగోరెను. ఆసుందరి తనమేలిముసుఁగును సడలించి తనసౌందర్యవైభవంబు కొంతవఱకు బయలుపఱచి వానితో సంభాషింపఁజొచ్చెను. కాని యాప్రదేశము వారిసంభాషణకు ననుకూలంబుగా నుండనందున వారిరువురు నాతావును విడిచి కోటసమీపమున నున్నపాడుదేవళంబున కేతెంచిరి. అది నిర్జనప్రదేశమై యుండుటచే వారుగొంకువీడి గర్భాలయమును బ్రవేశించిరి. అచట వారివ్యాపారమునకుఁ బ్రతిబంధకము గనిపించనందున వారు మిగుల సంతోషించుచు నిర్భయముగా కొంతసేపు సంభాషించి వెళ్లిపోయిరి. వీరం దొరు లెవ్వరును లేరనితలంచిరే



గాని వీరిప్రక్కనే గృహస్థుఁడొకఁడు పరుండి వీరివ్యాపారమును సంభాషణావిషయములను జక్కఁగాఁ గనిపెట్టెను. పాపమాగృహస్థు వీరలవృత్తాంతమును గాంచినతోడనే వానివిచారము మఱింత యతిశయించి దుఃఖితాత్ముఁడై "ఈపాడుముండను వివాహమాడి నే నెంతబాధపడుచుంటిని! దీనిపొందు నాకుదిన దినగండముగా నుండి ప్రతినిమిషమందును ప్రాణోపద్రవమును గలిగించుచుండెను. నన్నుజంపనెంచి యీమె యీమధ్య నాకు విషప్రయోగముసయితముఁ జేసియుండెను. నా కింకనుభూమిపై నన్నోదకంబులు ప్రాప్తముండుటచే వలలుఁడు నన్ను కాపాడి యావిషమును నామెప్రియమిత్రుఁడైనవిదూషకునకుఁ బ్రయోగించెను. నేను మానాభిమానములవిడనాడి దీనితో నింకను కాపురముచేయుచుంటిని. దీనిపైరూపమును జూచి వివాహమాడిన పాపఫలమనుభవించుచుంటిని. 'భార్యారూపవతీశత్రుః' అని పెద్దలు చెప్పినవిషయము నాకనుభవమైనది. వీరిది రాజవంశమఁట! ఈనీచప్రవర్తన చండాలురయందైన గనిపించదు. ఈపాపిష్ఠిముండ నాకన్నులయెదుట నెంతపనిచేసినది! ఛీ! దీనితో సంసారముఁజేయక సన్యసించెదను," అని నిశ్చయించుకొని మరల "ఇందువలన నేమిప్రయోజనము. కోపగించి సన్యసించుటవలన లాభమేమి? దీని నెట్లయిన సాధించుటయే మగతనంబు," అని నిశ్చయించుకొని గర్భగుడి విడిచి వెళ్లిపోయెను.

## ఇరువదియవప్రకరణము.

---o---

నిన్న రాత్రి తెల్లవారినవఱకును యోధ్యాపట్టణనివాసులు కృపాసింధుని గూర్చియు కాపాలికునిగూర్చియు సంభాషించుటకు వలయునంత సావకాశమును గలిగి యుండిరి. ఆమరునాఁ డరుణోదయంబున పడకవిడిచి లేచునప్పుడు సుదర్శనుఁడు నిజతల్పసమీపంబున జంబీరఫలాలంకృతం బైనత్రిశూలంబును దానిని వ్రేలాడుచున్న కాగితమును గాంచి చంచలితహృదయుఁడై దానిని సమీపించి యిట్లు చదువఁదొడంగెను "ఈ విషయమున నీవు ప్రవేశించితివేని నీప్రాణంబులు నీకు దక్కవు. ఇది భైరవాజ్ఞ" అనిచదువుకొనియేమిచేయుటకునుదోఁచక విచారించుచుండ, దౌవారికుఁడరుదెంచి "దేవా! ప్రభువురాక నిరీక్షించి దేవళుఁడు సభాభవనమున వేచి యున్నవాఁడ," ని నుడివినతోడనే సుదర్శనుఁడు సభాభవనమునకు విచ్చేసెను. అపుడు దేవళుఁడు మొగ మింతచేసికొని "మహారాజా! కారాగృహమునందు బంధింపఁబడినయపరాధులు మువ్వురును పాఱిపోయిరి. ముద్రలును తాళములును వేసినవివేసినట్లుండెను" అని నివేదించుచుండ మఱియొకభటుఁ డేతెంచి "స్వామీ! మణిభద్రు నెవ్వరో చంపి వానిశవమును రుద్రభూమిలోఁబారవైచిరి" అని చెప్ప సుదర్శనుఁడు నిర్ఘాంతపడి చూచుచుండెను. అపుడు మఱికొందఱురాజభటులు పౌరజనంబులతో



నేతెంచి "సుదర్శనమహారాజా! ఇరువదియైదుసంవత్సరముల క్రిందట విష్వక్సేన సార్వభౌమునిజననకాలమున వానితల్లికి విషప్రయోగముఁ జేసినయపరాధమునకు నురితీయఁబడినవిరూపాక్షుఁ డనురాజవైద్యుఁడు మరల ప్రాణముతోనీసభాభవనమునకుఁ గొంతదూరమున మాకుఁ గనిపించెను," అని చెప్పెను. అపుడు సుదర్శనునకుఁ గొంతమతిపోయి పిచ్చివానివలె పరిభ్రమింపసాగెను. పట్టణమంతయు మహాకల్లోలముగా నుండెను. ఏవంకఁజూచినను నీప్రసంగమే; ఏయింటఁజూచినను నీకలవరమే; ఈసంక్షోభమే పట్టణమంతయు వ్యాపించి జనులమనంబుల కలంచుచున్నది. ఈభైరవమత మింతటితో నశింపదనియు నీమతస్థులదౌష్ట్యమే యీయనర్థముల కన్నిటికిని మూలకారణమనియు సాధుసంతాప మింకను ప్రబలుననియు జనులు భయపడుచుండిరి. నేఁటివృత్తాంతము లన్నియు జయచంద్రునికిఁ దెలియఁజేయఁబడినవి. ఈవర్తమానములను వినినతోడనే జయచంద్రుఁడు సుదర్శనుని వెంటఁబెట్టుకొని శూరసేనునితో కారాగృహంబున కరుగుదెంచి దానిని విమర్శింపసాగెను. తలుపులును తాళములు యథాప్రకారముగా వేసినవి వేసినట్లుండెను. గవాక్షముయొక్క యినుపకమ్ములుమాత్రము సడలియున్నవి. జయచంద్రుఁడు దీనిని జూచినతోడనే దేవళు నీక్షించి "ఓయి నీవశముననున్న యపరాధు లెట్లుపాఱిపోయినను నీవు దానికి బాధ్యుఁడవై యుండువలె నెఱుంగుము. ఎనిమిదిరోజులలో నానేరస్థులను బట్టి యొప్పగింపవేని నీకు మరణదండనము విధిం

చెదము" అని నుడివి వానిని కారాగృహమునందు బంధింప
నుత్తరువిచ్చెను. అపుడు దేవళుఁడు గజగజ వణఁకుచు "స్వా
మీ! నేను నిరపరాధిని. నన్ను విడిచిపెట్టుఁడు. గడువుదిన
ములలో వారల నెల్లయినఁ బట్టియొప్పగించెదను." అని దీన
త్వముతో వేడుకొన జయచంద్రుఁడు దయార్ద్రహృదయుఁడై
వానివలన దగినంతనమ్మకమును దీసికొని యపరాధుల వెదుకఁ
బంపెను. ఈయపరాధులందఱు భైరవమఠమున దాగియుండు
రనుతలంపున జయచంద్రుఁడు మణిభద్రుని స్థానమున శూరసేను
నికి సైన్యాధిపత్యంబు నిప్పించి భైరవమఠమును ముట్టడింప
చతురంగబలంబులతో వానిని బుత్తెంచెను.

తరువాత జయచంద్రుఁడు నిజమందిరంబు ప్రవేశించి
రాజకార్యతంత్రజ్ఞులతో నీదుర్మార్గుల సాధించఁదగిన యుపాయ
మును నాలోచించుచుండెను. అంతలో సేవకుఁ డొకఁడరుదెంచి
"స్వామి! సుందరేశుఁడఁట! వంగదేశస్థుఁడఁట! దేవరనుదర్శింప
ద్వారమునొద్ద నిరీక్షించియుండెను. సెలవైనలోనికిఁగొని తెచ్చెద"
అనవుడు జయచంద్రుఁ డంగీకారసూచకంబుగాఁ దలయూఁచి
నందున నాసేవకుఁడు వానిని లోనికిఁగొని తెచ్చి జయచంద్రు
నెదుట నిలిపెను. జయచంద్రుఁడు సాదరాహ్లాదనిరీక్షణంబుల
వాని నీక్షించి "రండు. కూర్చుండుఁ"డని వానిని గౌరవించెను.
అపుడు సుందరేశుఁడు జయచంద్రుని గాంచి "అయ్యా!
ఇపుడు నేను నుడువఁబోవుచున్న విషయము మిగుల శోచనీయ
మైనందున దాని నీమాననీయులసమక్షమున విన్నవించుటకు



సిగ్గుపడుచుంటిని." అని నుడివినతోడనే జయచంద్రుఁడు
వాని నొకయేకాంతప్రదేశమునకుఁ గొనిపోయి సమాచార
మును వినఁగోరెను. అపుడు సుందరేశుఁడు "చెరనుండి యప
రాధులను విడిపించినదుర్మార్గులు వంగదేశస్థులు. వారందఱు
కటకపురనివాసులు. వంగదేశమును పరిపాలించుచున్న యుగ్రసే
నుఁడు వీరికందఱకును మూలకారకుఁడు. అతఁడు శ్రీనివాస
యోగి ముఖ్యశిష్యుఁడు. ప్రతాపరుద్రుని ప్రియమిత్రుఁడు
భైరవమతావలంబకుఁడు. వీనికి చిత్రాంగి యనుకూఁతురును
వీరవర్మ యనుకుమారుఁడు గలరు. చిత్రాంగిని నేను వైవా
హికంబయితిని. వీరిబాంధవ్యమును జెల్లడించుటకు సిగ్గుపడు
చుంటిని. లోకములోనిపాపమంతయు వీరలరూపమున మూర్తీభ
వించి ఈవిధముగా దేశము నుక్షోభింపఁజేయుచున్నది. వీరు
చేయుచున్న నరహత్యలకు మేర లేదు. ఆదేశమునందు వీరు
చేయుచున్న దుష్కృత్యము లసంఖ్యములు. వీరలతి దుర్మా
ర్గులగుటచే వీరిబాంధవ్యాభిమానమును నేను విడిచిపెట్టితిని.
నాభార్యయైన చిత్రాంగికిని చెరసాలాధ్యక్షుఁడగు దేవళునకి
నిన్నటిరేయి స్నేహసంబంధముఁగలిగినందున దేవళుఁడయ్య
పరాధులను బుద్ధిపూర్వకముగా విడిచియుండెను. ఊరివెలుపల
నున్నపాడుదేవళంబున వీరలిరువురును సంభాషించిన సంభాషణ
మును నే నీచెవులతో వినియుంటిని. కటకపురమునకు విచ్చేసిన
యెడల వీరల దుర్నయమంతయు దేవరకు బోధపడఁగలదు.
భైరవమతదౌష్ట్యమునుండి లోకమునుద్ధరింపఁదలఁచితి రేని ముందు

వీరల గీటడంచుట కర్తవ్యము. పైకి వారలతో మెలగుచున్నను రహస్యమున మీకు వలయునంత సహాయము జేయఁగలను. అని నుడువ జయచంద్రుఁడు "సన్మార్గము నడచిపెట్టుటయే పరమధర్మము. కాని యది ప్రయాసమునగాని లభింపనేరదు. అయినను చేతనైనంతవఱకుఁ బ్రయత్నించెదను. దేవళుఁడెంత దుర్మార్గుఁడు. ఉశేనుఁడారాజకుటుంబములోనివాఁడయ్యును నిట్టినీచకార్యముల కేల యొడిగట్టుచుండెను ?" అని యాశ్చర్యపడుచుండ సుందరేశుఁడు "అయ్యా! ఈతనిది రాజకుటుంబమని యోచింపకుఁడు. ఈతఁడు హీనవంశసంభూతుఁడని యొకరిద్దరినోటనుండి రహస్యముగావింటిని. కాలకర్మదోషమున నాకీపాపిష్ఠిసంబంధము సంభవించి పెక్కుకష్టములఁ గుందుచుంటిని. నాదురవస్థ నేనేమని విన్నవింతును. సిగ్గువిడిచి దీనినంతయు మీకు విశదపఱచితిని" అని కన్నీరులింపుచుండ జయచంద్రుఁడు వానినోదార్చి "నేను రెండుమూఁడుదినంబులలో నచటికే తెంచి మీకు నాచేతనైన సహాయముచేసెదను. మీరు చనుఁడు" అని వానిని మిగులనాదరముతోఁ బంపివేసెను. ఇంతలో సంధ్యాసమయము సమీపించినందున జయచంద్రుఁడు కాలకృత్యములనిర్వర్తించి నిజసభాభవనంబున నాప్తవర్గంబుతో నుశేనరాజు దుర్ణయంబును బ్రశంసించుచుండెను. అపుడు వృద్ధసేవకుఁ డొకఁడు "స్వామీ! ఈయుశేనుఁడు నిజమైన రాజకుటుంబములోని వాఁడుగాఁడని జనులు చెప్పుకొనుచుందురు. వంగదేశమును బరిపాలించిన జయద్రథు



నకు నిజసంతానము లేదు. అతఁడు దాసియందు తనకు జన్మించిన యీయుశేనుని పెంచిపెద్దవానినిచేసి మరణకాలమున వీనిని రాజ్యాభిషిక్తునిఁగా నొనర్చెను. గొప్పయింట పెరిగినను గొప్పపదవిలభించినను నట్టియోగ్యతలు వీనినెంతమాత్రము నంటక నీచవర్తనమును దుర్మార్గాచరణమును వీరికొక్కరికి మాత్రమేగాక వీరికుటుంబమునకంతకును జక్కఁగా పట్టువడి యీక్రూరత్వమునందును పురాణములలో వర్ణింపఁబడినదానవనాయకులనయితము నతిశయించి లోకమునకు చెప్పరాని యనర్థమును గలిగించుచుండిరి. వీనికుమార్తె చిత్రాంగి, వీనికుమారుఁడు వీరవర్మయు చేయుచున్న మారణకృత్యంబులకుఁ బరిమితి లేదు. చిత్రాంగి హృదయమున నావహించియున్న కామవికారంబును నిర్దయత్వంబును జగత్ప్రసిద్ధమైనందున నామెనామోచ్చారణమాత్రంబుననే లోకములోని యుత్తమకాంతలందఱు తలవంచుకొని లజ్జించుచుందురు. వీరందఱు భైరవమతమునందు పూర్ణాభిమానముగలవారు. శ్రీనివాసయోగి శిష్యవర్గములోనివాఁడు. వీరిపాలమున నాదేశవాసులనుభవించుచున్న బాధయిట్టిదట్టిదని నుడువవీలులేనిది. ఈయుశేనుఁ డమితబలపరాక్రమశాలి. శమనుఁడైన వీనియాటోపంబునకుఁ జంకుచుండును. వీని బోరనెదిరింపఁదగినవా రింతవఱకుఁ గనుపింపరు. ఈతఁడు ప్రతాపరుద్రునిప్రాణమిత్రుఁడు." అని నుడువుచుండ వీథిద్వారము నొద్దనెవ్వరో "అయ్యో! చచ్చితి చచ్చితి" నని బిగ్గరగా నఱచి రోదనముచేయసాగెను. జయ

చంద్రుఁ డాకేకవినినతోడనే యాప్తవర్గంబుతో దిగ్గునలేచి సింహద్వారమునొద్ద కేతెంచెను. కటికిచీఁకటి దట్టముగా నావరించియుండుటచే సేవకుఁడు దీపమును గొనితెచ్చెను. పదునెనిమిదివత్సరముల ప్రాయముగల స్త్రీయొకతె క్రిందపడి తన్నుకొనుచుండెను. ఆమె చీరచెఱఁగు రక్తముచేఁదడిసి ధూళిలోఁబొరలుచుండెను. జయచంద్రుఁ డామెను చూచినతోడనే మిగుల జాలిపడి సేవకునిచే నామెను లేవనెత్తించి లోన చిన్నమంచముపై పరుండపెట్టించెను. ఆమెను పరిశోధించి చూచినప్పుడామె కుడిభుజముపై కత్తివ్రేటుచేగాయముపడి రక్తము సంతతధారగా ప్రవహించుచుండెను. దీపపుకాంతిని నామెముఖము చక్కఁగఁగనుపించినందున నామె భువనమోహినియని గ్రహించి జయచంద్రుఁడు శస్త్రవైద్యుని రప్పించి యామెగాయమునకుఁ దగినచికిత్సఁ జేయుచుండెను. అపుడు భువనమోహినికిఁ గొంతశరీరస్మారకము తెలిసి కన్నులువిచ్చి చూడసాగెను. జయచంద్రుని ముఖమామెకుఁ గనిపించినతోడనే సిగ్గుచేఁ దలవంచుకొని వెక్కి-వెక్కి యేడువసాగెను. ఆమె గాయము మిగులబాధగానుండుటచే నామె యేడ్చుచున్నదని భావించి నీకుఁ బ్రాణభయములేదు. విచారింపకుము,, అనిజయచంద్రుఁడామెనోదార్పఁదొడఁగెను.

భువన——నన్ను గాయమంతగా బాధించుటలేదు. మీముఖము జూచినతోడనే మీయెడల నేనుజేసియున్న మహాపరాధము స్ఫురించి నాహృదయమును దహించుచున్నది.



మీముఖము నేను జూడఁజాలను'' అని చీరచెఱఁగు ముఖమునకడ్డముపెట్టుకొని యేడువసాగెను. అపుడు జయచంద్రుఁడు నాయెడల నీవు యేమియపరాధము జేసితివి? ఒకవేళ నీవుదేనినైన జేసినను నీవుదానిని జ్ఞప్తికిదెచ్చుకొని మనస్సును బాధపెట్టుకొనకుము.

భువన——అయ్యా! బ్రతుకన్నను ప్రపంచకమన్నను నాకిష్టములేదు.

జయ——గాయమువలననే నీకీవిరాగముగలిగియుండును. బాధగలిగినప్పుడుగాని వైరాగ్య ముదయింపదు.

భువన——ఈగాయముకన్నను నేనుజేసియున్న పాపకృత్యమే నన్ను మిగుల వేధించుచున్నది. మీముఖముచూచినప్పుడెల్ల నాకది స్మరణకువచ్చి యగ్నిహోత్రముకన్నను నెక్కువగా నన్ను దహించుచున్నది. ఈశ్వరా! నే నీమనోపరితాపమును భరింపఁజాలను. నన్నెట్లయిన నీలోకమునుండి కొనిపొమ్ము. నే జేసినపాపకృత్యమునకు నన్ను శిక్షించి నాహృదయమునకుఁ బావనత్వమును గలిగింపుము'' అని హోరున నేడువసాగెను. అపుడు జయచంద్రుఁడు ‘‘నీవట్లేడ్చుటకేమి కష్టమువచ్చినది. నీవపరిమితధనమునుగడించి సర్వసుఖములను ననుభవించుచుంటివని వినియుంటిని.

భువన——అయ్యా! తమరట్లు భావించుచుంటిరేగాని నేనెంతధనము సంపాదించినను నాయొద్ద రాగిపైసలేదు. ఇపుడు

నాకు తినుటకన్నమైనను లేదు. నేను దాచనిచ్చిన నాధనమం
తయు నాప్రియస్నేహితుఁడు పోలిశెట్టి హరించెను. మిగిలియు
న్నధనమునంతయు తస్కరులు హరించిరి రోగములచే శరీరపాట
వము తగ్గినదిమొదలు నాప్రియమిత్రులెవ్వరును నన్నుకన్నె
త్తి చూడకుండిరి. నాయవస్థ యేమని చెప్పను? నాకీవేశ్యావృత్తి
మొదట సుఖకరముగా కనుపడినను నిపుడు దానిదోషము
నాకుఁగనిపించినది. ఆసుఖమంతయు తుదకిపుడు దుఃఖముగా
పరిణమించినది.

ఆహా నేనెన్ని సంసారముల పాడుచేసితిని! ఎందఱిని నీతి
మార్గమునుండి తొలగించితిని! నేనీపాడువృత్తి నవలంబించినది
మొదలు నాహృదయమున మంచియూహలేవియుఁ బొడసూప
లేకపోవుచున్నవి. దురాలోచనలును దుర్బుద్ధులును దట్టముగాఁ
బెఱిఁగియున్నవి. చిన్ననాఁడు మీరుపదేశించిన బుద్ధులనన్నిటిని
మంటకలిపితిని. తుదకు కాపాలకుఁడు ప్రేరేపింపగురువులయిన
మీకు విషప్రయోగమునయితము జేసియుంటిని” అని పెద్దపె
ట్టున రోదనము చేయసాగెను. అపుడు జయచంద్రుఁడు మిగుల
యద్భుతపడి “ఆనాఁడు నాకు విషప్రయోగము నీవలననే జరిగి
నదా,, అని కొంతసేపు నిర్ఘాంతపడిచూచి “పోనిమ్ము ఇపుడు
దానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొని పరితపింపకుము. వెనుక చేసిన దానికి
విచారపడిన నేమిలాభము! గతజలసేతుబంధనమువలన బ్రయో
జనములేదు. ముందైనను నీపరివర్తన చక్కదిద్దుకొనుము”



అని యోదార్చి యామెను వైద్యునకు నొప్పగించి తగినచికిత్స
చేయించుచుండెను. భువనమోహనిగాయము కుదిరి లేచి తిరు
గుచుండెను.



## ఇరువదియొకటవప్రకరణము.



జయచంద్రుఁడు వంగదేశమునకుఁ బ్రయాణమగుచున్న
సంగతి జేవళునకుఁ దెలిసినతోడనే, దేవళుఁడావృత్తాంతము
ను శేనునకు వర్తమానమును బంపుటయేగాక, తానును నపరా
ధులవెనుక మిషమీఁద రాజానుమతంబునడసి కటకపురికేతెం
చెను. జయచంద్రుఁడు వచ్చుచున్నసమాచారము వినినతోడనే
కటకపురియందు నుశేనుఁడు మొదలయినవారికిఁ గుండెలవిసి
వానినెట్లయిన సమయింప యోజించుచుండిరి. ఆసమయమునఁ
జితాంగి తండ్రిమందిరమున తనగదియందుఁ గూర్చుండి
యెవనినిమిత్తమో యెదురుచూచుచుండెను. “ అప్పుడే రాత్రి
ఝాముపొద్దుపోయినది. ఆతఁడేమికారణముననో యింకను
రాలేదు. ఆతఁడు వచ్చిననేగాని సంగతులు పూర్తిగా తెలియ
వు. ” అని చితాంగితలపోయుచు తనకుఁదాను చెప్పుకొనుచు
నంతలో నేదియోజ్ఞాపకము వచ్చినందున పెరటిద్వారము
తెఱదియుంచి మఱలవచ్చి మంచముపైఁ గూర్చుండెను.

ఈమె మఱలవచ్చి కూర్చుండియున్న కొంతసేపటికి ముందుతలుపుతట్టిన చప్పుడై "ప్రియసఖీ!" యని పిలిచినట్లు లామెకు వినిపించెను. ఆశబ్దమాలకించినతోడనే యామెకపరిమితసంతోషముదయించి "ప్రాణసఖా! వచ్చితివా? నీరాక నే నిరీక్షించుచుంటిని." యని తలుపుతెఱచి మరలవచ్చికూర్చుండెను. అపుడు నలువదివత్సరములప్రాయముగల మనుజుఁడొకఁడు లోనప్రవేశించి తలుపుమూసినతోడనే బట్టలో దాఁచియుంచిన ఖడ్గమును బైకితీసి "ఓసిపాపముండా! నీవింకను నెన్నినరహత్యలఁ జేయఁదలంచితివి. ఈకత్తితో నీగొంతుకోసి చంపెదను." అని కత్తినిపైకెత్తెను. అపుడు చిత్రాంగి గడగడ వణఁకుచు "అయ్యో! యేమి యీదుర్మార్గము!"

మను—నాది దుర్మార్గమా! నీదిసన్మార్గమా! మృత్యుదేవతవలె నీవు జనులమ్రింగుచుంటివి. నీకును కాలము సమీపించినది. నిన్నీకత్తితో నఱకి లోకబాధ విముక్తి చేసెదను.

చిత్రాం—అయ్యో! విజయుఁడా! నాకును మీయన్నకును గలస్నేహమును విచారించి నన్నువిడిచిపెట్టుము.

విజ—ఓసిదుర్మార్గురాలా! నోరు మూసికొనుము. నీకుత్రికస్నేహమే మాయన్నమరణమునకుఁ గారణమైనది. నీవు మాయన్నను జంపినదానవు. నిన్నింక విడిచిపెట్టెదనా?" అనికత్తిని మరల పైకెత్తుచుండెను.

చిత్రా—మీయన్న విదూషకుఁడు నాకుఁబ్రాణమిత్రుఁడు. వానినినేనేల చంపెదను.



విజ—ఆట్టెప్రేలక నోరుమూసికొనుము. విషప్రయోగమునవానినిచంపి చంపలేదనిబొంకుచుంటివా?

చిత్రాం—అదిపొరబాటున సంభవించినది. ఆవిషప్రయోగము మీయన్ననిమిత్తముద్దేశింపఁబడినదికాదు.

జయ—అదిపొరబాటగుటచేతనే నీగ్రహపాటెట్టున్నది. నిన్నుచంపకవిడువను. అని కత్తినిపైకెత్తి యామెకంఠమునకు గురిచూచుచుండ నామె "రెండునిమిషములు మాత్రము నన్ను బ్రతుకనిమ్ము. నాకొక్కయుపకారమును మాత్రము చేయుము," అని కన్నీరునింపుచు వానిపాదములమీఁదఁబడి వేఁడికొనఁజొచ్చెను. అపుడు వానికి నామెయెడల కొంతజాలిపొడమి "ఓసీ! నిన్ను చంపకవిడువను. నీవిఁక నేయుపకారమును జేయుమన్నను జేసెదను" అని చెప్ప చిత్రాంగి "నన్నొకయుత్తరమును వ్రాయనిమ్ము. ఆపెట్టెయందున్న కాగితమును కలమును దెచ్చిపెట్టుము." అని తానుకట్టుకొనియున్న బట్టలో చేతులుపెట్టి కొంచెముసేపు సవరించి తాళముచెవిని పైకితీసి విజయుని కందిచ్చెను. విజయుఁడా తాళముచెవిని చేతఁబుచ్చుకొని చెంతనున్న పేటికాసమీపంబునకుఁజని దానినా పెట్టెకుఁ దగిల్చి తనచేతితో గట్టిగానొక్కెను. ఆతాళముముల్లు చేతికిగ్రుచ్చుకొని విజయుఁడు కెవ్వునకేకపెట్టి క్రిందపడి గిజగిజ తన్నుకొనుచు ప్రాణములు విడిచెను. అపుడు చిత్రాంగి వానినిసమీపించి "నీబ్రతుకింతటితో ముగిసినది" అని వానిని కాలుతోఁదన్ని యావలనున్న తోఁటలోని కాశ

వము నీడ్చివేసి మరలవచ్చి కూర్చుండెను. అంతలో దేవళుఁ డు లోనికేతెంచి "ప్రియురాలా! నాఁడు నీమాటవిని చెర యందున్న యపరాధులను విడిచిపెట్టుటచే నా ప్రాణమును విడువవలసివచ్చినది. నిమిష సౌఖ్యమున కాశపడి ప్రాణమును బోఁగొట్టుకొనుచుంటిని. జయచంద్రుఁడు నన్న బ్రతుకనివ్వఁ డు" అని రోదనముచేయ చిత్రాంగి "నీకాభయ మెంతమాత్ర మవసరములేదు. ఆతఁడు చచ్చినట్టు భావించుకొనుము.

దేవ—వాఁడు తెల్లవారకపూర్వ మిచట కేతెంచును."

చిత్రాం—అవును. అసంగతి మాకుఁదెలిసినది. ఆతఁ డిచటనుండి మరల ప్రాణములతో వెళ్లఁడు. రేపీపాటికాతనిగతి యేమగునో నీవేచూచెదవు. నీ వాభయమునువిడిచి సుఖముగా నిద్రింపుము. అని చెప్పుచుండ 'అమ్మాయీ! చిత్రాంగి! ఈకత్తి నీమూలయుంచెదను. ఇదియింకను విషపూరితమై యున్నది. మొన్న నయోధ్యయందు చెరనుబంధింపఁబడిన కాపాలికాదులను విడిపించునప్పు డడ్డుకొనవచ్చిన మణిభద్రుని నఱికి చంపిన ఖడ్గమిదియె. దీని నెవ్వరుముట్టకుఁడు.

చిత్రాం—దానిని మేమెవ్వరము ముట్టము. ఆవిషము నే నాబీగము చెవినిబూరించి యింతకుముందు నన్ను చంపవచ్చిన విజయునీ తుళ్లడంచితిని. శ్రీనివాసయోగి కాపాలికాదులతో సుఖముగా నిల్లుచేరెనా?



వీరవర్మ—కాపాలికుఁ డెందుదాగెనో నేనెఱుఁగను గాని శ్రీనివాసయోగియు దురంతకుఁడును నిచ్చటనే రహస్యముగా దాఁగియుండిరి. జయచంద్రుఁ డిచటకు రాఁబోవుచున్న సమాచారము వినినతోడనే వారల నిందురప్పించితిని. శ్రీనివాసయోగి దేవాంతక నరాంతకులఁజంపి ప్రుట్టినవాఁడు. మంచిబుద్ధిమంతుఁడు. ఈవిషయములో నాతఁడు మనలఁ జక్కఁగా నడుపఁగలఁడు.

చిత్రాం—జయచంద్రుఁడు రేపు ప్రాతఃకాలమునకుఁ యిటకేతెంచునఁట. వానివలన గురువర్యునకుఁ బ్రాణభయము తటస్థింపదుగదా—

వీర—ఆపక్షి దానిని గన్నెత్తి చూడఁగలఁడా! చావునకే వాఁడిట కేతెంచుచున్నవాఁడు.

చిత్రాం—రేపు చేయవలసిన ప్రయత్నమునుగూర్చి శ్రీనివాసయోగియు మీరును జక్కఁగా యోచించితిరా?

వీర—విషప్రయోగమే చేయఁదగినకార్యము. అంతకన్న వేరుసాధనమేదియుఁ గనుపించదు. మంచిప్రశస్తమైనది జాగ్రతపెట్టి మన వలలునిచేతికిచ్చితిని.

చిత్రాం—అబ్బా! వలలుఁడు తెలివితక్కువవాఁడు. నాఁడు వానివలననే మనకుఁ బ్రమాదము సంభవించినది.

వీర—నాఁడుపొరపాటుచేనట్లు జరిగినది. ఆతఁడు మంచి బుద్ధిమంతుఁడు. నమ్మఁదగినవాఁడు. జయచంద్రునితోడితెచ్చుటకు నీమగని సుందరేశునే బంపెదను. అందువలన చిక్కు—

గలిగినను నదివానిని ద్రుంచివేయును. దానివలన నానిబాధ తొలఁగిపోవును.

చిత్రా— ఆతఁడిపుడు నోరెత్తుటలేదు. నాఁటితో వానిపొగరంతయు నణఁగినది. నేనేమిచేసినను జూచి యూరకుండుటేగాని నన్నించుకైనపూర్వమువలె మందలించుటలేదు. నాఁడు మనము వానికిఁ జేసియున్న విషప్రయోగము విదూషకునికిఁ దగిలి వానినిజంపినది. ఆసంగతి వానికిఁ దెలియకపోయినను నాఁటినుండి యాతఁడు నాయెడల భయభక్తులుగలిగి సంచరించుచుండెను.

వారిట్లుకొంతసేపు సంభాషించి నాత్రిప్రొద్దుపోయినందున సుఖముగా నిద్రించిరి.



## ఇరువదిరెండవప్రకరణము.



ఆమఱునాఁటియుదయమున జయచంద్రురాక నుద్దేశించి యనేకప్రయత్నములు జరుపఁబడినవి. పట్టణమంతయు మహావైభవముతో నలంకరింపఁబడెను. చలువపందిళ్లతోడను పచ్చనితోరణంబులతోడను కల్హారాదికుసుమధామంబులతోడను కదళీకాండతండంబులతోడను రాజమార్గంబెల్ల శృంగారింపఁబడెను. ఉశీనుఁడమాత్యాది పరివారవర్గంబుతో కప్ప



మును జేదాల్చి నగరువాలుపలఁ నిల్చి జయచంద్రునిరాక నిరీక్షించుచుండెను. అంతకొంతసేపటికి జయచంద్రుఁడేతెంచ నుశీనుఁడు నిజపరివారవర్గంబుతో కొంతదూరమెదురుగఁ జనుదెంచి కానుకనర్పించి వినమ్రుఁడై "బ్రహ్మకులసంభవా! ద్వితీయసార్వభౌమా!, అని వందనములాచరించి మహాగౌరవముతోఁ గొనితెచ్చి యొక్కదివ్యభవనంబున నిలిపెను. ఇంతవఱకతఁడు సార్వభౌముని గౌరవింపకపోయినను వానిబ్రతినిధిని నధిక యభభక్తులతో గౌరవించుచుండెను. పురజనులందఱు గుంపులుగుంపులుగాఁగూడి జయచంద్రుని దర్శించుచుండిరి. వానిని సత్కరించుటకు నియమింపఁబడినందున సుందరేశుఁడు వానిని సదా వేచియుండెను. అప్పుడు దేవళుఁడు జయచంద్రుని దర్శించి "స్వామీ! అపరాధు లీనగరున దాఁగియుండిరని విని సుదర్శనుని యనుమతంబున నీపురంబునకుఁ జనుదెంచి నిద్రాహారంబులవిసర్జించి వారల వెదకుచుంటిని. వారింతవఱకుఁ గనిపించియుండలేదు. నేఁడెల్ల నీపురంబునింకనుశోధించెద" నని నుడువుచుండ సుందరేశుఁడు మందహాసముతో జయచంద్రుని ముఖము వంకఁజూడసాగెను. జయచంద్రుఁడు వానిభావమును గ్రహించి దేవళునిఁజూచి తలయూఁచి యూరకుండెను. అంతలో యుశీనుఁడు చనుదెంచి "శ్రీద్వితీయసార్వభౌమా! నేఁటిరాత్రి దేవర మాగృహంబునకు విచ్చేసి నేఁజేయుసత్కారంబును బరిగ్రహించి నన్ను ధన్యునిఁజేయవేఁడెద. తమకు నేనువిధేయుఁడనుగాని, యవిధేయుఁడనుగాను. నన్ను పరునిఁగానెంచక నాప్రా

ర్థన మంగీకరింప వేఁడుచున్న వాఁడను." అని నుడువ జయచం
ద్రుఁడు కేరికంటసుందరేశు వదనారవంద మీక్షించి యుశీను
నితో "రాజవర్యా! నీవింత వేఁడనేల? ఇంతయాదరముతోఁ బిలి
చినప్పుడు నీయాహ్వానమును నిరాకరింతునా? నేను తప్పక విచ్చే
సెదను" అనిచెప్పి వానినిపంపివేసెను. సాయంకాలము సమీపిం
చినతోడనే యుశీనునిసభాభవనము దీపికాపుంజంబుతోఁ బ్రకా
శించుచుండెను. ఆసనంబులు బరుపఁబడినందున రాజబంధువులం
దఱును సందర్శించిరి. ఒకవంక నుశీనుఁడును వానిసమీపమున
న వీరవర్మయు వానిప్రక్క దేవళుండును గూర్చుండిరి. జయ
చంద్రునిఁ దోడితెచ్చుటకు సుందరేశుఁడు నియోగింపఁబడి
నందున నాతఁడు జయచంద్రునిఁ దోడితెచ్చెను. ఉశీనుఁడు
వానినిఁ గాంచినతోడనే యాలింగనముగావించి యగ్రస్థానం
బునఁ గూర్చుండఁబెట్టెను. పంక్తులయందపూపాదిభక్ష్యంబు
లును పాయసాన్నంబును వడ్డింపఁబడెను. ఆసమయంబున సుం
దరేశుఁడును వలలుఁడును కొంతసేదియో రహస్యముగా సంభా
షించుచుండిరి. జయచంద్రుఁడు బ్రాహ్మణుఁ డగుటచే భక్ష్య
పాయసంబుల నిషేధించినందున ఫలములనుమాత్రమే వాని
కర్పించిరి. తరువాత వలలుఁడు తనచేతనున్న రసాయనమును
మఱియొక సేవకునిచేతికిచ్చి వానిచేతనున్న నాసవమును
దాను పుచ్చుకొని జయచంద్రుని కిచ్చెను. ఆ సేవకుఁడు
వలలుఁ డందిచ్చిన రసాయనమునుశీనునకును వీరవర్మకును
దేవళునకును దానిచ్చెను. తరువాత వలలుఁడు మఱికొంత



రసాయనమును దెచ్చి మిగతనున్న రాజబంధువులందఱికి నిచ్చె
ను. తరువాత కొంతసేపటికి యుశీనుఁడును దేవళుఁడును క్రిందఁ
బడి గిజగిజతన్నుకొని మరణావేదనఁబొందుచు కన్నులు తేల
వేసిరి. వీరవర్మ యారసాయనమును మిగుల స్వల్పముగాఁ బాన
ముజేసియున్నందున నాతనికంతగా ప్రమాదము సంభవించి
యుండలేదు. శరీరస్మారకము తప్పుచున్నట్లు లనుమాన
మాతనికిఁ గలిగినతోడనే నెమ్మదిగా లోనికేతెంచి యౌషధ
మును కుంచేటికక్తమున గలిపి త్రాగెను. తరువాత కొంతసేప
టివఱకు శరీరస్మారకము తప్పి పడియుండెను. అందుచే నాతఁ
డాసమయమున దండ్రియవస్థను కనిపెట్టలేకపోయెను. విందు
నిమిత్తమేతెంచిన రాజబంధువులందఱు నాఘోరకృత్యమునకు
వెఱగంది యొకరితోనొకరు చెప్పకయే వెళ్ళిపోయిరి. సుందరే
శుఁడు జయచంద్రునిఁ గొనిపోయి వానివిడిదెయందు దిగఁబెట్టెను.
వీరవర్మ మరల శరీరస్మృతి గలిగినతోడనే లేచి తండ్రిని పరీ
క్షించిచూచెను. ఉశీనుఁడును దేవళుఁడును మరణబాధ పడు
చుండిరి. చికిత్సఁ జేయఁదగిన తరుణము దాటిపోయినందున
వీరవర్మ నిరాశఁజెంది వలలుఁడు తమ్ము మోసముఁజేసెనని
యనుమానించి వానినిఁ బిలిచెను. వలలుఁ డెంత వెదకినను కని
పించలేదు. వీరవర్మ వీరల దురవస్థఁగాంచి మిగుల విచారింపఁ
దొడంగెను. ఉశీనుఁడును దేవళుఁడును నింకింతసేపటికి మరణ
వేదననొంది తుదకు ప్రేతలోకంబున కేతెంచిరి. వారి శవము
లయందు విషచిహ్నములు స్పష్టముగాఁ గనిపించుచుండెను.

వారిముఖము లుబ్బి నల్లగా మట్టిపెంకులవలెఁ గనిపించుచుండె
ను. వారికంఠములు వాచి రోళ్ళవలె నుండెను. శరీరమంతయు
తెల్లనిపొడలతో నిండియుండెను. ఆరాత్రియందే దేవళ్ళుని కళే
బరము శ్మశానమునకుఁ గొనిపోయి భూమిని పూడ్చిరి. ఉశీనుని
శవమా రాత్రియంతయు నింట నేయున్నది. వీరవర్మ తండ్రి
శవమును సమీపించి "నాయనా! నీవు జీవించి యున్నంత
వఱకు నీపేరు విన్నమాత్రమున లోకమునకు గర్భనిర్భేద మగు
చుండెను. నిన్నింతవఱకు స్తోత్రపాఠములు చేయుచున్న మానవ
బృంద మిపుడు నిన్నెట్లు దూషించుచుండెనో చూడుము"
అని శోకించుచుండ చిత్రాంగి లోననుండి పరుగెత్తుకొనివచ్చి
"భైరవస్వామి మనతండ్రిని రక్షించుఁగాక" అని పెద్దపెట్టున
కేకపెట్ట వీరవర్మ "ఇఁక రక్షించెడిదేమున్నది. భైరవస్వామి
యనుగ్రహము మనయెడల పరిపూర్ణముగా నుండెను.
అమ్మాయీ! ఇఁక మనమిట నిలువఁజాలము. పౌరజనంబు
లింతవఱకు మనతండ్రికి వెఱచి మనల కన్నెత్తి చూడలేకుండిరి.
ఇఁక వారు మనల బ్రతుకనివ్వరు. నీవు యోగినివేషమునువహించి
యేమఠమునందైనను కాలముగడుపుము" అని గొంతెత్తి
యేడువసాగెను. ఔరా! దౌష్ట్యమున కెంత పిఱికితనము!
జయకాలమునందైనను నిర్భయముగా సంచరింపనేరదు. జుగు
ప్స, కలవరము వేగిరపాటు మొదలయిన పాపగుణములన్నియు
దానినాశ్రయించియుండును. నిజయౌన్నత్యమే దానికి పతన
హేతువు. రాత్రియంతయు రాజశవమును జుట్టుకొని వీరిట్లు



యేడ్చుచున్నను నోదార్పవచ్చిన పౌరులెవ్వరును లేరు. పట్టణ
రాజు చనిపోయెనన్న విచార మెవ్వరికిని లేదు. ప్రజలందఱును
నేటితోఁ దమపీడ నివృత్తిఁజెందెనని సంతోషించుచుండిరి.
శ్రీనివాసయోగి దిగులుజెంది రహస్యప్రదేశమునఁ గూర్చుండి
విచారించుచుండెను. దురంతకుఁడు ప్రతాపరుద్రుని కెఱింగింప
పాటలీపుత్రమునకేతెంచెను. తెల్లవారినతోడనే వీరవర్మ తం
డ్రికి దహనాదికృత్యముల నిర్వర్తింపఁ బ్రయత్నించుచుండెను.
రాజశవమును బల్లకియందునిచి వాద్యములతోడను ధ్వజముల
తోడను ప్రేతనిలయంబునకుఁ గొనిపోవుచుండిరి. జనులందఱు
గుంపులుగుంపులుగాఁ గూడి వీథులెల్ల నాక్రమించిరి. వీథుల
యందు నిలువఁ దావులేనందున పెక్కుజనులు గోడలమీఁదను
చెట్లమీఁదను నెక్కి కూర్చుండి వినోదమును జూచుచుండిరి.
జనసముద్రమునుండి బయలువెడలుచున్న కేకలును చప్పటు
లును వాద్యనాదముల విననీకుండెను. జనముతో నిండి మార్గ
ము క్రిక్కిరిసియున్నందున శవవాహకులకుఁ గాలుగదప వీలు
లేకుండెను. ఈర్ష్యచే ప్రజలందఱు రాజశవమును బరాభవిం
పఁజూచుచుండిరి. ఆజనులమధ్యనుండి ఱాళ్ళను మట్టిబెడ్డలును
శవవాహనముపైఁ బడుచుండెను. ఆవాహకులముందు నడువ
వీలులేకుండుటయేగాక దారువువలె నుబ్బియున్న శవము మిగు
లభారముగా నున్నందున వారు దానిని భరింపనేరక క్రిందపడ
వైచిరి. అప్పుడు జనులు పెద్దపెట్టున కేకలుపెట్టుచు శవము
వంకకుఁ ద్రోసికొనిపోవుచుండిరి. మనుష్యులు కొందఱు వారిపై

దములక్రిందపడి నలుగుచుండిరి. రాజభటులు కొందఱువారిని నివారింపఁజూచిరి. కాని యందువలనఁ బ్రయోజనము లేకపోయెను. ప్రజలు మిగులదౌర్జన్యముతో రాజభటుల కత్తులతోఁబొడిచియు కఱ్ఱలమోదియు బాధింపఁజొచ్చిరి. రాజశవమును పల్లకిలోనుండి యీవలకులాగి క్రిందఁబడవైచి కాళ్ళతోద్రొక్కించి వారంతటితోనైనఁ దృప్తిఁజెంది యూరకుండక ధనాగారమును కొల్లఁబెట్టి రాజభవనమునకు నిప్పుపెట్టిరి. శ్రీనివాసయోగి యెవరికిని గనిపింపక యే పారిపోయెను. చిత్రాంగిని పట్టుకొనఁ బ్రయత్నించిరిగాని యామె కనిపించలేదు. వీరవర్మ వారలకుఁజిక్కినందున వానిని కఱ్ఱలతో మోది బలవంతముగా చంపుచుండిరి.

లోకములో దుర్జనులు కండకావరముచేతను ధనబలముచేతను, అధికారబలముచేతను తమ్మెవ్వరు నడ్డగింపఁజాలరనియెంచి లోకమును బాధింపఁజూచుచుందురు. కాని యొరులుతమ్ము బాధింపనవసరము లేకయే తమ్మునావహించియున్న దుర్మార్గ మీవిధముగా పరిణమించి వారలను దహించుచుండును. లోకములో పాపపుణ్యములు లేవని భ్రమించుచున్న మూఢహృదయులు సయిత మీయుశ్శీనుఁ డవసానకాలమున బొందియున్న వేదనయు తదనంతర వృత్తాంతమును గాంచి నప్పుడు పాపము కట్టికుడుపక విడిచిపెట్టదని రూఢిగా నమ్ముచుండిరి.



ఆసమయమున చిత్రాంగికిఁ బ్రాణభీతిగలిగి యొక్క పరుగున జయచంద్రుని సమీపించి “స్వామీ! రక్షింపుము” అని మిగులదైన్యముతో వేఁడికొనుచు జయచంద్రుని పాదములుపట్టుకొని ప్రార్థింపఁదొడఁగెను. జయచంద్రుఁ డామెను చూచి తెల్లఁబోయి ‘నీవెవ్వరవ’ ని యడిగెను. తనపేరు చిత్రాంగియనియు తానుసీనురాజకుమార్తెననియు నామె బదులుచెప్పెను. అపుడు జయచంద్రుఁ డాశ్చర్యపడి “చిత్రాంగివి నీవేనా?” యని యడిగెను. అప్పుడు చిత్రాంగి మహాభయముతో “స్వామీ! ప్రస్తుతస్థితియందు నాపవిత్రతనుబట్టి నన్ను విచారింపక నాదురవస్థనుబట్టి రక్షింపుఁడు. ప్రజలు నన్నుఁ జంపఁదలఁచుటయేగాక మాయన్న వీరవర్మనుబట్టి బలవంతముగాఁ జంపుచుండిరి. నిమిషకాలం బుపేక్షించితిరేని వానిప్రాణంబులు వానికిదక్కనేరవు” అని యతిదైన్యముతోఁ గన్నీరునించుచు వేఁడికొనఁజొచ్చెను. జయచంద్రుఁడు కరుణాకరుండగుటచే జాలివడి “నీకుఁ బ్రాణభయము రానీయను. మీయన్ననుసయితము రక్షించెదను.” అని చెప్పి పౌరజనంబులసమీపించి “ప్రజలారా! ఈవీరవర్మ దుర్మార్గుఁడైనను నీసమయంబున పగఁబూని సమయింపఁజూచుట యుక్తముగాదు. వానినింతటితో విడిచిపెట్టుఁడు.” అని వారిని మందలించి వీరవర్మను విడిచిపెట్టించుటయేగాక తండ్రికి దహనసంస్కారములు సహితము జరిగింపవీలుచేసెను. తరువాత వీరవర్మను బిలిచి “ఓయీ! దుర్మార్గము మానవజన్మమున కర్హమైనది

కాదు. దుర్మార్గుఁడు శార్దూలముకన్నను నెక్కుడుభయంకరం బుగాఁ గనిపించుచుండును. కావున సమయముదొరికినప్పుడు లోకము వానిని సమయింపఁజూచుచుండును. దుర్మార్గుఁడు లోకమును, లోకము దుర్మార్గుని బాధింపఁజూచుచుండును. దుర్మార్గహృదయమునకు శాంతియెన్నఁడును గలుగనేరదు. అనిశంబు వానిజీవితము దుఃఖభాజనమై గాసిల్లుచుండును. నీవిప్పుడైన బుద్ధితెచ్చుకొని సన్మార్గమున చరించితివేని లగ్గు నొంది సుఖింతువు. లేకున్న నెగ్గుమూడి నశింతువు " అని వానిని మందలించి పంపివేసెను. పట్టణమంతయు నల్లకల్లోలము గానుండుటచే నెమ్మదిని నెలకొల్పుటకు జయచంద్రుఁ డింకను నాపురంబుననే నిల్చియుండెను. ఆరాత్రి భోజనము చేసినతో డనే జయచంద్రుఁడు చల్లగాలి నపేక్షించి తాను నివసించి యున్న భవనమునకు సమీపముననున్న యుద్యానవనము నందు నొంటరిగాశయనించి పరమేశ్వరుని గొంతవఱకు ధ్యా నించి కన్నుమూయుచుండ " జయచంద్రా! ప్రాణమిత్ర మా " యని మధురస్వరంబొకటి వినిపించెను. వెంటనే జయ చంద్రుఁడు కన్నులువిచ్చి చూచెను. వానికన్నులయెదుట లా వణ్యపయోరాశివలె ప్రకాశించుచున్న నొక్కసుందరాంగి బొడసూపెను. ఆమెను గాంచినతోడనే జయచంద్రుఁడు తత్త రిల్లి " ఓసుందరీ! నీవిందుల కేలయేతెంచితివి. నీపేరెయ్యది" యని యడిగెను. అప్పుడాకోమలి " అయ్యా! నాపేరు చిత్రాంగి. నేఁటిమధ్యాహ్నము మిమ్ముల దర్శించినదిమొదలు



నామనంబున నొకవిధమైన వికారంబంకురించి నన్నుమిగుల వేధించుచున్నది. మాయన్నను శత్రువులనుండి రక్షించిన దయాశాలికి నన్నీ మన్మథబాధనుండి తొలఁగించి రక్షించుట ప్రయాసకరంబుగాదు." అని తనమనోభావంబును వానికిఁదేట పఱచి వానినాకర్షింపఁదనశృంగారవిలాసంబు నొయ్యారంబుతో వా నికిఁ జూపఁజొచ్చెను. జయచంద్రుఁడామె వికారచేష్టలకు మిగు లగర్హించుచు " ఉత్తమకాంతలకు నుచితమైన లజ్జయు పాతి వ్రత్యంబును నలంకరణంబులుగాని ముఖముయొక్కతీరును చర్మముయొక్కరంగును నలంకరణంబులుగావు. పరపురుషుల చెలిమికై మెలఁగఁజూచుట కులసతికిఁ దగవుకాదు " అని మం దలింప నంతటితోనైన నామె మరలిపోక. యెట్లయిన వాని నాకర్షింపఁ బ్రయత్నించి " ఓయి! గంధర్వకాంతయైనను సౌం దర్యంబున నన్నుసరిపోలనేరదు. దివాంధంబునకు వెలుఁగు సరిపడనట్లు నాయందంబు నీకుఁగిట్టకుండెను. ,, అని మందహా సంబుతో వానిఁజేరఁబోవ జయచంద్రునికిఁ బట్టరానికోప ముదయించి " ఓసిపాపవనితా! నీవు సురూపిణివైనను కు రూపిణివైనను మాకుఁబనిలేదు. నీమందహాసంబును వికార చేష్టలును పామరులబాధించినట్లు నన్నుబాధింపనేరవు. ఛీ! స్త్రీముఖంబుఁజూచిన పాపంబొదవును ,, అని యామెనదల్చి విదల్చి యావలకు సాగనంపెను. ఇంతవఱకు చిత్రాంగిసౌంద ర్యమును నిరసించఁగలిగిన పురుషవరుఁ డెవ్వఁడును లేఁడు. చిత్రాంగి సుందరాననంబునీక్షించిన మానవుం డెంతధైర్యవం

తుండైనను నామెవలలం దగిలి మహాపరిశుద్ధమనను బోంగొట్టుకొనుచుండెను. ఈమెసౌందర్యలక్షణములును మాయోపాయంబులును జయచంద్రుని మనస్సునించుకయు గలంచలేకపోయెను. స్త్రీలమాయలు ధీరచిత్తములనెన్నఁడు గలంపనేరవు. జయచంద్రునివలె కాంతాకనకములకు లోనుగాని మానవులంతగా లోకమునఁ గనుపింపరు. ఇందుచేతనే మోక్షద్వారమునకుఁ గామినీకాంచనములు ప్రతిబంధకములని పెద్దలు నుడువుచుండిరి. అందు కాంచనముపైఁగల యాశ జయించుట కొంతసులభమేగాని రెండవదానిని జయింపఁగలుగుటయే బహుప్రయాసకరము. దానిని జయింపఁగలిగినపురుషుఁడు జితేంద్రియుఁడని చెప్పఁబడును. లోకములోని జితేంద్రియులలో జయచంద్రుఁడే ప్రథమగణ్యుఁడు. వీనివలనఁ దిరస్కరింపఁబడినప్పుడు చిత్రాంగికధికరోషమును నీర్ష్యయు నుదయించి వీనినెట్లయిన సాధింపవలెనని నిశ్చయించుకొని వెడలపోయెను.

చిత్రాంగి జయచంద్రునితో సంభాషించుచున్నప్పుడు విగ్రహమొకటి చెంతనున్న వృక్షమూలమున దాఁగి వారిసంభాషణమును జక్కగావినుచుండెను. చిత్రాంగిగాని జయచంద్రుఁడుగాని దానినిఁ జూచియుండలేదు. చిత్రాంగి యావలకు వెడలినతోడనే కొంతసేపు జయచంద్రుఁ డేదియో యోచించుచు నిద్రించెను. అపుడాప్రదేశమంతయు మిగులనిశ్శబ్దముగా నుండెను. అంతవఱకు చక్కగాప్రకాశించుచున్న వెన్నెలకాంతి పోయి చీకటిదట్టముగా వ్యాపించియుండెను. జయచంద్రుఁడు



గాఢనిద్రఁజెందియున్నందున వానిగుఱ్ఱు నెమ్మదిగా పైకి వినిపించుచుండెను. వృక్షమూలమునఁదాఁగియున్న విగ్రహ మచ్చటనే నిలిచి జయచంద్రునివంక చూడ్కులునిగిడించి జాగ్రతగా వేచియుండెను. తరువాత కొంతసేపటికి జయచంద్రునికి మెలకువవచ్చి కనువిచ్చి చూచెను. అపుడు వానికి యుద్యానవనమునందలి చెట్లు చామ లేవియుఁ గనిపించియుండలేదు. అంతకుపూర్వ మాతఁడు పరుండియున్న తావునువిడిచి తానొక గదియందు పరుండియున్నట్లు గ్రహించెను. ఆగది యంధకారనిబిడీకృతంబై రెండుగజములయెత్తును నంతియె పొడుగు వెడల్పుయును గలిగియుండెను. ఆతఁ డంతకుముందు శయనించియున్న ప్రదేశమది కానట్లు కనిపెట్టి తానచటి కెట్లువచ్చినది తెలియక మిగులయద్భుతపడుచుండెను. అంతలో ఘంటమ్రోగినట్లు ఖణేలుమని చప్పుడయ్యెను. అపుడాతఁడు నలుగడలు పరికించెను. అందు సాంద్రతమం బావరించియుండుటచే నందేదియుఁ గనిపించక దానినంతయుఁ జేతులతోఁ దడవిచూడ నది పూర్వమంత వైశాల్యమును గలిగియున్నట్లు కనిపించలేదు. ఇదియంతయు నేమయియుండునాయని యాతఁడు విచారించుచుండెను. తరువాతకొన్ని నిమిషములకు దానియందమర్పఁబడిన చిన్నకంతను తెఱచుకొని దీపపుకాంతితో స్త్రీమొగము కనిపించి "ఓరిజయచంద్రా! నన్నేమంటివి? నేను పాడువనితనా! నీవు పరాశరునికన్న నెక్కువమిన్నవా! నీమదమడఁచితినిలే! నీమనోబల మిప్పుడేమగునో చూచెద" నని పలికి

దీపపుకాంతితో నదృశ్యమయ్యెను. అపుడు జయచంద్రుఁ డామె
చిత్రాంగియని తెలిసికొని దీనికంతకును నామెయే కారణమని
నిశ్చయించుకొనెను. అంతలో మరలఘంటానాదమువినిపించెను.
అపుడాగది మిగులసూక్ష్మమై యినుపగోనువలెనుండుటచే
జయచంద్రున కించుకయు కదలవీలులేకుండెను. అపుడు జయ
చంద్రుఁడు తనకుచావుతప్పదని నిశ్చయించుకొని సుగుణమం
జరిని దలఁచికొని క్షణకాలముఁ విచారించి “ ఈశ్వరుఁ డేమిచే
సినను సరే. నేను దాని నానందాతిశయమున భరించెదను. ”
అని కృతనిశ్చయుఁడై యుండెను. మఱల చిత్రాంగి కనిపించి
“ నీవిప్పుడైనను నన్నుసంతోషపెట్టఁ దలఁచితివేని నిన్ను విడి
చిపెట్టెద” ననినుడువ జయచంద్రుఁడు “ నీవు నన్నుజంపినను
నేనాపాడుపని కంగీకరింపను. నీయన్ననురక్షించిన విశ్వాసమై
నను నీకులేకపోయినది. నాచావునకు నేనంతగా విచారించుట
లేదుగాని నీకృతఘ్నతకు వగచుచుంటిని. అనవుడు చిత్రాంగి
“ నీవు నాకుఁజేసియున్న యుపకారముకన్నను నీవు నన్నుచేసి
నయవమానము నిన్నుచంపఁ బ్రేరేపించుచున్నది. నీకుబ్రతుక
నాశకలదేని నాకోరికను నెరవేర్పుము ” అనిపలుక జయచం
ద్రుఁడు “ ఓసిదుష్టవనితా ! నేను జచ్చెదనుగాని నీముఖము
వీక్షింపను. నిన్నుజూచి సంభాషింపను ” అనిచెప్పి కన్నులు
మూసికొని యీశ్వరధ్యానముఁ జేయుచుండెను. అంతలో
ఖణేలుమని మఱల శబ్దము వినిపించెను. అపుడు జయచంద్రుఁ
డు తనకవసానకాలము సమీపించుచున్నదని నిశ్చయించు



కొని “ ఈశ్వరా ! రక్షింపుము ” అని యొడలెఱుంగక
కేకపెట్టెను. వెంటనే యాబోనుతలుపు తెఱవఁబడి జయచం
ద్రుఁ డీవలకు లాగఁబడెను. చిత్రాంగి లోనకుఁ ద్రోయఁ
బడెను. తోడనే ఘంటానాదము మరల పెద్దపెట్టున వినిపించి
యాయినుపబోనుయొక్క ప్రక్కలును దగ్గరగా నొక్కఁబడెను.
పాపము చిత్రాంగిబాధ నేటితో విరుగడయైనది. ఆఘంటా
నాద మావిర్భవించినతోడనే లోనున్న చిత్రాంగి ఖండఖండ
ములుగా నఱుకఁబడి ప్రాణములు విడిచెను. ఈమెమరణము
లోకమున కధికసంతోషకరముగానున్నను జయచంద్రుని కా
మెమరణమునొందినవిధము మిగుల ఘోరముగాఁ గనిపించి
సంతాపమును గలిగించుచుండెను. అప్పుడు సుందరేశుఁడు
“ స్వామీ ! ఈదుష్టవనితమరణమునకు మీరు విచారింపకుఁ
డు. దీనిచారిత్రమును మీరు బాగుగా నెఱుంగనందున మీ
రిట్లు విచారించుచుంటిరి. దీనిచే నాచరింపఁబడినదోషకృత్య
ములు లెక్కింపనలవికానివి. నాకు భార్యయై యుండియు నన్నుఁ
జంప విషముపెట్టించెను. విందుపేరుచెప్పి యాదుర్మార్గమును
మీయెడలను బ్రయోగించిరి. నాకు వలలుఁడు ప్రియమిత్రుఁ
డగుటచే నాదుర్మార్గము మిమ్ములనంటక నారలనే ఘటించి
నది. ప్రజలు వీరలదౌష్ట్యమునకు కనలి, దీనిని, దీనియన్నను
మున్నె జంపఁబోయిరిగాని మీయానతికి వెఱచి విడిచిపెట్టిరి.
మీరు మున్నె వీరలను దయజూడకున్నయెడల అప్పుడే వీరలు
బలవంతపుచావు చచ్చియుండుదురు. కాని వీరలకావిశ్వాస మిం

చుకయు లేదు. రాత్రి మీ రుద్యానవనమున శయనించినప్పుడీపాపాత్మురాలు మీతో సంభాషించినసంభాషణమంతయు నేను చెట్టుచాటున నుండి వింటిని. మీరు నిద్రించినవెనుక నేను జూచుచుండఁగనె దీనిస్నేహితులు నలువురు పక్కతో మిమ్ముల మోసికొనిపోయి యాబోనునందుంచిరి. వారికిఁ దెలియకనే వారివెనుకపాటున వచ్చి దీనిదుర్మార్గము నంతయు నీకన్నులతోఁ జూచియుంటిని. భార్యయనివిచారింపక స్త్రీహత్యాపాతకమునకొడిగట్టి యీవిధముగాఁజంపితిని. మీరు నిందింపఁదలఁచిన నిందింపుఁడు. దేవుఁడు నన్నిందులకు దండించినను దండింపనిండు. దీనిమూలమున నామానాభిమానములు చచ్చిపోయినవి. దీనివలన నేనుపడినబాధ దైవమున కెఱుక. శిష్టజనరక్షణంబును దుష్టజనశిక్షణంబును నుత్తమశూరులనైజగుణంబు. కనుక పాపాత్ములను దండించుటకుఁ దమరు వెనుదీయఁ గూడదని మనవిచేయసాహసించుచున్నందుకు నన్ను మన్నింపుఁడు." అని నుడువ జయచంద్రుఁడు "ఓయి! నీవు చెప్పినది యథార్థము. ఒకరు దండింపనవసరము లేక యెవరిపాపమువారిని దండించుచుండును. మానవునినీచస్వభావము గనిపించినప్పుడు మొదట కోపము జనించినను వానిదుస్థితిని గాంచినప్పుడు నాహృదయమున జాలిబొడమి నాకోపమును నణచిపెట్టుచుండును." అని చెప్పి సుందరేశునితోఁ దానునివసించియున్న భవనమునకుఁ జనుచుండెను. అపుడు సుందరేశుఁడు "స్వామీ! మీరుచేయవలసినపని యింతటితో ముగిసెనని భావింపకుఁడు



ఈచిత్రాంగి మరణమును వినినతోడనే యామెబంధువులందఱును వీరవర్మతోఁగలసి మిమ్ముల ముట్టడింతురు. మీ రేమరిపాటునువిడిచి పోరున కాయత్తంబై యుండుఁడు" అని నుడువ జయచంద్రుఁడు "అందులకు నే నెంతమాత్రము సంకోచింపను. సామోపాయము వారియెడల పనిచేయదేని దండోపాయమునే ప్రయోగించెదను." అని నుడువుచు భవనమును సమీపించిరి. అంతలో తెల్లవారెను.

చిత్రాంగిమరణమును వినినతోడనే వీరవర్మయు నితర భైరవమతస్థులును నాయుధపాణులై జయచంద్రుని ముట్టడించిరి. జయచంద్రుఁడు నయభయంబులచే వారినెట్లయిన సన్మార్గమునకుఁ ద్రిప్పఁ బ్రయత్నించెనుగాని యందువలనఁ బ్రయోజనము లేకపోయెను. వారు క్రమక్రమముగా జయచంద్రుని సమీపించి ముష్కరముగావింపఁజొచ్చిరి. వారిసంఖ్యయు క్రమక్రమముగా నతిశయించుచుండెను. అపుడు జయచంద్రుఁ డధికరోషావేశపరవశుండై కోశాంతర్గతకౌక్షేయంబును వెలికిఁదీసి దారుణవిక్రమంబున నరిజనుల నురుమాడఁదొడఁగెను. సుందరేశుండును వాలు కేలఁదాల్చి శత్రుమధ్యంబున నిజపౌరుషంబుఁ జూపసాహసించెను. రాజభటులును సైనికులును వీరవర్మకుఁ దోడ్పడకపోయినను మగధసైన్యముకొంత వీరరక్షణార్థమేతెంచెను. పురజనులందఱును వీరసేనకుటుంబమునం దసూయ గలిగియుండుటచే జయచంద్రునిపక్ష మవలంబించిరి. ఆహవంబు మిగుల ఘోరంబయ్యెను. సుందరేశునికపటస్వ

భావ మిపుడు బయలుపడినందున వీరవర్మ దురాగ్రహంబున వాని నీక్షించి " ఓరికుత్సితా! ఇంతఁగుడిచినవిశ్వాసమైనను లేక శత్రుపక్షమవలంబించితివా? భార్యను జంపించి సంసారమునకుఁ జిచ్చుపెట్టుకొన్న పాపాత్ముఁడవు. నిన్నుబ్రతుకనివ్వఁగూడదు " అని వానిని క్రిందఁబడవైచి కంఠముఁ దెగవ్రేయ కత్తి పైకెత్తుచుండ జయచంద్రుఁ డాకస్మికముగా వానిబాహుదండంబు నొక్కవ్రేటున ఖండించెను. వెంటనే సుందరేశుఁడు వానిని క్రిందఁబడవైచి నిజకృపాణంబున కుత్తుక నఱకి చంపెను. ఆసమయంబున జయచంద్రునియాటోపంబును భరింపఁగలిగినవా రెవ్వరును లేరు. శత్రువులు వేలకొలఁది మడియుచుండిరి. వానియెదుట నిలువనేరక పెక్కండ్రు నానాముఖంబుల పారిపోయిరి. కొందఱు ప్రాణభీతిచే జయచంద్రుని సమీపించి పాదాక్రాంతులై " స్వామీ! రక్షింపుఁ " డని దైన్యముతో వేఁడికొనఁజొచ్చిరి. ఈసంగ్రామంబున భైరవమతస్థులనేకులు చచ్చిపోయిరి. ఇంతవఱకు మహాకల్లోలముగా నున్నవంగదేశ మిప్పటికి నెమ్మదిని గలిగియుండెను. విష్వక్సేనసార్వభౌమునియేలుబడికి లోఁబడి దేశమును జక్కఁగాఁ బరిపాలించుటకు సుందరేశుఁడు సామంతరాజుగా నియమింపఁబడెను. ఇంతకుపూర్వ మీవంగదేశము ప్రతాపరుద్రుని ప్రోత్సాహముచే చక్రవర్తి కెదురుతిరిగి స్వాతంత్ర్యమును వహించెను. ప్రజలు రాజువలన నెమ్మదిలేక విశేషకష్టముల ననుభవించియుండిరి. దేశమంతయు చెడుస్థితియందుండెను. భైరవమత మీదేశమున



వ్యాపించుచుండెను. జయచంద్రుఁ డీలోపములనన్నిటిని నివారించి దేశమునకు క్షేమమును గలిగించెను. సార్వభౌముని ప్రతాపకీర్తులను లోకమున జక్కఁగాఁ బ్రకాశింపఁజేసి దేశమునందు వానియధికారమును స్థిరముగా నిలుపఁగలిగెను. దేశమును మంచిస్థితికిఁ దెచ్చినతోడనే జయచంద్రుఁ డశ్వారోహణంబుగావించి యయోధ్యాపురంబునకుఁ బయనమై వెళ్ళిపోయెను.



## ఇరువదిమూఁడవప్రకరణము.



మానవుని జ్ఞానస్వభావము ప్రవర్తనయందు గనిపించుచుండును. మానవుఁడు తనజన్మముయొక్క ముఖ్యోద్దేశము కనిపెట్టినప్పుడు దాని నెట్లయినఁ బడయనపేక్షించుచుండును. తదితరవిషయముల నెంతమాత్రము సరకుసేయక తనదృష్టి నంతయు దానియందు నిలిపి వ్యవహరించుచుండును. అతఁడు తాను జేరవలసియున్న గమ్యస్థానమునుదప్ప తదితరవిషయముల నెంతమాత్రము పాటింపఁడు. దుర్మార్గమును లోకమునుండితొలఁగించుటయు సన్మార్గమును బ్రతిష్ఠించుటయు తాను జేయవలసియున్నవిధాయకకృత్యములని జయచంద్రుఁడు భావించుకొనెను. వాని నెట్లయిన పగఫ్లాని సాధించుటయేవీనియభిమతంబు.

పాటలీపుత్రమునకు సమీపమున కుండిననగరమను చిన్నపల్లెయొకటి యున్నట్టును నాపల్లెవెలుపల రాజమార్గమున జేరి సత్రమొకటియున్నట్టును మీరు వినియుంటిరి. అది పాటలీపుత్రము నుండి యయోధ్యాపురమునకుఁ బోవుచున్న మార్గమధ్యమున కట్టఁబడియున్నది. జయచంద్రుఁ డయోధ్యాపురంబునకుఁ జనుచున్నపుడు కుండిననగరము సమీపించినతోడనే యాసత్రము మాట జ్ఞప్తికివచ్చి తన యశ్వమును సత్రమువంకకు మరల్చి సత్రమును సమీపించెను. వెంటనే సేవకుఁడు గుఱ్ఱమును పట్టుకొని నిల్చుండెను. జయచంద్రుఁడు గుఱ్ఱమును దిగి సత్రము లోని కేతెంచెను. సామాన్యునివలె నటించుచుండుటచే వీని యౌన్నత్యపదవి నెవ్వరును గుర్తింపలేకపోయిరి. ఈతఁడింతకుపూర్వము రెండుమూఁడుమాఱు లీసత్రమున నివసించినను నది ప్రచ్ఛన్నవృత్తి యగుటచే వీని నిపుడు చూచినను సత్రపుయజమానుఁడు గ్రహింపలేకపోయెను. ఆతఁడు సత్రపుయజమానుని గాంచినతోడనే ''ఈరాత్రి కిచట పరుండుటకు వీలుపడునా'' యనియడిగెను. ''అందుల కభ్యంతరములే''దని సత్రపుయజమానుఁడు బదులుచెప్పెను. జయచంద్రుఁడు సత్రపుయజమానునితోఁ గొంతసేపు సంభాషించి ''భోజనము చేసినతోడనే పరుండుటకు మరలవచ్చెద'' నని చెప్పి వెళ్లిపోయెను. గుఱ్ఱముమాత్రము సత్రముయెదుట నున్న రావిచెట్టునకు బంధింపఁబడియుండెను. జయచంద్రుఁ డావలకు వెళ్ళినతోడనే సత్రపుయజమానుఁ డాతఁడెవ్వరైయుండునా యని యో-



చించుచు వీధియరుఁగుమీఁదఁ గూర్చుండెను. అంతలో వాని యన్నకూఁతురుసువర్చల వచ్చి ''నాయనా! వంటయింటను న్న యోగివరుఁడు నిన్ను బిలుచుచున్నవాఁడ''ని చెప్పెను. వెంటనే సత్రపుయజమానుఁడు లోని కేతెంచి శ్రీనివాసయోగిని దర్శించెను. అపుడు శ్రీనివాసయోగి వానినిగాంచి ''ఓయీ! ఇపుడు నీతో సంభాషించినవానిని నీ వెఱుంగుదువా?

సత్రపుయజమానుఁడు——నేను వాని నెఱుంగను. వానినే నిదివఱ కెన్నడును జూచియుండలేదు.

శ్రీనివాస——ఆతఁడే జయచంద్రుఁడు. భైరవమతమునకు గర్భశత్రువు. కటకపురమున వీనిని జంపఁబ్రయత్నించితిమి. కాని వాఁ డదృష్టవంతుఁడగుటచే వానికేప్రమాదము లేకపోయినది. అది యుశీనునకే సంప్రాప్తమైనది. వీరవర్మయవస్థ నేమిచెప్పను. ప్రజలందఱు వానిని జుట్టుముట్టి చంపఁబ్రయత్నించిరి. అచట నిలచియున్న నాకును బ్రమాదము సంభవించు ననితోఁచి దురంతకుని పాటలీపుత్రమునకుఁ బంపి నేనిటకు పాఱివచ్చితిని. ప్రతాపరుద్రుఁ డీపాటికి వీరవర్మకుఁ దగిన సహాయమును బంపియుండును. పాటలీపుత్రమునందలి సర్వవృత్తాంతము లీరాత్రిమనకుఁ దెలియఁగలవు. దురంతకుఁడెంత ప్రొద్దుపోయినను నీరాత్రి రాకమానఁడు. జయచంద్రుని మన మెట్లయినను తెల్లవారకపూర్వమే తుదముట్టింపవలయును. నీవు వానిని నిద్రామందిరమున బరుండఁబెట్టుము. వాఁడు బ్రతికియుండిన మనకు జీవితాశ లేదు. వాఁడు పరమదుర్మార్గుఁడు.

వాని నెట్లయిన మాయోపాయముచేతనే సంహరించవలయును. వాఁడు భైరవమతమున నన్నెంత బాధపెట్టెను? వాఁడు మన ముబంధించినకృపాసింధువు నెంతసులభముగాఁ గొనిపోయెను," అని నుడివినతోడనే సత్రపుయజమానుఁడు సువర్చలను బిలిచి "అమ్మాయీ! ఇపుడువచ్చి నాతోసంభాషించిన పెద్దమనుష్యుని నిద్రామందిరమున బరుండఁబెట్టుము." అనిచెప్పి యావలకు వెళ్ళిపోయెను. సువర్చల కొద్దికాలముక్రిందట నిటకేతెంచియుండుటచే నీనిద్రామందిరమునుగూర్చి యామె కేమియుఁ దెలియదు. కావున నీమెపినతండ్రిచెప్పినవిషయ మావశ్యకమైనదని గ్రహింపలేకపోయెను. రాత్రి ప్రొద్దుపోయినను జయచంద్రుఁ డంతవఱకు మరల కనుపించకుండుటచే 'ఆతఁడు వచ్చునో లేదో,' యని శ్రీనివాసయోగియు సత్రపుయజమానుఁడును లోన విచారించుచుండిరి. అంతలో జయచంద్రుఁడు వచ్చి సత్రపుటరుఁగుమీఁదఁ గూర్చుండి సేవకునితో సంభాషించుచుండెను. సత్రపుయజమానుఁడు వెంటనే సువర్చలను సమీపించి "అమ్మాయీ! నీకుఁ జెప్పినదానిని మఱచిపోకుము" అనిచెప్పి తానును శ్రీనివాసయోగియు సత్రమునకుసమీపమున నొక్కరహస్యప్రదేశమున దాఁగియుండిరి. ఇప్పటికైనను సువర్చల పినతండ్రియుద్దేశమును జక్కఁగా గ్రహించియుండలేదు. రాత్రి ప్రొద్దుపోయినందున జయచంద్రుఁడు పరుండవలెనని ప్రయత్నించుచుండ దూరమున నెవ్వరో యేడ్చుచున్నట్లు వినిపించెను. దాని నాలకించినతోడనే జయ



చంద్రుఁడు మరల దుర్మార్గ మేదియో జరుగుచున్నదని భావించి దాని నరయుట కచ్చోటు విడిచి చనియె. జయచంద్రుఁ డావలకుఁజనినతోడనే నల్లనివస్త్రమును గప్పుకొని మార్గస్థుఁడొకఁడు గజగజవడఁకుచు లోని కేతెంచెను. వానిని గాంచినతోడనే సువర్చల "మీ దేయూరు?" అని యడిగెను. అందుకామార్గస్థుఁడు తనది దూరదేశమనియు తాను మార్గస్థుఁడననియుఁ జెప్పి రెండువరహాల నామెచేతిలోఁ బెట్టి యారాత్రి నిర్భయముగా నిద్రింపఁదగినతావును జూపవలసినదని యడిగెను. సువర్చల యారూప్యంబులను గాంచినతోడనే మిగుల సంతోషించి "అయ్యా! మీకు మార్గమున చోరభయము తటస్థించినదా?" యని వాని నడిగెను.

మార్గస్థుఁడు—నన్ను లేనిపోనిప్రశ్నల నడిగి బాధింపకుము. ఆలస్యముచేయక నాకుపరుండుటకుఁ దగినప్రదేశమును జూపుము. నాకు నిద్రబాధ యధికముగా నున్నది.

సువర్చల—ఈసత్రమున ప్రత్యేకించి గదులేమియు లేవు. మీకీ యరుఁగుమీఁద పరుపును మంచమును వేయించెదను; సుఖముగా నిద్రింపుఁడు. ఆవలిగదిలో పెద్దమనుష్యుఁ డొకఁడు పరుండును. ఇంక వేఱుగదు లేవియు లేవు.

మార్గస్థుఁడు—ఈయరుఁగుమీఁద నేనుపరుండను. నాకుఁ బ్రత్యేకించి గది కావలయును. ఆపెద్దమనుష్యునికొఱకు నేర్పఱచినగది నాకీరాత్రికిఁ బరుండనిమ్ము. నేను తెల్లవారినతోడనే లేచి వెళ్లునప్పుడు నీ కింకను నాలుగురూపాయల నిచ్చెదను.

అని చెప్పినతోడనే సువర్చల మిగులసంతోషించి, ఈమార్గస్థుఁ
డెంతయౌదార్యవంతుఁడు! ఒక్కరాత్రిపరుండుటకు మూఁడువర
హాల నిచ్చెను. సంవత్సరము పాటుపడినను నే నింతసొమ్ము
సంపాదించలేను. సొమ్ముదొరకినప్పుడు వీని నీనిద్రామందిరము
నందు పరుండఁబెట్టినను మాపినతండ్రి తప్పుపట్టఁడు. ఆపెద్ద
మనుష్యు నీయరఁగుమీఁద పరుండబెట్టెదను. అని దీపము
చేతఁబట్టుకొని వానిని నిద్రామందిరమునకుఁ గొనిపోయెను.
ఆతఁడు నిద్రామందిరము ప్రవేశించినతోడనే లోన తలుపు
గొళ్లెము పెట్టుకొని మూటను విప్పి సారాయమును పైకిదీసి
త్రాగెను. తరువాత నా మార్గస్థుని నీకత్తితోఁబొడిచినప్పుడు
వాఁడెంతబాధపడెను! వానిని నేను పొడిచినప్పుడు రక్షింపుమని
వాఁడెట్టు మొఱపెట్టెను! వానికంఠస్వరమును మున్ను నే నెఱింగి
యున్నట్లు వినిపించియున్నది. ఆతఁడు నాకు పరిచయుఁడై
యుండవచ్చును. ధనాపేక్షను వానిని నేను హింసించినను నందు
వలన నాకు లాభములేకపోయెను. నేను కృపాసింధునని
యయోధ్యాపురవాసులను నమ్మించినను దుదకు నాదొంగతన
మంతయు బయలుపడినది. నేను చెఱనుండి తప్పించుకొని యింత
వఱకు నయోధ్యాపురముననే దాఁగియుంటిని. ఆహా! ఏమి
నాప్రజ్ఞావిశేషము? పాడుముండ భువనమోహినికి నే నంత
ధనమిచ్చినను దానికి నాయెడ విశ్వాసములేకపోయినది. నే నా
సొమ్మునంతయు మరల తస్కరించి దానినేడ్పించితిని. ఈసొమ్ము
పెట్టి పంచకళ్యాణీగుఱ్ఱము నెక్కి భైరవమఠముచుట్టు నూరేగె



దను. త్వరలోనే మాతండ్రి శ్రీనివాసయోగిని దర్శింపఁగలను.
అనియోచించుచు నిద్రించెను. అప్పుడు రాత్రియంతయు
నిశ్శబ్దముగా నుండెను. ఆకటికచీఁకటియందు శ్రీనివాసయోగి
నల్లనిగుడ్డ ముసుఁగు వెట్టుకొని యానిద్రామందిరము తలుపు
తెరచికొని సత్రపుయజమానునితోఁ లోనఁ బ్రవేశించినప్పు
డామార్గస్థుఁడు గుఱ్ఱుపట్టి గాఢముగా నిద్రపోవుచుండెను.
అప్పుడు శ్రీనివాసయోగి సత్రపుయజమానునిచెవిలో రహస్య
ముగా "వీఁడు వెలికిల పరుండుటచే కత్తిదెబ్బకు మంచివాట
ముగా నున్నది. ఒకనిమిషములో ముగించెదను. దీపము నొక
మాటిటు చూపుము. అనితనముసుఁగునదాఁచియుంచిన కత్తిని
పైకిదీసి మెల్లగా నాదురదృష్టవంతుపర్యంకమును సమీ
పించి గురిచూచి తోడనే సత్తువకొలఁది నాకత్తితో నొకదెబ్బ
కొట్టెను. అప్పుడా తెలవరికంఠము రెండుతునియలుగా తునిసి
కొంతసేపు గిజగిజకొట్టుకొనెను. తరువాత శ్రీనివాసయోగియు
సత్రపుయజమానుఁడును నాశయనమందిరమును విడిచి వెళ్లి
పోయిరి. జయచంద్రుఁడాసమయమున మూఁపుపై మనుజు
నొకని నిడుకొని సత్రమును సమీపించినతోడనే యాయరఁగు
మీఁదఁ బరుండఁబెట్టెను. వానిశరీరమునుండి వెడలుచున్న రుధిర
ప్రవాహము జయచంద్రునిమూఁపుననుండి స్రవించి యాతఁడు
ధరించినవస్త్రములను దడుపుచుండెను. వానిమరణవేదన జయ
చంద్రునకు మిగుల పరితాపమును గలిగించుచుండెను. జయ
చంద్రుఁడపుడు తలుపుతట్టి సత్రపుయజమానుని బిగ్గరగా కేక

పెట్టి పిలువఁజొచ్చెను. వెంటనే సత్రపుయజమానుఁడు దీప
మును వెలిగించుకొని వెలికి వచ్చెను. ఆదీపపుకాంతియందు
జయచంద్రునిముఖము వానికి చక్కఁగా కనిపించినందున
నాతఁడు డిల్లఁబోయి వాని నీక్షించుచుండెను. అప్పుడు జయ
చంద్రుఁడు "అయ్యా! తెల్లఁబోయిచూచెదరేల? నే నీసాయం
కాలమున పరుండవచ్చిన యతిథిని. పాపమీమార్గస్థుఁ డామార్గ
మున దొంగలచేఁ బొడువఁబడి బాధపడుచున్నవాఁడు. తోడి
మానవుఁడు బాధచే గాసినొందుచున్నప్పు డుపేక్షించి యూర
కుండుట మానవధర్మముగాదు. ఆ దీపము నొకమాఱిటు
చూపుడు" అని యాదీపపుకాంతిని వానిని బరిశీలించెను. వాని
వక్షము దారుణముగాఁ బొడువఁబడినందున పెద్దగాయమొకటి
యేర్పడి సంతతధారగా రక్తము ప్రవహించుచుండెను. దాని
నీక్షించినతోడనే జయచంద్రుఁడు మిగుల విచారించి చేతనై
నంతవఱకు నుపచారములఁ జేయుచుండెను. వానిముఖమును
గాంచినప్పు డాతని నిదివఱకుఁ జూచియున్నట్లనుమానము
గలిగి యీతఁడెవ్వరైయుండునని జయచంద్రుఁ డాలోచించెను.
ఎంతయోచించినను వానిని జ్ఞప్తికిఁ దెచ్చుకొనలేకపోయెను.
కాని, యాతఁడు వానిని విడిచిపెట్టక సర్వవిధముల నాదరించు
చుండెను. వీనినిగూర్చి జయచంద్రుఁడెంతశ్రమపడినను లాభము
గనిపించుటలేదు. ఆమార్గస్థునకపుడు తెలివివచ్చి జయచంద్రు
నీక్షించి కన్నీరు నించుచుండెను. అప్పుడు జయచంద్రుఁడు
"ఓయి! నీవు విచారింపకుము. నీకుఁ బ్రాణభయము రాదు.



తెల్లవారినతోడనే శస్త్రవైద్యుని రప్పించి తగినచికిత్స చేయిం
చెదను. ఈశ్వరానుగ్రహమువలన నీవు బ్రతికి భూమిపై కాలు
పెట్టఁగలవు. అధైర్యపడకుము." మార్గస్థుఁడు "నాకీశ్వరానుగ్రహ
మెన్నఁడును గలుగదు. నే నిప్పుడు మిమ్ముల నానవాలుపట్టితిని.
నన్ను మీరు గుర్తించినట్టు కనిపించదు. నాఁ డయోధ్యాపుర
మున చెఱనుండి పాఱిపోయిన యపరాధులలో నే నొకఁడను.
నాపేరు దురంతకుఁడు. శ్రీనివాసయోగిసేవకుఁడను." అని చెప్పి
మఱింత యేడువఁజొచ్చెను. అప్పుడు జయచంద్రుఁడు తెల్లఁబోయి
నీ వాయపరాధివా? అయినను నీ విప్పుడు భయపడనక్కఱ
లేదు. అందులకు నిన్ను నేప్పుడు బాధించను. ధైర్య మవలం
బింపుము.

దురంతకుఁడు—నన్ను బాధించుచున్నది మీ భయ
ముగాదు. ఈ నా మనోపరితాపమునకు నా దుశ్చరిత్రమే కా
రణము. మీకు నాయెడల దయగలదేని నాకొకయుపకార
మును జేయుఁడు. మీయెడలను, చక్రవర్తిని యామినీపూర్ణతిల
కయెడలను నేను మహాపరాధమును నాచరించితిని. అదియే
యిట్లు పరిణమించి నన్ను బాధించుచున్నది. నాఁడు కృపాసిం
ధుని భైరవమఠమునుండి తమరు విడిపింపఁబోవునప్పుడు పీనుఁగుల
సాల బీగపుచెవిని సైరంధ్రి కోరినందున నేను దాని నామె
కొసఁగియుంటిని. ఆమె దానిని తిరిగియివ్వనందున నా నేరము
బయలుపడి నన్ను శ్రీనివాసయోగి భర్జింపఁజొచ్చెను. అపుడు
నాకు వానియెడల ద్వేషముగలిగి వానిదుర్నయమునంతయు

చక్రవర్తికి నివేదింప విజ్ఞాపనమును వ్రాసి యామెకుఁ బంప నిశ్చయించుకొంటిని. తరువాత శ్రీనివాసయోగి నా నేరమును క్షమించి మరల నెప్పటివలె నన్నాదరించుచున్నందున నాకోపము కొంతవఱకు నుపశమించినను నేను దానిని చింపివేయక నాచొక్కాజేబునందు భద్రపఱచితిని’’ అని చెప్పి శీలుచేసియున్న కాగితపుసంచి నొకదానిని పైకిఁ దీసి ‘‘శ్రీనివాసయోగి పరమదుర్మార్గుఁడు. వీనియాజ్ఞ ననుసరించి పెక్కుదుష్కృత్యములను జేసియుంటిని. అవియన్నియు నిపుడు జ్ఞప్తికివచ్చి నా మనస్సును వేధించుచున్నవి. చేసినపాపమును జెప్పినయెడల తద్దోషము కొంతవఱకు శమించుననుతలంపున నేను దీనినిపుడు నీకొసఁగుచున్నవాఁడను. దీని నెట్లయిన చక్రవర్తికి నందఁజేయుఁడు’’ అని జయచంద్రునకు దాని నర్పించి ‘‘నేను పాటలీపుత్రమునుండి ప్రతాపరుద్రునిసందేశమును శ్రీనివాసయోగికిఁ గొనివచ్చుచుండ నా కీయకాలమరణము సంభవించినది. భైరవమతము ముట్టడింపఁబడుచున్నదన్న ప్రతాపరుద్రుని సందేశమును శ్రీనివాసయోగి కెఱిఁగింపలేకపోతిని. నాకు శక్తిగలిగినను నే నాదుర్మార్గుని ముఖము జూడను. నే జేసినదోషకార్యములకన్నిటికిని శ్రీనివాసయోగియే కారకుఁడు’’ అని నుడివి బాధచే మాటాడనేరక కొంతసేపు కన్నులుమూసికొని యూరకుండి మరల ‘‘అయ్యా! మీ రీ శ్రీనివాసయోగి యెవ్వరో యెఱుంగుదురా? విష్వక్సేనసార్వభౌమునిజననకాలమున వాని తల్లికి విషప్రయోగము చేసి చంపినదుర్మార్గుఁడు. వీనిపేరు విరూ-



పాక్షుఁడు. వీఁడు తనకు విధించిన మరణదండనమును దప్పించుకొని పాఱివచ్చి భైరవమత మనుపాషండమతమును గల్పించి తాను గురువు నని పేరుపెట్టుకొని లోకమునంతయు నిట్లు బాధించుచున్నవాఁడు. ఈతఁడు ప్రతాపరుద్రునికి ముఖ్యప్రాణము. వీఁడు బహుదుర్మార్గుఁడు’’ వీఁడు మిమ్ముల నెట్లయిన జంపఁ బ్రయత్నించుచున్నవాఁడు. •వీఁడింకను మీకుఁ జేసియున్న యుపకారముల వెల్లడించుటకు నాకు శక్తిలేదు. మహారాజ్ఞి మీచేఁ బంపుకొనుచున్న విజ్ఞాపనము వలన సర్వము ముందు మీకుఁ దెలియఁగలదు. నా ప్రాణములు పోవుచున్నవి’’ అని చెప్పి కన్నులుమూసికొని మరణబాధ నొందుచుండెను. ఈసమాచారమునంతయు వినినతోడనే సత్రపుయజమానుఁడు లోని కేతెంచి సువర్చలను బిలిచి ‘‘నిద్రామందిరమున నెవ్వరిని బరుండఁబెట్టితివి?’’ యని యడిగెను.

సువర్చల—ఎవ్వరో పరదేశి తనకుఁ బ్రత్యేకించి గది నివ్వవలసినదని మోమోటము బెట్టినందున పరుండఁబెట్టితిని’’ అని నుడివినతోడనే సత్రపుయజమానుఁడు పండ్లు పటపట కొఱుకుచు ‘‘నేను జెప్పిన వానినందుఁ బరుండఁబెట్టనే లేదా’’ అని మిగుల కోపముతో ప్రశ్నించెను. ‘‘మీరు చెప్పినమనుష్యుఁడు నాకుఁ గనిపించనే లేదు.’’ అని యామె బదులు చెప్పెను. అపుడు సత్రపుయజమానుఁడు ‘‘చాలు మంచిపని చేసితివి’’ అని యామెను మందలించినతోడనే శ్రీనివాసయోగి యావృత్తాంతమును వినినప్పుడు దురంతకుని

17

దుస్థితి కంతగా విచారింపక "వీఁడు విశ్వాసహీనుఁడు. స్వామిద్రోహి. వీనికపటముచేతనే భైరవమఠమునుండి జయచంద్రుఁడు కృపాసింధువును విడిపింపఁగలుగుటకు కారణమైనది. వీఁడును సైరంధ్రియు జయచంద్రునితో నేకీభవించియుండుటచే నాతఁడు వాఁడు నన్నంతపని చేయఁగలిగెను. వీఁడు తాను నిరపరాధి నని వేఁడుకొనినను నాకది విశ్వాసనీయముగాఁ గనిపించలేదు. వీనియొద్దనున్న బీగముచెవి వానికెట్లులభించెను? వీఁడును దుర్ముఖుఁడును నచట కావలికాచుచున్నప్పుడు జయచంద్రుఁ డామార్గమున నెట్లుచరింపఁగలిగెను. దుర్ముఖుని యందు నాకించుకైన ననుమానము లేదు. నాయనుమానమంతయు వీనిమీఁదనే యున్నది. కొన్నికారణాంతరములనుబట్టి వీనిని శిక్షింపక విడిచిపెట్టినను దైవము విడిచిపెట్టక శిక్షించెను. వీనివలన బ్రతాపరుద్రుఁడేదియో నాకు సందేశమును బంపియుండును. కానిమ్ము! వాఁడు బ్రతికియుండిన నావలఁ దెలియవచ్చును. కాని నే నెంతప్రయత్నము చేసినను జయచంద్రుని నేను జంపలేకపోతిని." అని విచారించుచుండ సత్రపు యజమానుఁడు "స్వామీ! మనకు గొప్పప్రమాదము సంభవించినది. జయచంద్రుఁ డనుతలంపున నిద్రామందిరమున నెవ్వరినో నిరపరాధిని సంహరించితిరి.

శ్రీనివాస—అవును. వెనుకజరిగినదాని కిప్పుడు విచారించిన నేమిప్రయోజనము! అయినను నాదురదృష్టవంతుఁ డెవ్వఁడైయుండునో పరిశీలించుదము. అనిచెప్పినతోడనేసత్రము



యజమానుఁడు దీపమును జేతబట్టుకొని శ్రీనివాసయోగిని వెంబడించెను. శ్రీనివాసయోగి యారాత్రి నిద్రామందిరమున తాను నఱికియున్నమానవుని పరిశీలించినతోడనే గుండెలు మోదుకొని "అయ్యో! కుమారా నిన్ను నాచేతులతో నేను జంపుకొంటినా?" అని నెమ్మదిగా నేడువసాగెను. సత్రపుయజమానుఁడు నిర్ఘాంతపడి వానిని జూచుచుండెను. అపుడు జయచంద్రుఁడు తలుపుతట్టి సత్రపుయజమానుని బిగ్గరగాఁ బిలువఁజొచ్చెను. సత్రపుయజమానుఁడు వెంటనే జయచంద్రునిసమీపించెను. జయచంద్రుఁడు వానిని జూచినతోడనే "ఓయి! యీమార్గస్థుఁడు దొంగలచేఁ బొడువఁబడినందున గాయము దగిలి మిగుల బాధపడుచుండెను. నే నిప్పు డయోధ్యాపురంబునకుఁ జని చికిత్స చేయుటకు శస్త్రవైద్యునిఁ బంపెదను. అంతదనుక వాని నెట్లయిన నాదరించుచుండుము" అని చెప్పుచుండ శ్రీనివాసయోగి దానినాలకించి పుత్రశోకమును గొంతవఱకు మఱచి ఖడ్గధారియై జయచంద్రుఁడు బయలుదేరకపూర్వమే పాణిద్వారమున సత్రమునువిడిచి యావలకుఁజనెను. తరువాత జయచంద్రుఁడు దురంతకుని పరామర్శించినతోడనే నిజతురంగంబు నధిష్ఠించి వాయువేగమనోవేగంబుల నయోధ్యాపురంబునకుఁ జనుచుండెను. ఆ యశ్వ మతివేగంబున వారిధినిసమీపించుచుండ మిగుల తత్తరపడి వెనుకపాదంబులు పైకినెత్తి విసరివైచినతోడనే పెద్దధ్వని యొకటివినిపించినందున జయచంద్రుఁడువెనుకకుఁదిరిగిచూచెను. మనుష్యుఁడొకఁడు వెలికిలపడి గిజగిజతన్నుకొనుచుండెను. వాని

చేతనున్నకత్తి తూలి యావల కొంతదూరమున బడియుండెను.
జయచంద్రుఁడు వానినిగాంచిన తోడనే గుఱ్ఱమునుదిగి మొలను
వ్రేలుచున్నవాలును గేలఁదాల్చి "ఓరి శ్రీనివాసయోగీ! నీవు
మఱల దుర్మార్గమునకుఁ బ్రయత్నించితివేని నిన్నిప్పుడ నఱకి
చంపెదను." అని యదలింప నామనుష్యుఁడు "ఒకఁడు చంపనవస
రములేకయె నేనుజచ్చుచుంటిని" అనికంఠగతప్రాణుఁడై మిగుల
బాధపడుచుండెను. ఆతఁ డాసమయమున ననుభవించుచున్న
బాధ యమబాధకన్నను మిగుల దారుణముగాఁ గనిపించు
చుండెను. గుఱ్ఱపుతన్నుచే నాతఁడు క్రిందకూలినప్పుడు వాని
శరీర మాపాదమస్తకము ముండ్లుగ్రుచ్చుకొని వేధింపఁబడు
చుండెను. జయచంద్రుఁడు వానిని గాంచి జాలిపడి వాని శరీ
రమున గ్రుచ్చుకొనియున్న విషకంటకముల నెమ్మదిగా నూడఁ
బెఱికి తరుచ్ఛాయకుఁ గొనిపోవ వానిని మెల్లగా లేవనెత్తెను.
ఎంత లేవనెత్తినను వెనుపూసవిఱిగినందున శ్రీనివాసయోగి లేచి
నిలుచుండలేకపోయెను. అప్పుడు జయచంద్రుఁ డధిక ప్రయాస
మున వానిని నిజహస్తంబుల లేవనెత్తి చెంతనున్న చెట్టుక్రిందఁ
బరుండఁబెట్టి శత్రుత్వము నించుక పాటింపక మిత్రభావ
ముతో వాని నాదరించుచుండెను. ఆహా! యేమివానియోగ్యత!
చంపవచ్చినశత్రువునైనను దయతో నెటులనాదరించుచుండెను.
ఉత్తమపురుషులవ్యాపారములిట్టివియే. శ్రీనివాసయోగి జయచం
ద్రునిముఖముఁ జూచుటకు లజ్జించి కన్నులు మూసికొని బాధ
చే మిగుల పరితపించుచుండెను. తరువాత జయచంద్రుఁడు



మఱల గుఱ్ఱము నెక్కి యయోధ్యాపురంబుఁ బ్రవేశించిన
తోడనే సేవకులచే శ్రీనివాసయోగిని పట్టి తెప్పించి కారా
గృహమున నుంచెను. కాని వాని నందెంతమాత్రము బాధిం
పక వైద్యులచేఁ దగినచికిత్స చేయించి సర్వవిధముల నాదరిం
చుచుండెను. దురంతకునినయితము గొనితెచ్చుటకు నిజభటుల
నియోగించెను. కాని యాతఁ డానాఁటిప్రాతఃకాలముననే
విగతశరీరుఁడై కృతాంతసందర్శనంబున కేతెంచెను. సన్మా
ర్గము జయముతోఁ గలిగి ప్రకాశించుటకుఁ బూర్వమడఁగియున్న
ట్టి దుర్మార్గము నిజవినాశనమునకుముందు కొంతవఱకు విజృం
భించి లోకమును నాకులపెట్టుచుండును. శ్రీనివాసయోగిదోష
స్వభావ మింతవఱ కతిశయించి తుద కదియే వానివినాశనము
నకుఁ గారణ మగుచున్నది. జయచంద్రుని జంపఁదలచి కుమా
రుని తనచేతులతోఁ దాను జంపుకొనెను. జయచంద్రుఁడు
గుఱ్ఱము నెక్కి చనుచుండ వెనుకనుండి యాకస్మికముగా
వానిపైకెగిరి వానిని జంపప్రయత్నించుటచే యాగుఱ్ఱపు
తన్నువలన గ్రిందకూలి వెన్నుపూసవిరిగినందున మరణవేదన
నొందుచుండెను. నిజకుమారునిమరణమును, నిప్పుడు ప్రాప్తించి
యున్న శరీరబాధయు, నపజయమును, ఇవియన్నియు వానిహృద
యము నెటు దహించుచున్నవి? దీనికంతకును నాతఁ డింత
వఱకు నాచరించియున్న పాపకర్మమేగదా కారణము. అప్పుడాతఁ
డొందుచున్న మనోపరితాప మేమని చెప్పను. కర్మఫల మూరక
పోదని పెద్దలు చెప్పినసత్య మిదియే. ఇంతవఱకుఁ బ్రబలు

చున్న భైరవమతమున కిపుడు వినాశనము సంభవించుచున్నది శూరసేనుఁడు భైరవమతమును మట్టుడించి దాని నున్మూలించుటయేగాక యందుదాఁగియున్న దుర్మార్గులను పట్టితెచ్చి జయచంద్రునెదుట నిలిపెను. జయచంద్రుఁడు వారలనందఱిని కారాగృహమున వేఱువేఱుగా బంధింపనుత్తరువిచ్చెను. దురంతకుఁడు ప్రాణావసానకాలమున చక్రవర్తికి సమర్పింపవలసినదని తనకొసగియున్న విజ్ఞాపనమును జాగ్రత్తతో యామినికిఁ బంపుకొనుటయేగాక యింతవఱకు జరిగినసమాచారములను సార్వభౌమునకుఁ దెలియపఱచెను. తద్వృత్తాంతముల విమర్శింప విష్వక్సేనసార్వభౌముండు నిజసతీసమేతంబుగా నయోధ్యాపురంబున కేతెంచెను.



## ఇరువది నాలుగవ ప్రకరణము



అయోధ్యాపట్టణములో సభాభవనమున విష్వక్సేనసార్వభౌముండు భార్యాసమేతంబుగా సింహాసనాసీనుండై కొలువుదీర్చెను. సుదర్శనాదిసామంతరాజబృందంబును జయచంద్రకృపాసింధుశూరసేనులును నితరపరిజనంబులును నాసభాభవనంబంతయు నలంకరించి సార్వభౌమునిపట్టపురాణి యగుయామినీపూర్ణతిలక తననెచ్చెలిసుగుణమంజరిని గొనితెచ్చి తనచెంతఁ గూర్చుండఁబెట్టుకొనెను. భైరవమఠమునుండి శూరసేనుఁడు గొనితెచ్చినయపరాధులు సంకెలలతో బంధింపఁబడి సార్వభౌమునెదుట నిలువఁబెట్టఁబడిరి. శ్రీనివాసయోగి లేచి నిలుచుండలేనందున రాజభటులు వాని నిరుకెలంకులఁ బట్టుకొని సార్వభౌమునిసన్నిధానమున నిలువఁబెట్టిరి. ఆసమయమున విష్వక్సేనసార్వభౌముండు శ్రీనివాసయోగి నీక్షించి "ఓరి జగద్ద్రోహి! దుర్మతస్థాపకా! ఇంతవఱకు గూఢముగా నున్న నీదుర్వర్తనమంతయు నిపుడు బయలుపడినది. నాఁడు నేను కుండిననగరసత్రమున నీతో సంభాషించినవిజయపాలుని నీవిపుడు గుర్తించితివా? నాముఖమువంక తిన్నగాఁ జూడుము." అని నుడువ శ్రీనివాసయోగి వానిముఖము నీక్షించి "మహాప్రభో! అపరాధమునుక్షమింపుఁడు. నేను బాధచే మాటాడలేకపోవుచుంటిని" అని యవనతాననుండై యూరకుండెను. అప్పుడు

విష్వక్సేనసార్వభౌముడు—ఓరిదురాత్మా! నీనిజవర్తనము సర్వము వెల్లడింగింపుము. నీవు దాని నించుక మఱుగుపఱచితివేని నీప్రాణంబులు నీకు దక్కవు.

శ్రీనివాస—అయ్యా! నాకిపుడు చావన్నభయము లేదు. నే నీయవస్థయందు మృత్యుదేవతను ప్రాణమిత్త్రముగా భావించుచుంటిని. చావుమూలముననైన నాకీబాధ తొలంగిన జాలును. నావంటిదోషకారి కింతటియదృష్ట మింతట లభించునా? మీరు దండింపనవసరములేకయే నేను సర్వమును నివేదించెదను. నేను మీతల్లికి విషముబెట్టి చంపినరాజవైద్యుడను. నా నిజనామము విరూపాక్షుడు. మీతండ్రి నాకు మరణదండన విధించెనుగాని నే నింతదుఃఖ మనుభవింపవలసి యుండుటచే దానిని నేను సులభముగా దప్పించుకొనంగలిగితిని. అనంతరము ప్రతాపరుద్రునియనుగ్రహమునకు బాత్రుండనై వానియాదరణంబున. శ్రీనివాసయోగి యనునామధేయమును వహించి హిమవత్పర్వతమున భైరవమఠమును నిర్మించి భైరవమతస్థాపకుండనై యాచార్యపదవి నొంది ప్రజ్ఞావిశేషంబున శిష్యవర్గంబుచే బూజింపంబడుచు మహావైభవంబున నింతవఱకు మెలంగియుంటిని. ఇంతదనుక నావంక నెవ్వరును కన్నెత్తి చూడలేకపోయిరి. ప్రతాపరుద్రయుశీనాదిరాజవర్గంబు నాకు వశులై నన్ను సేవించుచుండ నాయంతవా రెవ్వరును లేరని గర్వించి సంచరించియుంటిని. దుర్వృత్తి ప్రబలంగలుగుట నిజనాశనముకొఱకుమాత్రమే యన్నసత్యము స్వానుభవము



వలన నిపుడు బోధపడినది. తుదకు నే నిపు డీజయచంద్రునికి మిక్కిలి పుత్త్రఘాతినై హైన్యభావముతో నాపాపఫల మనుభవించుచుంటిని” అనిరోదనముచేయసాగెను. అపుడు విష్వక్సేనుండు మఱల “ఓరీవిరూపాక్షా—ప్రతాపరుద్రునిభవనమున రెండులోహవిగ్రహము లున్నట్లును, అందొకటి పురుషవిగ్రహమనియు మఱియొకటి స్త్రీవిగ్రహమనియు వినియుంటిని. అవి యెవ్వరివో నీవెఱుంగుదువా?

శ్రీనివా—నేనెఱుంగుదును. పురుషవిగ్రహము ప్రతాపరుద్రునియన్న యగువిష్ణువర్ధనునిది. స్త్రీవిగ్రహము వానిభార్య శ్యామలాదేవిది.

విష్వక్సే—నీవు శ్యామలాదేవిస్వహస్తలిఖితము నెన్నడైన వీక్షించియుంటివా!

శ్రీనివాస—ఆమె జీవించియున్నప్పుడును నామెచని పోయినవెనుకను నామెలిఖితమును నొకటిరెండుమాఱులు గాంచియుంటిని.

విష్వక్సే—నీవు దాని నిప్పుడు గుర్తింపంగలవా?

శ్రీనివాస—గుర్తింపంగలనని తలంచెదను. ఓసార్వభౌమా! నాబాధ యధికముగా నున్నది. నడుమువిఱిగినందున నిలుచుండలేకపోవుచుంటిని. జయచంద్రునిగుఱ్ఱము తన్ని క్రిందబడవైచినప్పుడు దేహమున నాటియున్నకంటకసముదయంబు ప్రాణములకన్నను నన్ను ఘోరముగా వేధించుచున్నవి. నే నీబాధ భరింపంజాలను. నన్నెట్లయిన జంపి నాబాధ మాన్పి

రక్షింపుఁడు,, అని యతిదైన్యముతోఁ బ్రార్థింప సార్వభౌముఁడు వానిని గొంతవఱకు కరుణించి వానినందు పరుండనియోగించి వైద్యోపచారములఁ జేయించెను. ఆబాధనుండి కొంత తెప్పిరిలి నప్పుడు సుగుణమంజరి చేనుండి కొనితెచ్చిన కాగిదపుచుట్టను వానికిఁ జూపి ,, ఇందు లిఖింపఁబడినవర్ణసముదయంబును బరిశీలించి గుర్తింపు,, మని యడిగెను. శ్రీనివాసయోగి దానిని గాంచినతోడనే శ్యామలాదేవిహస్తలిఖితమును బోలియున్నదని నుడివెను. దానిని సార్వభౌముండు మరల నందుకొని సుగుణమంజరి కిచ్చి చదువనియమించెను.

సుగుణమంజరి యాకాగిదపుచుట్టను విప్పి చదువునప్పుడాసభాస్థలమున వేచియున్న రాజబృందమంతయు నిశ్శబ్దితులై యాకర్ణించుచుండిరి. ఆమెనోటినుండి వెలువడినప్రతిశబ్దము వినువారలహృదయముల పగిల్చి దుఃఖమున ముంచుచుండెను. దానినివినునప్పుడు యామినీపూర్ణతిలక లోపలనుండి పొరలివచ్చుచున్నదుఃఖము నాపుకొనఁజాలక సభ విడిచి యావలకుఁ జనఁబ్రయత్నించెనుగాని యందలికథావిషయ మామెను నావలకుఁ గదలనీయక నాకర్షించుచుండెను. సుదర్శనుఁడు వెక్కి వెక్కి యేడ్చుచుండెను. తరువాత విష్వక్సేనచక్రవర్తి దురంతకుఁడు తనయంత్యకాలమున యామినికిఁ బంపినసందేశమును నందుకొని దానిట్లుచదువఁదొడంగెను. ,,అమ్మా! ఈయుత్తరమును దమరు చదివినప్పుడు నన్నుబ్రతుకనివ్వరని చిత్తమున బెదరుగలిగియున్నను శ్రీనివాసయోగి నెట్లయినఁ బగదీర్చు



కొనవలయునన్న సహంకృతి దీనిని మీకు విశదపఱచుటకుఁ ద్వరపెట్టుచున్నది. లోకముపాలించుచున్నట్టి తమరు నీచకులమున జన్మించియుండలేదు. మీరు రాజవంశమున జన్మించిరి. ప్రతాపరుద్రుఁడన్న యగువిష్ణువర్ధనమహారాజు మీకుఁదండ్రి. వానిభార్య శ్యామలాదేవి మీకుఁ దల్లి. జయచంద్రుఁడు మీకుఁ బ్రియసోదరుఁడు. శ్రీనివాసయోగి పేరుగలిగినవిరూపాక్షునిప్రేరేపణచే ప్రతాపరుద్రుఁడు మీజననీజనకులఁ గడతేర్చెను. శైశవమునందు మిమ్ములను మీసోదరుని సంహరించుటకు నేనును గాలవుఁడును నియమింపఁబడితిమి. మేము దుర్మార్గకృత్యము లనేకములఁ జేయఁగలిగినను నీఘోరకృత్యములను మాత్రము చేయలేకపోతిమి. కాని మిమ్ము నే నయోధ్యాపురంబునకుఁ గొనిపోయి రహస్యముగా విక్రయింపఁజూపితిని. అపుడు సుదర్శనునిభార్య మిమ్ముల నావద్దనుండి కొని పెంచియుండెను. గాలవుఁడు నాయాలోచన ననుసరించి మీయన్నను గాశ్మీరదేశమునకుఁ గొనిపోయి యారాజున కమ్మివేసెను. విష్వక్సేనసార్వభౌముండు మిమ్ముల పరిణయమైయున్నట్టు వినియుంటిని. మీవామభుజమున పెద్దపుట్టుమచ్చయు పాదముల యందు చక్రకులిశరేఖలును గలిగియుండుటచే నిప్పుడు మీరు సులభముగా గుర్తింపఁబడఁగలరు. ఈదుర్మార్గమునకంతకును శ్రీనివాసయోగియు ప్రతాపరుద్రుఁడును కారకులు. ఇట్టిదుర్మార్గోపదేశము జేయుటచేతనే ప్రతాపరుద్రుఁడు శ్రీనివాసయోగి నగ్రస్థానముననుంచి పూజించుటకు కారణము. శ్రీనివాసయోగి

విహీనాత్ముఁడు. విష్వక్సేనసార్వభౌమునిజననకాలమున వాని తల్లిని విషప్రయోగముచేసిచంపినరాజవైద్యుఁడు. వీనికివిధింపఁబడినమరణదండనను దప్పించుకొని యీవేషమున చరించుచున్నపరమదుర్మార్గుఁడు. మీ రేమిచేసినను సరే. యథార్థమును బయలుపెట్టితిని. ఇట్లు దురంతకుఁడు" అంతకుపూర్వ మీ సందేశమును యామిని జదివియున్నను దీనిని వినునప్పు డామెకు దుఃఖ మాగక పొరలివచ్చుచుండెను. అందు వ్రాయఁబడిన విషయములన్నియు యథార్థములని శ్రీనివాసయోగి యొప్పుకొనెను. శూరసేనుఁడు భైరవమఠమునుండి దోషకారులను గొని తెచ్చినప్పుడు వారితో గాలవునినయితను గొనితెచ్చెను. వాఁడీసందేశమువం దుదహరింపఁబడినవిషయములన్నియు సత్యములనిమాత్రమేగాక జయచంద్రునిపసితనమున దాను గొనిపోయి కాశ్మీరదేశాధీశ్వరునకు విక్రయించినట్లు వక్కాణించెను. ఆసమయమున కాశ్మీరదేశాధిపతి చక్రవర్తియెదుట నిలువఁబడి "సార్వభౌమా! ఈగాలవుఁడు దేవరసమక్షమున నుడివినవిషయమంతయు యథార్థము. దీనిసత్యమంతయు వెనుక నే నాకు గోచరించినది. ఈయామినియు, జయచంద్రుఁడును నామేనగోడలసంతానము. గాలవుఁడీజయచంద్రు నమ్మదెచ్చినప్పుడు ప్రతాపరుద్రునిదుర్నయమునంతయు నాకు శ్రుతపఱచెను. శ్యామలాదేవితో నాకుఁగలసంబంధబాంధవ్యమునుబట్టి వీనిని గొనినను ప్రతాపరుద్రునివలన కీడుమూడునను భయంబున వానిని నాయింటనుంచక బ్రాహ్మణునింట నునిచి వానికి సర్వ



విద్యల నేర్పించితిని. తరువాత వానిమర్మము ప్రతాపరుద్రుఁడెఱింగెనేని ప్రమాదముసంభవించు ననుభీతిచేతనే వాని నారాష్ట్రమునుండి సాగనంపితిని. వాని నారాష్ట్రమునుండి వెడలనంపినను వానిని మఱువక యనిశంబు వానియోగక్షేమముల నారయుచుంటిని. ఈసుదర్శనుఁడు వీనికి మరణదండన విధించినప్పుడు వీనిని విడిపించుట కిదియే కారణంబు. ఈరహస్యమంతయు దాసికది వెల్లడియగువఱకు బయలుపఱుపక గూఢముగా నుంచితిని" అని నుడివినప్పుడు సుదర్శనుఁడు దిగ్గున లేచి జయచంద్రుని కౌఁగిలించుకొని "నాయనా! నీశత్రుకోటిలోఁ జేరి నేనును నిన్ను జంపఁబూనితినా" అని కన్నీరు నించుచు యామినిని చెంతఁజేర్చుకొని "అమ్మా నిన్నింతకాలము పెంచినను నీరూపగుణాదులనుబట్టియైనను నీబాంధవ్యములు గ్రహింపనేరక యన్యురాలవని భావించితిమి. మిమ్ముల చూచినప్పుడు నాప్రియసోదరి శ్యామలను గాంచినంతసంతోష ముదయించుచున్నది" అని తనకుమార్తె సుగుణమంజరిని జేరఁబిలిచి "అమ్మా! కుమారీ! మేధాజడిమంబున కలతెఱఁగెఱుంగనేరక భవదీయసదుద్యమంబు నింతవఱకు నిరాకరించితిని. సోమయాజిహస్తగతయాద్యంబు ధూమావిచ్ఛిన్నంబైయున్నను నగ్నిహోత్రింబునుం గాక వేఱొండు బతెనంబునొందును. పరభృతంబు లలితరసాలపల్లవంబులందక కుటజంబులజేరనెంచునే! పావనీయం బగుత్వదీయహృదయం బుత్తమపదార్థంబునుంగాక తదన్యవిషయంబు నెన్నఁడైనజేరనెంచునే" అని కూఁతునిమన

శ్రద్ధ నభినందించుచు నామెకరకిసలయంబు జయచంద్రపాణి
పంకజంబునం జేర్చి " జయచంద్రా! ఈపరమపావనిపాణి
గ్రహణంబున నాయపరాధంబు మన్నింపుము. యౌవనారంభ
ము మొదలీ జవ్వని నెవ్వనినిం బరిగ్రహింపనొల్లక నీనెయ్యంబు
నభిలషించుచున్నది. ఈమెను ధర్మపత్నిగాం బడసి యీకోసల
రాజ్యంబును బరిపాలింపుము " అని నుడువ జయచంద్రుఁడు
" మాతులా! మీయెడల పితృభావంబుగాని శత్రుత్వ మెన్న
డును లేదు. ఈకోసలరాజ్యపరిగ్రహణంబునకన్నను నీకోమ
లాంగిపాణిగ్రహణం బధికసంతోషదాయకంబు. అమితసౌఖ్య
ప్రదంబు " అని వానిమనోభావంబును వెల్లడించినప్పుడు
నుగుణమంజరి యానందపారవశ్యంబున కొంతదనుక మైమఱ
చెను. " నేఁటికిగదా మనయిష్టార్థము సిద్ధించె"నని తమచేతో
మోదంబు నన్యోన్యవీక్షణంబుల సూచించుచుండిరి. నేఁటి
వృత్తాంతమంతయు నీవధూవరులకుమాత్రమేగాక నీసభికుల
కందఱకును సంతోషతరముగా నుండెను. ఇంతవఱకు జయ
చంద్రుఁడు బ్రాహ్మణుఁడనియు యామిని నీచకులసంభవురా
లనియు భావించుచున్న జనంబులు వీరియథార్థము నిపుడు విశద
మైనందున మిగుల సంతోషించుచుండిరి. ఈసంతోషసమయ
మునందుసయితము ప్రతాపరుద్రునియొక్కయు శ్రీనివాసయోగి
యొక్కయు దుర్మార్గకృత్యములు వారలహృదయానందమును
కొంతవఱకు నడచిపెట్టి పరితాపమును గలిగించుచుండెను.
ప్రతాపరుద్రునియన్న యగువిష్ణువర్ధనుని క్రూరముగా వధించు



ట, శ్యామలాదేవిని నిర్బంధించి దారుణంబుగా హింసించుటయు
మొదలగుక్రూరకార్యంబులు వినువారలహృదయనాళంబుల
భేదించి పరితపింపఁజేయుచున్నవి. ఆసభామంటపమున శ్రీనివా
సయోగి యనుభవించుచున్న దారుణవేదనంబు జూచినమాత్ర
మున కాఠిన్యహృదయములైనను గఱఁగించి జాలిపుట్టించు
చున్నను వానిదుశ్చరిత్రంబు శ్రవణమాత్రంబున నవనీత
కోమలములైనమృదుహృదయములయందుసయితము వాని
యెడల కాఠిన్యభావమును నిర్దయత్వమును గలిగించుచుండెను.
అపుడు విష్వక్సేనసార్వభౌముండు దురంతకునిసందేశమును
మరల యొకటిరెండుమాఱులు జదివి జయచంద్రుని జూచి
" రాజకులవతంసమా! మూలమునువిడిచి శాఖలనఱికినంతమా
త్రమున వృక్షమెన్నటికిని జావనేరదు. ఈదుర్మార్గవృక్షమునకు
మూలంబు శ్రీనివాసయోగి. ఈవిరూపాక్షుండు ప్రకాండంబు. ఈ
జనంబులు శాఖలు. ప్రతాపరుద్రునిపీచమడంచిననేగాని యీదు
ర్మార్గము మొదలంట నశింపనేరదు. వీరలదుర్మార్గము నేనెఱింగి
యుండియు నింతవఱకు వీరలసాధింపలేకపోతిని. నాసార్వభౌమ
బిరుదాంకమును సార్థకపఱచిన మేటిమగండవు. నీవు వానినెట్ల
యిన గొనితెచ్చి నాయెదుట నుంచుము. దేశమునకు నెమ్మ
దిని గలిగింపుము. " అనినుడువ యామిని దీనవదనముతో
" సార్వభౌమా! ఆతఁడు దుర్మార్గుఁడైన నాకుఁ బినతండ్రి
యగుటచే నారక్తసంబంధమును విచారించి వాని నెట్లయిన
మన్నింపుఁడు " అనిప్రార్థింప సార్వభౌముండు " ఓసి ముగ్ధ

వనితా! వీనిబాంధవ్య మభినందింపఁ దగియున్నను దుర్మార్గమున
చరించుచున్నప్పుడు ప్రాణబంధువునైనను దండింపక విడిచి
పెట్టుట రాజధర్మము గాదు. రాజునకు దుష్టశిక్షణంబును శిష్ట
జనరక్షణంబును శ్రేయోదాయకంబులు" అని పలికి ప్రతాప
రుద్రుని బట్టి తెచ్చుటకు కఠినముగా నుత్తరవు చేసెను. తరు
వాత శ్రీనివాసయోగి సార్వభౌముఁడు ప్రశ్నించినందుఁ గృపా
సింధును భైరవమఠమునందు బంధించుట మొదలయినదుర్న
యంబుల కన్నిటికిని తాను కారణభూతంబని విన్నవించెను
నాఁటికి విచారణ ముగింపఁబడినందున నపరాధులందఱును
మరల కారాగృహమునందు బంధింపఁబడిరి.



## ఇరువది యైదవ ప్రకరణము.



ప్రతాపరుద్రుఁడు దుష్కృత్యములు పెక్కులొనర్చి
చున్నను సిరిసంపదలయం దాతనికించుకయు కొఱత లేక సన్మా
ర్గప్రవర్తకులకన్న నెక్కువవైభవంబున బ్రకాశించుచుండెను.
ఐశ్వర్యవిషయమునందును పుత్రసంపదయందును వీనిమించిన యదృ
ష్టవంతుఁడు లోకమున మఱియొకఁడు లేఁడని దీనినిగాంచినవా
రందఱును తఱుచు చెప్పుకొనుచుండిరి. ఇంతవఱకు ప్రతాపరు
ద్రుఁడనుభవించుచున్నసౌభాగ్యమునుబట్టి దుర్మార్గులే యిహ



సౌఖ్యమునందు సజ్జనులకన్న నధికులై సర్వశుభముల ననుభవిం
పఁగలరని లోకులు భ్రమించుచుండిరి. కాని కొంతకాల మరి
గినపిదప ప్రతాపరుద్రునిశరీరపాటవము కృశించినట్లు వాని
యౌన్నత్యము క్రమక్రమముగా క్షీణింపమొదలుపెట్టెను.
వ్యాధివర్గంబు వానిశరీరము నాక్రమించి వానిని మిగుల బాధిం
పఁజొచ్చెను. వయస్సు హెచ్చినకొలఁదిని చిత్తశాంతి నశించి
వానిమనస్సున కొకవిధమైన యారాటము సంభవించుచుం
డెను. కారణము లేకయే హృదయమునకు దిగులుగలుగుచుండె
ను. వానిపుత్రులార్గురు నొక్కవత్సరమున నొకరివెంబడి
నొకరు లోకాంతరవాసులయిరి. వానిభార్యయు చనిపోయెను.
వానిశరీరమున దారుణవ్రణమొకటి బయలుదేరినందున నాతఁడు
చూడ చుట్టమును మ్రొక్క దైవమును లేక పరితపించుచుం
డెను. ధనాశాపరులైన సేవకులు తప్ప వానిని నాదరించఁగలిగిన
యాత్మబంధువులెవ్వరును లేరు. ఇప్పు డాతనిఁజూచినవారంద
ఱట్టిదశ పగవానికైన రాఁగూడదని తలంచుచుందురు. ఆతఁడు
సంపాదించినరాజ్యమును ధనమును వాఁడనుభవించుచున్న
బాధనుండి వానిని దొలఁగింపలేకపోవుటయేగాక వానిని జూచి
నప్పుడెల్ల వానినిమిత్త మాతఁడు చేసియున్నదుష్కృత్యములు
స్మరణకువచ్చి వానిహృదయమును దహించుచుండెను. చనిపో
యినపుత్రులకన్నను దేహమునాశ్రయించియున్నవ్రణము
కన్నను నాతఁ డాచరించియున్నదోషకార్యములు జ్ఞప్తికివచ్చి
వానియాత్మను గలంచుచుండెను. ప్రతాపరుద్రుఁ డీవిధముగా

చిత్తవికలంబు గలిగి బాధపడుచుండ శూరసేనుఁడు వాహినీ సమేతంబుగా పాటలీపుత్రంబున కేతెంచి రాజభవనమును ముట్టడించెను. మగధసైన్యాధిపతి వానినెదిరించి పరలోకగతుఁడైనందున మగధసైన్యమంతయు చెల్లాచెదరై పఱతెంచెను. ఆసమయంబున శూరసేనుఁడు నిజభటులు కొందఱు వెంబడింప లోని కేతెంచి ప్రతాపరుద్రుని గాంచి “ఓరి! భ్రాతృహతకా! సార్వభౌమునాజ్ఞానుసారంబుగా నిన్ను శృంఖలానిబద్ధునిగావించుచుంటి” నని చేతులకు సంకెలలఁ దగుల్చుచుండ కెవ్వున కేకపెట్టి ప్రతాపరుద్రుండు శమనునిశాంతంబున కేతెంచెను. ఇఁకఁ జేయఁదగినదేదియు లేనందున శూరసేనుఁడు వానిని విడిచిపెట్టి యానగరమున నున్న లోహవిగ్రహముల రెంటిని శకటసహాయంబున నయోధ్యాపురంబునకుఁ గొనిపోయి సార్వభౌమునెదుట నుంచినతోడనే ప్రతాపరుద్రుమరణవృత్తాంతమంతయు నివేదించెను. సార్వభౌముండును సభికులును నావిగ్రహములఁ బరీక్షించిరి. అందుగనిపింపఁబడిన యాకారలక్షణములన్నియు జయచంద్రునందును యామినియందును ప్రత్యక్షంబుగాఁ జూపట్టుచుండెను. అందువలన జయచంద్రునియొక్కయు, యామినియొక్కయు సత్కులసంభవత్వము మఱింత గాఢనిదర్శనముతో ఋజువుచేయఁబడెను. అనంతరము శ్రీనివాసయోగికి మరణదండన విధింపఁబడెను. కాని యట్టియవసరము లేకయే వెనుప్రాస విఱిగినందున వాఁడు దారుణవేదనను బొరయుచు చనిపోయెను. భైరవమతమునుండి కొనితేఁబడిన దుర్ముఖగాలవమారీచాది



దోషకారులందఱును కఠినముగా దండింపఁబడిరి. కుండినగరములోనిసత్రపుయజమానునిసహితము పట్టితెప్పించి సార్వభౌముండు మిగుల కఠినముగా శిక్షించెను. ఇంతవఱకు మహాకల్లోలముగానున్న దేశమంతయు నెమ్మదికలిగియుండెను. ఇప్పటికి భైరవమతము సమూలము నశించెను. భైరవమతస్థులెవ్వరైన నొకరిద్దరు మూలలందు దాగియున్నను వారుసహితము నామతముయొక్క దురాచారములను విడిచి సదాచారసంపన్నులై మెలగుచుండిరి. ఇంతవఱకు యామిని తనహృదయమునఁ బాదుకొనియున్న సద్భావములకును పారమార్థికబుద్ధికిని గారణభూతుఁడని యెంచి జయచంద్రుని భక్తివిశ్వాసంబులతో ప్రేమించుచుండెను. ఆతఁడేకగర్భజనితుఁడని తెలిసినప్పుడామె ప్రేమయు విశ్వాసంబును మఱింత యతిశయించి యామెకుఁ బట్టరాని సంతోషమును గలిగించుచుండెను. అప్పుడు విష్వక్సేనసార్వభౌముండు మహాగౌరవంబుతో జయచంద్రుని సమీపించి “ఓయి పురుషసత్తమా! నీయుత్తమచారిత్రంబును, నపరిమితబలశౌర్యవిక్రమంబులును నలువకైనను వేనోళ్లచిలువకైనను నభివర్ణింప నశక్యంబైనవి. నీయందు కనిపించుచున్న శాంతశమదమాదిసుగుణంబులును ధనుర్విద్యావివేకంబును బరికించి పరశురామమూర్తివని తలంచుచుంటిని. ప్రతాపరుద్రుని దుర్నయమునుండి నన్ను గాపాడుటయేగాక దేశకల్లోలమును మాన్పి నాసార్వభౌమబిరుదాంకమును సార్థకపఱచితివి. ఈయామినిమూలమున మనకుఁ గలిగియున్న బాంధవ్యముకన్నను నీవు

నాకుఁ జేసియున్న మహోపకారము నే నెక్కుడుగా నభినుతించె
దను." అని ప్రశంసింప జయచంద్రుఁడు "సార్వభౌమా! నా
యందలి దయచే మీ రిట్లు నుడువుచుంటిరి. దుర్మార్గులవినాశం
బునకు నాప్రజ్ఞావిశేషంబని భావింపకుఁడు. అగ్నిహోత్రము
స్వాశ్రయమును దహించునట్లు దుర్మార్గము తా నాశ్రయించి
యున్న మానవులనే నశింపుచుండును. ఎవరికర్మంబు వారలనే
యంటుచుండును. ఒకవేళ మీరు నాకర్తృత్వ మించుకఁ గల
దని భావించితిరేని యందలియాధిక్యత యీమహానుభావుఁ
జెందుచున్నది." అని కాశ్మీరరాజును ప్రేమతోఁ జూపి
"నాకుఁ దల్లిదండ్రులు లేనివెత్తి పొడసూపకుండ నీరాజచం
ద్రుఁడు నన్ను మిగుల గారవమునఁ బెంచి నన్నింతవానిగాఁ
జేసెను. నాయందు లోకమునకుఁ గనిపించుచున్న యోగ్యతకం
తకును నీతఁడే కారణంబు," అని యారాజవతంసమును వినయ
ముతో నభినందించుచుండెను. తరువాత శుభముహూర్తమున
శాస్త్రవిధిని ననుసరించి మహావైభవంబున జయచంద్రునకును
సుగుణమంజరికిని బరిణయమహోత్సవమును జరుపఁబడెను.
ఇంతవఱకు భూమిపై జరుపఁబడినవివాహములన్నిటికన్నను
నిది మిగులయుత్కృష్టమై యీశ్వరదృష్టికి మిగులప్రియతమమై
ప్రకాశించుచుండెను. సుగుణమంజరిమనోసంకల్ప మిప్పటికి
సిద్ధించినది. చిరకాలలభ్యమైనయీమెపొందు జయచంద్రునకధి
కముదావహంబై తాను ముందుపొందఁబోవుచున్న శాశ్వత
సుఖమునకు ప్రథమసోపానముగా గనిపించుచుండెను. తరు



వాత, జయచంద్రుఁడు మగధరాజ్యమునకు ముఖ్యవారసుఁడగు
టచే తద్రాజ్యలక్ష్మీసహితము పరిగ్రహించుటయేగాక, సుగుణ
మంజరిదక్క సుదర్శనునకు వేఱుసంతానము లేనందున సుద
ర్శనునియనంతరమున కోసలరాజ్యమునకుఁగూడ పట్టాభిషిక్తు
డయ్యెను. కృపాసింధువు కలభాషిణియుపదేశంబున తనపితృ
ధనమంతయు శూరసేనుఁడు తనకుఁ జేసియున్న మహోపకారంబు
నకుఁ గానుక నొసగియున్నందున నాతఁడు దానిని మట్టుక తన
చెల్లెలుభువనమోహినికి విడిచిపెట్టెను. పితృధనమును విడిచిన
తోడనే కృపాసింధువు భార్యాసమేతుఁడుగా సింధుదేశంబున
కేతెంచి తద్రాజ్యలక్ష్మీపరిగ్రహణంబున దివిజేంద్రవైభవం
బున సుఖించుచుండెను. శూరసేనుండును కోసలదేశమునకు
సైన్యాధిపతియై సిరిసంపదలు గలిగి విరాజిల్లుచుండెను. భువన
మోహినికి ననుతాపము బొడమినందున దుర్వృత్తి నొంది యోగి
నియై సన్మార్గము నవలంబించి సుగుణమంజరిని సేవించుచు
దినంబులు గడుపుచుండెను. లోకమున క్రమక్రమముగా దుర్మా
ర్గము నశించి సన్మార్గము ప్రబలుచుండెను. ప్రారంభమున
దుర్మార్గము కొంతవఱకుఁ బ్రబలినను తుదకు నశించుటయు
సన్మార్గ మారంభమున కొంతవఱకు నోటమిఁజెందినను తుద
కు జయము గలిగి ప్రకాశించుటయు నీశ్వరోద్దేశ మని
గ్రహింపఁదగి యున్నది.

———o———

